# భారతి

మాసపత్రిక

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

సెప్టెంబరు 1967

సంపుటము : 44 : : సంచిక 9 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# వి ష యా ను క్ర మ ణి క

## సెప్టెంబరు 1967

# మరింగంటి అప్పలదేశికులు - "శ్రీ రామపాదుకా స్తవము"

[శ్రీరామపాదుకాస్తవమను నీ సంస్కృత లఘుకృతి కర్త మరింగంటి అప్పల దేశికులు (ఆచార్యులు). ఈయన ఆంధ్రభాషాయోష కమూల్యాలంకారము లొనగూర్చిన సుప్రసిద్ధ కవిపండితుల కాలవాలమైన మరింగంటి కవులలో నొకఁడు. మాకు లభించినంత వరకీయన కృతి యొకటే యీ 'శ్రీరామపాదుకా స్తవము'. అన్యరచన లేమైన గలవేమో తెలియదు.

మరింగంటి కవుల ప్రబంధములతోబాటు లఘుకృతు లెన్నియో అజ్ఞాతముగను—అప్రకాశితము గను గలవు. అట్టివానిలో నీ స్తవ మొకటి.

చాలకాలమునుండి మా యింటగల ప్రాచీన సంస్కృతాంధ్రగ్రంథ సముదాయమున బడియున్న దీనిని మా తండ్రిగారు రుద్ధరించి యుంచినారు. నాకు తెలిసినంతవరకు దీని ప్రతు లిక రెండు—అందొకటి—డాక్టర్ శ్రీ బిరుదురాజు రామరాజుగారి వద్దను, వేరొకటి శ్రీ మరింగంటి పురుషోత్తమాచార్యులు (సూర్యాపేట)గారివద్దను గలవు. వానితో నాదగ్గర గల యీ ప్రతిని సరిజూచు నవకాశము కలుగనందు లకు విచారించుచున్నాను.

ఆధునిక కాలమున (ఇటీవల) మరింగంటి కవులనుగూర్చి తెలిపిన శ్రీ బి. రామరాజుగారు ఈ స్తవమునుగూర్చి తెలుపకపోవుటచే నాకీ యవకాశము లభించినది—సంతసము.

ఈ శ్రీరామపాదుకాస్తవ రచయితయైన అప్పలాచార్యులు నల్లగొండజిల్లా—హుజూర్‌నగర్ తాలూకా 'యాదవాకిళ్ల' గ్రామవాసి. సుమారు 110 సంవత్సరములకు పూర్వుఁడు. ప్రస్తుత స్తవమున పేర్కొనబడిన 'నృసింహపుర' మిచటికి యనగా 'యాదవాకిళ్ల'కు సమీపమున గలదు. ప్రస్తుత మాగ్రామము సూర్యాపేట తాలూకాకు చెందియున్నది. అచట శ్రీరామాలయము గలదు—చిన్నగుట్ట గలదు. అచటి స్వామిని గూర్చి చెప్పినదే యీ 'శ్రీరామపాదుకాస్తవము.'

ఈ మరింగంటి కవులు దేవరకొండ తాలూకా 'కనగల్లు'నందును, దానికి సమీపమునగల 'అనుముల' యందును (మిర్యాలగూడెం తా.), అనుములనుండి వెళ్లి 'యాద(త) వాకిళ్ల'యందు స్థిరపడినవారు కొందరును గలరు. వీరేగాక ఓరుగల్లు మండల మందలి 'మల్లంపల్లి'యందును కొంద రున్నటుల తెలియుచున్నది.

ఈ అప్పల దేశికులనుగూర్చి తెలిసికొనుటకు ఎట్టి ఆధారములు లభించుటలేదు.

180 సంవత్సరములకు పూర్వుఁడైన మరింగంటి వెంకటనరసింహాచార్యులను కవివర్యునిచే రచియింపఁబడిన 'గోదా వధూటీ పరిణయ'[1]మను ప్రబంధ కృత్యాదియందు తత్కర్త వారి వంశచరిత్రను సమగ్రముగ నొసంగియున్నాఁడు. అందు అప్పలాచార్య నామధేయులు ముప్పురు గలరు. వారందరును గోదావధూటీ పరిణయకర్తకు పూర్వులే. పైన చెప్పబడిన అప్పలాచార్యత్రయమున నీతని నొక్కనిగా భావింతుమేని 200 సంవత్సరములకు పూర్వుఁడగును. అట్లుగాక తరువాతివాడు గావచ్చునేమో!

---

1. గోదా వధూటీ పరిణయము--1956 సం. 'నల్లగొండ మహిళాభక్తసమాజము'వారిచే ముద్రితము. దీని సంపాదకులు—శ్రీ ఆసూరి మరింగంటి శ్రీరంగాచార్యులవారు. వీ రిటీవలనే పరమపదించిరి. బహువిధతాళపత్రగ్రంథ సంపాదన మొనరించి—తమ స్వగ్రామమైన 'కనగల్లు'నందు 'తాళపత్రగ్రంథ నిలయము'ను నెలకొల్పినవారు. వీరివద్ద నెన్నియో యమూల్యగ్రంథము లుండెడివి.

'గోదావధూటీపరిణయ' మందు పేర్కొనబడిన అప్పలాచార్యులలో నొకఁడందమా! చాల పూర్వుఁడు: శ్రీరామరాజాగారి యభిప్రాయము ననుసరింతమా! ఎట్టి యాధారము కన్పించుటలేదు. కావున నీ రెండు కాలములు సంశయాస్పదములే. —

ఈ కవి 'గోదావధూటీపరిణయ' కర్త వంశమునకు చెందినవాఁడు గావచ్చును. ఏలనన పూర్వుల నామములు తరువాతివారికి పెట్టుట సంప్రదాయము. ఈ కవివర్యునకును అట్లే జరిగియుండవచ్చును. ఐనచో 'గోదావధూటీపరిణయ' కర్త యైన వెంకట నరసింహాచార్యుల తరువాతివాఁడు గాన గును. ఆ విధముగ చూచిన ఈ అప్పలదేశికులవారు 110, 115 ఏళ్ల క్రిందివాఁడగును.

ఈతనినిగూర్చి సరియైన యాధారములు లభించువరకు నేను నిర్ణయించుకొనిన కాలమనియే విశ్వసించుచున్నాను. దీనినిగూర్చి ఎవరైన పరిశోధింతురు గాత!

## ఇ త ని క వి త్వ ము

అప్పలాచార్యుల శ్లోకములు కొన్నిమాత్రమే లభించినవి. వీరివి యితర రచన లేమైన గలవో! ఆంధ్రకవితావైశారద్య మున్నదో! తెలియదు: కాని ఈ లభించిన కొద్దిశ్లోకములే అప్పలాచార్యుల కవితా రచనా ప్రతిభకు ప్రతీకములుగ గ్రహింపదగినట్టున్నవి. సరసమధురమై, గంగాప్రవాహనిభమైన వీరి శైలిని పరిశీలించినప్పుడు—వీరి యితర రచన లేమైననుండి లభింపకపోయినచో మన దురదృష్టమును నిందించుకొనకతప్పదు. వీరి లఘు 'శ్రీరామపాదుకాస్తవము'లో లేఖకుల మూలముగ వచ్చినట్లున్న శైథిల్యము లున్నవి. వానిని పండితులు పరిష్కరించెదరుగాక—

కవి ప్రథమ శ్లోకములో గురువులకు నమస్కరించి తన వినయసంపద నావిష్కరించినాఁడు. కాని గురువుల పేరేమో తెలుపలేదు. గురునామగ్రహణము సంప్రదాయముకాదు గదా!

ఇక వీరి కవిత్వమునుగూర్చి మనము చెప్పుట కన్న కవి పేర్కొనిన 'మరంద కదళీ సుధా మధు రసాల—'అను శ్లోకమే వారి విషయములో యథార్థమును తెలుపుచున్నది. వీరి కవిత్వమున ప్రౌఢత్వముతోబాటు సరసత్వము కాననగును.

'ఇదం దశరథార్జితం భరతలక్ష్మణాభ్యర్చితం
తపోధన మనోధనం సకలసంపదాం సాధనమ్
నృసింహ నగరాన్తికే జయతి రామపాదద్వయం
శిలాముకుర చుమ్బితం రహసి సీతయా చుంబితమ్.'

రామపాద విశేషణములలో అంతగా వైశిష్ట్యము లేని ఈ శ్లోకము ప్రథమ చరమ విశేషణములతో ఒక నూతనశోభను పొంది అద్వితీయమై నిలిచినది. వీరి కవితాచాతురి కిది నిదర్శనము, 'రహసి సీతయా చుంబితం' అని అనగల్గుట అప్పలాచార్యులకే చెల్లినది. అందుకే వేరొకచోట రామునికి 'క్షమాపుత్ర్యా స్వాక్ష్మా దధరదళమాధుర్యవిదుషే' అని విశేషణము వేయగలిగినారు.

'రామాయ క్షితికన్యకావిహరణారామాయ—'
'నమోరామాయాస్తు ప్రతిదిశసమేతాసుర—'

అను ఈ శ్లోకములు వీరి సరసమధుర ధారాళమైన శైలికి నుదాహరణములుగ పేర్కొనవచ్చును.

ఇంకను—'అస్తుస్వస్తి—'అన్న శ్లోకము 'సదయే హృదయే'ఇత్యాదులు శబ్దాలంకారములకు నిదర్శనములు.

ఇట్టి వీరి రచన లింకేమైన లభించినచో గీర్వాణ సరస్వతి ఇతోఽధిక భూషణాలంకృతయై విరాజిల్లగలదు.

కవినిగూర్చియు — తత్కవితారీతినిగూర్చియు నాకు దోచినవిధముగ దెలుపుటయేగాక- 'శ్రీరామపాదుకాస్తవము'ను గూడ లభ్యమైనంతవరకు యథాతథముగ నొసంగితిని. ఇందలి లోపములను తెలిపిన కృతజ్ఞతతో స్వీకరింతును.

నావద్దగల ఈ స్తవమును చదివి—ప్రకాశ మొనరింపుమని ప్రోత్సాహ మొసంగుటయేగాక నాకు ఎంతగనో సాయపడిన మిత్రులు—సంస్కృతాంధ్ర భాషాపారంగతులునైన శ్రీ భాగవతను రామారావుగారికి కృతజ్ఞతలు.

శ్రీరంగాచార్య.

# శ్రీ రామ పాదుకా స్తవము

అస్మద్గురు -సు నమో
యత్ప్రసాద ప్రభావతః
రామః ప్రసన్నో న స్సాక్షా
ద్వాఞ్ఛితాదధికప్రదః

ఆవిర్భూతౌ దశరథసుతౌ శ్రీనృసింహాగ్రహారే
హారేజేతత్సరసనవిధౌ హార్దశీతాచ సీతా
ఆదౌ పాదౌ స్వయ మకురుతా మత్రచిత్రాంబురాశే
రన్తర్జ్ఞన్తూ నఖిలహృదయద్రావణౌ రావణారేః (రీ)
చిత్రం యత్ర శిలాతలేసు ఘటితం రామేణ పాదద్వయం
సాక్షా ల్లక్ష్మణవారుణాస్త్రవిభవా జ్జాతంచ శీతం పయః
సీతాయాః కరుణాకటాక్షవిభవా త్సంపాదితాః సమ్పదో
మిత్రై రత్ర వృతో నృసింహనగరే జీవేయ మాయుశ్శతమ్:

మాభూయా త్కల్పవాటీ స్ఫటికమణికుటీ రత్నపేటీ వధూటీ
శాటీవీటీపటీరై ర్ఘటితమపి సుఖం సోన్తరాటీకతా న్నః
ధాటీరక్షఃకరోటీ ఘటనవిఘటనద్వారఝాటీ కవాటీ
కోటీలంకానిశాటీకటుతరపటుతానాటక స్తాటకారిః

సీతాలక్ష్మణపూర్ణపార్శ్వయుగళం స్మేరాననామ్భోరుహం
మేఘశ్యామ ముదారబాహుపరిఘం విస్తీర్ణవక్షఃస్థలమ్
కర్ణాన్తాయతలోచనం కటితటీసంవీతపీతాంబరం
ధ్యాయే స్మత్కులభాగధేయచరణం రామం జగత్స్వామినమ్

శిలాతలకృతాస్పదం పద మవేక్ష్యసాసూయయా
యయా కుటిలవీక్షితక్షితిజరోచిషా చక్షుషా
తయా మధురసాన్త్వనై ర్మనసి శీతయా సీతయా
నృసింహపురరాఘవో నిభృత మాదృతః పాతు నః

ఆత్మాశ్రితానా మమృతస్య పాదౌ
యోగీన్ద్రసన్మానసజాలపాదౌ

సన్తాపనిర్వాపణచన్ద్రపాదౌ
పత్యూ రఘూణాం ప్రణమామి పాదౌ

సాక్షా దక్ష్ణోః స్వయ మకురుతా మత్ర రామస్య పాదౌ
సార్థం సార్ధోఽప్యజని జనుషా దేశికస్యోపదేశః
పూర్వం సర్వం దురితమపి మే భూరి దూరే పరాస్తం
జీవః కోవా భువి కవయితుం మత్సమృద్ధిం సమర్థః

సత్యం జగత్సదితరా మిదమేవ జీవన్
భద్రాణి పశ్యతి వచః ప్రతిభాతి యస్మాత్
అస్మాభి రాభవపయోధితలం ప్రవృష్టై
ర్దృష్టాఙ్ఘ్రిరత్నసులభః కలభో రఘూణామ్

నమో రామాయాస్తు ప్రతిదిశసమేతాసురచమూ
సమూహప్రాణౌఘప్రశమననిరాయాసధనుషే
సమీరవ్యాలోలత్కువలయదళశ్యామవపుషే
క్షమాపుత్ర్యా స్సాక్షా దధరదళమాధుర్యవిదుషే

నమ స్తుభ్యం మాతు ర్నిమికులసముద్రోత్థితసుధే
ప్రధీయా న్నాథ స్తే భ్రుకుటిభటకోటీసుఘటితః
యత స్త్ర ద్భూవల్లీకృతసదుపదేశేన పురతః
స్థితే నష్టే (స్పష్టే)ఽప్యపగమ దపహర్తుం మణిమ్మృగమ్

నమస్తే సౌమిత్రే! నను వినయశీలేన భవతా
హ్యయోధ్యారథ్యాయా మపి విపినదేఽశే నుసరతా
న రామో రామ స్తే సతతఘటితః పక్షపుటయో
రలం త్రాత స్త్రాత త్వయి జయతి సౌభ్రాత్రగరిమా

కనకమృగనిగాళచ్ఛేదనాక్షుణ్ణరత్నా
జ్కురపరిణతధూళీధారణాశోణబాణః
అదిశ దిహ శరణ్యా స్సానుజ స్సానుజాయా
స్స్వచరణమణియుగ్మం సార్వభౌమో రఘూణామ్

ప్రాయేణ ప్రణయేషు యత్ర్పణయినీపాణిక్వణత్కఙ్కణ
శ్రేణీ శోణ మణిప్రణీత కిరణోద్గారేణ నీరాజితం

## శ్రీ రా మ పా దు కా స్త వ ము

క్షోణీసఞ్చరణేషు మౌనిగృహిణీపాషాణతాశోషణ
త్రాణం త్వచ్చరణద్వయం రఘుమణే క్రీణా న్నృణాం...న్మనః

యో వై రావణవైరిణ శ్చరణజో రేణు ర్మునే ర్దారుణం
దారాణా మచలారిణా ప్రణిహితా జ్గాణిక్యమాణిక్యతాం
స్త్రీణాందూషణకారణం ప్రవిమనత్క్షోణీచకార క్షణాత్
క్రోణీయా స్ప్రణతస్య మే మణిశిరస్త్రాణాయమాణోభవేత్

అస్తు స్వస్తి సమస్తమస్తకతలాభ్యస్తం ప్రశస్తం పురా
సీతాయా స్తరుణస్తనస్తబకయో రభ్యస్తకస్తూరికం
స్రస్తాన్యస్తవసంస్తవాస్తికమనోవస్త్వ్యమస్త్వ్యయం
న్యస్తం వాస్తవనిస్తులం రఘుపతే త్వద్పాదవస్తు స్తుమః

రామాయ క్షితికన్యకావిహరణారామాయ నీలోత్పల
శ్యామాయ స్మరనిత్యబాధితరిపుశ్యామాయ తుభ్యం నమః
కిర్తిక్ష్మామనిచోళసంవలితదిగ్గ్రామాయ దీవ్యద్గుణ
గ్రామాయ స్వపదప్రవిష్టనృహరిగ్రామాయ భూయో నమః

ఇదం దశరథార్జ్జితం భరతలక్ష్మణాభ్యర్చితం
తపోధనమనోధనం సకలసంపదాం సాధనం
నృసింహనగరాన్తికే జయతి రామపాదద్వయం
శిలాముకురచుమ్బితం రహసి సీతయా చుంబితం

పాణే రాభరణం పరం రఘుమణే గీర్వాణనిర్వాణ హృ
ద్వైరిప్రాణసమీరపారణమదవ్యాఘూర్ణమానం ధనుః
పార్శ్వద్వైతవిభూషణ ప్రణయినీ సీతా సుమిత్రాసుతో
భూషా తే పదపద్మయో శ్చ భవతా మేషా మనీషా మమ

సదయే హృదయే నిషణ్ణమాదృ
గ్విశతే సాయ మనాదిరశ్రమాదృక్
జగతా మియతా మనుశ్రుతా దృ
గ్జయతా ద్రాఘవశేఖరస్య తాదృక్

విబుధబహువిధోపయోగ్యం
స్వశరనిమజ్జన సజ్జనాసురౌఘం

దశరథ జననాథ భాగ్యలబ్ధం
మరకతరత్నతటాక మాశ్రయామః

సీతాయాః కరసాకువార్యవిభవాభిజ్ఞం పరజ్ఞానినాం
చేతఃపద్మమధూళిధూళినివహస్నాతానులిప్తాకృతి
విన్యస్తం భరతాగ్రజస్య చరణద్వైత (౦) సుజాతం మయా
దిష్ట్యాదృష్ట మదృష్టదృష్టఫలయో స్సాధారణం సాధనమ్

సీతానేత్రసుధాఞ్జనం మునిమనస్సఞ్చార ఘణ్టాపథం
త్రస్యద్దేవవిరావరావణయశఃకాదమ్బకాదమ్బినీ
లోకానా మసమాపతఃపరిణతి స్సాకేతసంవాసినా
మస్మాకం కులదేవతా విజయతే సౌమిత్రిమిత్రం మహః

చిన్వానం గుణ మాశ్రితేషు దురితం ధున్వాన మన్తఃకృపాం
తన్వానం శుభ ముత్తరోత్తరగుణం మన్వాన మానన్దినం
తన్వా నంతరుచా విధూతసుమనోధన్వాన ముద్యద్గుణో
దన్వానం రఘుసార్వభౌమ మనఘం నన్వానమా మ్యన్వహమ్॥

మాత స్సీతే! జనని భవతీ మాదృశా మీదృశానాం
రక్షాదీక్షావహనమహతీ దేవతా దేవతారః
యస్మా దస్మత్స్వపనసమయే స్వాభి రాభిర్భి రేత్య
స్పష్టం దృష్టం త్వ మిహ కరుణాలోలపక్ష్మైః కటాక్షైః

పర్యస్తా ఇవ దండకావనదిశాం వీథీషు రామత్విషా
వర్షాహర్షచరన్మయూరతరుణీగ్రీవారుచో వీచయః
దృక్పాతై రపిచ ప్రసన్న మధురై రప్రశాన్త మాపాతినాం
నిర్యాతా ఇవ నిర్భరామృతరసస్రోతస్వినీ నిర్ఝరైః

లోకానీకవశీకృ విఫలితే ప్రాక్శాస్త్రశస్త్రోత్కరే
సౌన్దర్యం భవతా విశృఙ్ఖల మిదం బ్రహ్మాస్త్ర మావిష్కృతం
పౌరా జానపదా భృశం వనచరా దేవా నరా వానరా
వృక్షాః పక్షిగణశ్చ యత్ర వివశప్రాణా రఘూణాంపతే

మరన్ద కదలీ సుధా మధు రసాల మృద్వీచయో(యా)
మనోహరణ ధోరణీ పదకదమ్బసంపూరితా
దదాతు శుభ మప్పలార్యకరుణారసోద్దీపితా
నృణా మఘవిదారిణీ రుచిరరామపాదస్తుతిః

# అనిర్వచనీయ బాంధవ్యం

శ్రీమతి కోమలాదేవి

ఈ కథకు ఒక విచిత్రమైన విషయం ఇతివృత్తం. ఇది అపూర్వంగా కన్పించవచ్చు. కాని అటువంటిది జరుగవచ్చునని ఒక సైంటిఫిక్ జర్నల్‌లో చదివాను. అనంతరం ఊహించి వ్రాయబడిన కథ ఇది.

"క్యేర్" మన్నకేకవిని సావిత్రి శ్రమనంతా మరచిపోయింది. ఆయాసపడుతూ కళ్ళు ప్రక్కకు త్రిప్పింది...ఆయా పాపనుతుడుస్తోంది.....

'ఏం పాప? బాగుందా?'

అత్యాతురతతో ప్రశ్నించింది.

'అబ్బాయి....బాగున్నాడమ్మా'

ఫరవాలేదు...తన శ్రమ ఫలించింది. తన బాధ్యతను నెరవేర్చింది. అలసట తీరలేదు. ప్రాణం సొమ్మసిల్లి పోయింది. క్షణం కళ్ళుమూసుకుంది...ఎన్ని క్షణాలు గతించి పోయాయో! మగతగా వుంది!

'అమ్మా పిల్లాడిని చూస్తారా?'

సావిత్రి కళ్ళుతెరచింది. అబ్బాయిని చూస్తోంది. చిక్కని నల్లని తలవెంట్రుకలు—గులాబి రంగులు ముద్దులొల్కే చిన్నముఖము, బుల్లి ఎఱ్ఱని పెదిమలు—ముద్దులు మూటగట్టే ఆ పాపడిని చూస్తూ—మృదువుగా స్పృశించిందామె. బిడ్డ ఆమె వ్రేలుపట్టుకుని వదల్లేదు. ఆ పట్టు ఆమె హృదయాన్ని గట్టిగా పట్టింది....

'అబ్బాయేడీ' అన్న కంఠం విని సావిత్రి నిస్త్రాణతో చూచింది. ఆమె పద్మ! గతుక్కుమన్నది. శిలా ప్రతిమయ్యి తదేకంగా చూస్తోంది...గబగబ వచ్చిందామె.

గులాబివన్నెముఖంలో ఆనందవీచికలు పరిభ్రమిస్తున్నాయి. ఆ రెండు కళ్ళు రెండు జ్యోతులై దేన్నో వెదకుతున్నాయి! ఆమె సావిత్రిని చూడలేదు. స్ఫటికఫలకంలాంటి నుదుటిపై ఆందోళన వ్యక్తంచేసే చారలు. ఎంతైనా ఆమె ఆనందానికే పర్యాయపదం!

'ఇక్కడమ్మా' ఆయా పొత్తిళ్లతో పాపను పద్మ కందించబోయింది.

పద్మ బాబు ముఖంలోకి వంగిచూచింది. జరీ పూలుకుట్టిన నీలం నైలాన్ పమిట సర్దుకుని బిడ్డను అందుకోబోయింది.

సావిత్రి హృదయం కంపించిపోయింది.

కళ్ళు తప్పించి వేసింది.

కళ్ళు తెఱచి చూచేసరికి—పద్మ—ఆ పాపడిని తన హృదయానికి హత్తుకుని అనిర్వచనీయమైన ఆనందం పొందుతోంది. ఆ సుందరవదనంలోని సంతృప్తి భగవత్ సృష్టిలోని తృప్తికి పరితూగిపోతోంది...

సావిత్రి హృదయం విలవిల్లాడిపోయింది.

'చిన్నితండ్రీ ..... బంగారునాన్నా !.....ఇంటికి వెడదామా? పద నాన్నగారిని చూద్దువుగాని...

సావిత్రి కంఠంలోని మాటలు కంఠంలోనే పూడుకుపోయాయి. మూగగా రోదిస్తూ—మూగగా 'వద్దు...వద్దు' అంటోంది. ఆమెను వినే దిక్కులేదు. ఉడిగిపోయిన శక్తితో నిర్జీవంగా పడుకుండిపోయింది. ఆమెను ప్రైవేట్ రూమ్‌లోకి తీసుకువెళ్లి పండుకోబెట్టారు.

ఎప్పుడో మెలకువ వచ్చింది. తన ప్రక్కలో ఊయల లేదు.

అప్పుడే నర్సు వచ్చింది.

ఏమి జవాబు వింటానో—అన్న సంశయంతో—గుండెలు చిక్కబట్టుకొని అడిగింది.

'పాపడు...?'

'ఆమె తీసుకువెళ్లిపోయారు...ఈ సాయంత్రం వస్తారట...'

దుఃఖం కట్టలు త్రెంచుకుంది. ఒక్కసారి బిడ్డను కళ్ళారా చూడలేదు. ఆ పాలబుగ్గల్ని చిదిమి ముద్దాడలేదు. ఆ పట్టు దారాల్లాంటి జుత్తును మృదువుగా సవరించలేదు. ఆ చిన్నారి పెదిమలపై తన అమృత ధారలు చిలికించలేదు. తనివి తీర ఒక్కసారి తన హృదయానికి హత్తుకోలేదు... చెవులారా ఆగయ్యాళిఏడ్పు వినలేదు — ఒక్కసారి

తృప్తిగా సాం(బాణి ధూపం వెయ్యలేదు...ఆమెచెక్కిళ్ళు కన్నీటితో తడిసిపోతున్నాయి. నర్స్ జాలిగా చూచింది — ఓదార్పుగా నాల్గుమాటలని వెళ్ళిపోవటాని కుద్యుక్తు రాలైంది.

సావిత్రి తమాయించుకుంది. 'ఒక్కసారి డాక్టర్ ముకుందరావును—అతని సతీమణిని రమ్మని చె:

ఆమె వెళ్ళిన పది నిమిషాలకు వారిద్దరు స్మాక్స్ వేసుకుని స్టెతస్కోప్‌లు పట్టుకుని వచ్చారు.

సావిత్రి గంభీరంగా చూస్తోంది.

'ఏం—సావిత్రీ! బాగుందా' ఒంట్లో'

ఆమె పేలవంగా నవ్వింది. 'వంట్లో బాగా నే వుంది—మదిలో అంతా వ్యథ'

'ఎందుకు?'

'డాక్టర్—మీరు చెప్పండి- ఆడవాళ్ల కర్మ వహౌతుంది. నా హృదయం ఎందుకు తరుక్కుపోతోంది?...బిడ్డపుట్టాడు—నేను ఒక్కరోజు కనీసం ఒక్కగంటైన వాడితో గడపలేదు—అప్పుడే మాకు ఎడబాటు...డాక్టర్...ఇలా జరుగుతుందని...ఈ క్షణం ఇంత భరింపరానిదౌతుందని ఆ నాడు ఆలోచించలేదు. మీరు...అన్నీ ఎరిగిన మీరిద రుకూడ నాకు తెలియ జెప్పలేదు...నేను(ప్రాణంలేనివస్తువునుగాను...మనిషిని .. హృదయంగల మీలాంటిదాన్ని...

ఆమె కొంగు కప్పుకుని హృదయవిదారకంగా రోదించింది.

భార్యాభర్తలు మౌనంగా ఒకరి ముఖా లొకరు చూచుకొన్నారు...నిజమే...ఇది భరింపరాని బాధ... తాముకూడ వూహించలేదు! పద్మ తీసుకువెడతానంటే ఒప్పేసుకున్నారు...వారి హృదయాలెంత పాషాణాలు... ఆమె సజలనే(త్రాలను తుడుచుకుంటూ సావి(త్రిని ఓదార్చింది...

'సావి(త్రీ...క్షమించు...వివేచనాజ్ఞానంతో చేయ లేదమ్మా...క్షమించరాని నేరం చేశాము. ఇప్పుడేవెళ్లి నేనే స్వయంగా తెస్తాను...నీ మురిపెం తీరిన తర్వాత వాడికోసం...వాడి భవిష్యత్తుకోసం...వాడిని వాళ్లకు అప్పగించు...వస్తామరి' ]

కన్న బిడ్డను తెస్తారు - తను చూడబోతోంది.

ఆనందాతిరేకంతో కళ్లు మూతలుపడినై. ఆమె గతంలోకి దిగజారిపోయింది.

ఆ నాడు సంధ్య దాటింది. భర్త ఇల్లు చేర లేదు. అత్యంత నిరీక్షణతో కనిపెట్టుకుని వుంది.

స్నేహితురాలు శ్యామల హడావిడిగా వచ్చింది.

ఆమె గుండెలు ఝల్లుమన్నాయి. మెల్లగా చెప్పింది...'మీ వారికి...ఆక్సిడెంట్ అయింది.'

తర్వాత అంతా అంధకారం. ఆ నాటి ఆక్సిడెంట్ ఫలితం తన భర్తకు ఉద్యోగం పోయింది. ముగ్గురు పిల్లలు—తను—తన భర్త- (తాగాలి— తినాలి—కట్టాలి —వుండాలి. ఎలా సాధ్యం - తను సెకండ్‌ఫార్మ్ చదివింది. కనీసం విద్యాబోధ చేయ లేదు. తమకు ఏమీ లేదు. ఒక్కసారి నాల్గువందల ఆదాయం తగ్గిపోయింది.నలభై రూపాయల రాబడితో— తను ఇంతమంది నెలా పోషించగలదు?

దినాలు గడుస్తున్నాయి. (బతుకు భారమైంది. పిల్లలు బడికి వెడుతున్నారు. వారి అవసరా లధిక వహౌతున్నాయి.

పేపర్‌లో చిన్న అడ్వర్‌టైజ్‌మెంట్.

'ఆరోగ్యంగావున్న (స్త్రీలు—ముప్పైసంవత్స రాల లోపువారు—ఫలానా బాక్సునంబరుకు (వ్రాయవలసి నది— మంచి ఉద్యోగం దొరకగలదు. చదువు (ప్రమేయం లేదు'.

సావి(త్రి జాగుచెయ్యలేదు.

అనుమానంగానే ఉత్తరం రాసింది.

డాక్టర్—ముకుందరావు — అతని అర్ధాంగి రమణి—జవాబు (వ్రాశారు.

ఆ నాడు తాను వెళ్లింది. తనతోపాటు ఇంకా ఎనిమిదిమంది (స్త్రీలుకూడ వున్నారు. ఏమిటి పని? ఏం చెయ్యాలి? ఎలాంటి ఉద్యోగం? ఎంత ఇస్తారు? తన సంసారం నడవగలదా?

తొమ్మిదిమం నలుగురు సరిపోలేదు. వాళ్లు వెళ్లిపోయారు.ఇంకా నలుగురు మిగిలిపోయారు.

తమ తెల్పేసరికి వాళ్లు నిర్ఘాంత పోయారు.

ఇది సాధ్యమా ?

తాను చేయగలదా?

రమణి ఏమన్నది? 'మీ ఆరోగ్యం తొంభై తొమ్మిదిపాళ్లు సరిగా వుంది. మీ పని అత్యంత క్లిష్టమైనది. ఈ ప్రాంతాల్లో మీరు మొదటి వారౌతారు...ఆరునెలలు మీకు ఏ కొదువా వుండదు. ఆ తర్వాత మీ శ్రమకు తాహతునుబట్టి కొన్నివేలు ఇస్తారు...'

ఆమె మౌనం దాల్చింది. ఆమె ముఖంలో ఏవో నీడలు కదిలిపోతున్నాయి.

'మా పని ఏమిటి డాక్టర్? ఏం చెయ్యాలి?'

రమణి వారి కళ్ళను తప్పుకుంది. శూన్యం లోకిచూస్తూ మెల్లగా అంది: 'మీ...మీ గర్భాలను అరువు కివ్వాలి'

ఒక్కసారి నలుగురు 'డాక్టర్' అని నిర్ఘాంతపోయి గ్రుడ్లప్పగించి చూస్తుండిపోయారు.

కడుపు దేవినట్లైంది-ఏదో అసహ్యం-కోపం-వినరానిది విన్నట్లు బాధ-జుగుప్స-దుఃఖం మిళితమై వారి నోర్లు కట్టివేయబడినై.

రమణి ఒక్కొక్కరి దెస మార్చి మార్చి చూచింది.

'ఔను...మీ గర్భాన్ని అదె కివ్వాలి...అంటే మీ గర్భపుసంచిని మాత్రం అద్దె కివ్వాలి...అంతే.' ఆమె లేచి వెళ్ళిపోయింది.

ఆ గదిలో నిశి ఫులుముకుంది. పాతాళంలో దిగజారిపోయినట్లు నిస్త్రాణతో కూర్చున్నారు...ఇదా వారి పని...ఇందుకా అంతఆత్రంతో వచ్చారు. ఒకరినొకరు చూచుకోవటానికి కూడా సిగ్గుపడ్డారు.

రమణి తిరిగివచ్చేసరికి సావిత్రి మంకొకామె మాత్రం మిగిలారు.

రమణి వారిదగ్గరకు వచ్చింది.

'మన కింకా అలవాటు లేదు...అందుకని క్రొత్తగా వుంటుంది...కొన్నాళ్లు గడిచిపోయినతరువాత అందరికీ మామూలై పోతుంది సుమా !'

మరుసటిరోజు తాను రమణి ఇంటికి వెళ్ళింది.

ఆ గదిలో పద్మ కూర్చునివుంది. ఆమె ముఖం పాలిపోయి కళావిహీనంగావుంది. చెక్కిళ్ళు పాలరాతిలా వెలవెలబోతున్నాయి. ఆ విశాలనయనాల్లో జీవం లేదు. దీప్తిలేదు. పెద్ద జబ్బుపడి అప్పుడప్పుడే కోలుకుంటున్నదిలా వుంది. ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలు అతి కష్టంతో జరుపుతున్నట్లుంది. చేతికి వేసుకున్న రాళ్లగాజులు మోచేతివరకు జారుతున్నాయి. ముక్కు స్పష్టమై పొడుచుకువచ్చింది. కళ్లు జానెడలోతుకు పోయి పూడిపోయినట్లున్నాయి. పెదిమలు ఆరిపోయి పొడిగా వున్నై. అయితేనేం-ఆమె అందమైంది.

ఆమె శ్రీమంతుల బిడ్డ.

సావిత్రిని పరిశీలనగా చూస్తోందామె.

సావిత్రి సాధారణమైన వ్యక్తి-ఆమెకు పద్మకు లేని ఐశ్వర్యం వుంది. అది-ఆరోగ్యం...అందుకని సావిత్రి గర్వించవచ్చు.

'వీరు-సావిత్రి...'అంటూ తనను గూర్చిన విషయాలన్నీ రమణి చెప్పింది.

పద్మ ఆయాసపడుతూ విన్నది.

'చూడండి సావిత్రీ! వీరు శ్రీమతి పద్మగారు. రంగనాథరావుగారి కోడలు. వారు వ్యాపారస్తులు. మీకు తెలుసనుకుంటాను. ఎన్నోచోట్ల షేర్లున్నాయి. ఒక్కడే కొడుకు. వారు తండ్రిగారికి చేదోడువాదోడుగా వుండి వ్యాపార విషయాలన్నీ చూచుకుంటారు. వీరికి పెళ్ళయి రెండు సంవత్సరాలు దాటినై. ఇప్పుడు గర్భవతిగా వున్నారు. పద్మ గారికి పోయిన సంవత్సరంవరకు ఆరోగ్యం బాగున్నదిగానీ ఈ సంవత్సరం చాల జబ్బుపడ్డారు. డబుల్ న్యుమోనియా వచ్చింది-తర్వాత యూరిన్ ట్రబుల్...కాస్త కోలుకుంటున్న సమయంలో గర్భవతియైంది. వేవిళ్ళు...మళ్లీ ఆరోగ్యం దెబ్బతిన్నది...అంతేకాదు ఆమె గర్భకోశం పిండాన్ని భరించలేదు. నాలుగైదునెలలకు విసర్జిస్తుంది...'

సావిత్రికి అర్థం కాలేదు.

'డాక్టర్‌గారూ-స్వకీయమైన అనుభూతితో ఏదో పల్కుతున్నారు. విశదీకరించండే పామరులం మాకేవిూ అర్థం కాదు.'

రమణి రమణీయంగా నవ్వుతోంది.

'నిజమే....సావిత్రీ...ఒక్కమాట...అంత గొప్ప కుటుంబానికి భగవంతుడు ఒక్కటి—ముఖ్యమైన ఒక్కటి లోపంచేశాడు...సంతానంలేమి'.

'పద్మగారు గర్భవతి కాదా? మీరు శ్రద్ధ వహిస్తే సరిపోదా?'. సాలోచనగా అంది.

'లేదు...ముందర తెలియజేశాను. ఆమెకు బిడ్డను తనలో పెట్టుకునే శక్తి లేదు. నవమాసాలు భరించే బలం ఆమెలో లేదు. స్త్రీలకు అంతర్గతమైన ఈ శక్తి ఆమెలో లోపించింది. శస్త్ర చికిత్స...మందులు పనికిరావు. పసిపిందె రాలిపోయినట్లు—విరియని మొగ్గ రాలిపోయినట్లు...మానసికావేదనతో ఈ దంపతులు రానున్న పరిస్థితికి—ఆపదకు లొంగలేక అధైర్యంతో మా సలహా కోరారు...' రమణి సావిత్రికి దగ్గరగా వచ్చింది.

'ఆ సహాయం నువ్వు చేయాలి సావిత్రీ... చెప్పానుకదూ? పద్మ గర్భవతి. ఆమెలో ఇక పిండం వృద్ధి చెందలేదు...శస్త్ర చికిత్సతో ఆ పిండం తీసి మరొక గర్భంలో పదిల పరచాలి...'

'డాక్టర్...ఇది సాధ్యమా?' సావిత్రి విస్తుపోయింది.

రమణి నవ్వింది 'సాధ్యమే. చాలా చోట్ల ప్రయత్నించి సఫలులయ్యారు. మేము తర్ఫీదు పొందాము. ఆమె గర్భంలోంచి తీసి దాన్ని నీ గర్భంలో భద్రపరుస్తాము. మిగిలిన మాసాలు బిడ్డ నీలో పెరుగుతుంది. తర్వాత...'

'తరువాత...ప్రసవవేదన?...'

'ఆ...పడాలి...ఇక మామూలే...నీవు ప్రసవిస్తావు. బిడ్డను వాళ్ళు తీసుకుంటారు...ఒక్క మాట చెప్పనీ...బిడ్డ ఆరోగ్యంగా పుడతాడు. బలహీనత లేమీ వుండవు. వాడు స్వయాన వాళ్ళమ్మ నాన్న సుపుత్రుడు. నీవు పెంచిన తల్లివి...అంతే...'

సావిత్రి అరచేతుల్లో ముఖం దాచుకుంది.

కడుపులో కదిలినట్లయింది. అప్రయత్నంగా గర్భంమీద చేయివేసింది. తనకు పిల్లలున్నారు... నవమాసాలుమోసి—కని—పెంచుతోంది. దానికి—దీనికి భేదం? కొన్నిమాసాలుమోసి—కనాలి—ఔనా... కనాలి...మోయవచ్చు...కానీ కనటం?...ఆ భరింపశక్యంకాని బాధ—సృష్టి యావత్తులో నొప్పికిపర్యాయ పదం ప్రసవ సమయంలో నొప్పులుకాదా?...ఆ బాధను మరిపిస్తూ చిన్నారిపాపడి ఏడ్పు—ఎంత మధురమైన శబ్దమది—ఆ ఏడ్పులో తల్లి తన బాధను విస్మరిస్తుంది...మరి...అయితే!...

'నాకు చేతకాదు—నేను చేయలేను — నన్ను క్షమించండి.' సావిత్రి దృఢంగా—పరితప్త హృదయంతో ఒక్కొక్కమాట అన్నది.

పద్మ ముఖం నిరాశతో పరిదీనం అయిపోయింది. కనుబొమలు ఆవేదనతో వంపు దిరిగాయి.

రమణి సావిత్రి భుజంమీద చేయివేసింది... ఓదార్పుగా—చెబుతోంది.

'ఒక్కసారి దీర్ఘంగా ఆలోచించుకో...ఈమెకు—పద్మకు - నవమాసాలు మోసే శక్తిలేదు. అది ఆమె పొరపాటు కాదు. భగవదేచ్ఛ. ఆమె గర్భంలో స్థలం లేదు సావిత్రీ! ఆ వరం నీకుంది...కొంత త్యాగం అవసరం...పిల్లలుంటేనే తల్లిశబ్దానికర్థం వుందను కోకు...స్త్రీ...ఆ ఒక్కశబ్దం చాలు మాతృత్వాన్ని పునీతం చేయటానికి. స్త్రీ—ఆమె మాతృమూర్తి. అడ్డాలలోపాప—ఊయలదిగి దిగక ముందే—తక్షణం చిన్నబొమ్మకు నీళ్ళుపోసి—పాలుబోసి జోలపాడి నిద్ర బుచ్చుతుంది...ఆ పసిబిడ్డకు తను చేస్తున్న కార్యంలో అసాధారణత ఏమీ కనిపించదు. అది పుట్టుకతోనే స్వభావసిద్ధమైంది. పిల్లవాడిని చూడు—బొమ్మనిస్తే దాని ముఖం చూడడు. ఏదో ఒక ఆటవస్తువుగా జమకట్టి ఆడినంతసేపు ఆడి ప్రక్కకు త్రోసేస్తాడు. కానీ ఆడపిల్ల - ఆ ప్రాణంలేని బొమ్మ తన పాప. అవాహ లోకంలో విహరిస్తుంది. ఆ బొమ్మకు తను తల్లి. ఆ కోరిక రానురాను నిజమౌతుంది. తను తల్లి అవుతుంది. తన చేతులతో పెంచి పెద్ద జేస్తుంది...ఈ దశకు వచ్చినప్పుడు ఆ కోరికలు—ఆశలు పేకమేడల్లా కూలిపోతే ఆమె దుఃఖం—ఆమె క్షోభ భరింపనలవికాదుగదా? తన గర్భంలో పాప ఒక్కనాటికీ ప్రాణాలతో బైటికిరాదు. చిన్నతనంలో బొమ్మలతో గడిపిన మధురక్షణాలు ఒక్కనాటికి నిజం కాలేవు. తనపాపను ఎత్తుకుని ముద్దాడ లేదు. శూన్యగర్భమైనా—గొడ్రాలైనా—అది వేరు. కానీ...సావిత్రీ...ఈ బాధ యమయాతనకాదా? తన

కడుపులో పాప, పెరిగి పెద్దదై, ప్రాణాలతో ఈ గడ్డమీద పడి పెరిగి పెద్దవాడై తన సఫలం చేస్తాడన్న కోర్కె మొదలంటా తెగి నేల కొరిగిపోతే ... ఏంచేస్తాము ... ఈ మనఃక్షోభనించి రక్షించలేమా? ఈమెకు ఇవి తప్పించలేమా? ఆలో చించు—నీ వంగీకరిస్తే — ఇదెంత ఉదీప్తమైనదో నీకే తెలుస్తుంది. ఒకరి ఆనందంకోసం నీవెంత త్యాగం చేస్తున్నది అవగాహనం కాగలదు...నీవు అన్ని విధాలా తగినదానవు...ఆలోచించుకో...మీవారికి చెప్ప టానికి డాక్టరుగారు—పద్మగారి శ్రీవారు వెళ్ళారు..'

సావిత్రి గట్టిగా కళ్ళు మూసుకుంది.

శూన్యం—అంతా శూన్యం — హృదయంలో అంధకారం.

పద్మ ఆమెకు దగ్గఱగావచ్చి కూచుంది. గాద్గదికంతో మెల్లగా అంది. 'మీ అంగీకారంకోసం ప్రాణాలు బిగబట్టికొని నిరీక్షిస్తున్నాను...ముందు... ఇదరు...ఒప్పుకోలేదు......నన్ను నిరాశపరచకండి... మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను...ఎందుకో మిమ్మల్ని చూచిన తక్షణం, నా బిడ్డకు సరియైన పోషణ వీ గర్భం ప్రసాదించగలదన్న నమ్మక అనుగ్రహించండి...' ఆమె మాటాడలేక ఖేదంతో నీరు నిండిన రెప్పలదిమి కన్నీరు కారుస్తూ కూచుంది.

సావిత్రి నిలువెల్లా కంపించింది.

ఆమెను ఆ విధంగా చూస్తుంటే హృదయం తరుక్కుపోతోంది.

ఆమె చటుక్కున లేచింది.

'మావారిని...అడిగి...రేపు చెబుతాను.'

రమణికూడ లేచింది.

'మీవారు అంగీకరిస్తారు. ఇంట్లో సహాయానికి మనిషిని ఏర్పాటు చేస్తారు......ఎల్లుండి......పాపను మారుస్తాము.'

సావిత్రి కళ్ళు తెఱచింది.

తన మంచంప్రక్కలో నీలంరంగుతెర.

తనకు మత్తుగా వుంది...ఏం జరిగింది? మెల్లగా చేతిని గర్భంమీదికి పోనిచ్చింది...బేండేజీ— ఆమె ముఖంలో ఆనందం తళుక్కుమన్నది.

తను గర్భవతి—కాదు...కాదు...ఎవరి పాపనో పెంచుతోంది.

రమణి గబగబ తెర తొలగించుకుని వచ్చింది.

'సావిత్రీ—ఎలా వుంది?...భద్రంగా పెంచాలి సుమా!'

సావిత్రి నవ్వింది—

'నొప్పి—మందు ఏదైనా?'

'ఆ...తప్పకుండా' అన్నది. ఏదో ఇచ్చింది. మత్తుమందులు వాడితే పిండానికి ముప్పు అని చెప్ప లేదు. సైకలాజికల్‌గా సావిత్రి బాధను భరించ గల్గింది.

ఆమె భర్త క్రచ్చస్ టకటక లాడిస్తూ వచ్చాడు.

సావిత్రి కన్నీరు నింపుకుంది. అతను ఊర డింపుగా ఆమె కన్నీరు తుడిచి మెల్లగా చెవిలో అన్నాడు.

'సావిత్రీ—నీ బాధ వృథా కాలేదు—ఇలాంటి పరిస్థితి కల్పించిన నన్ను క్షమించవూ? ఇదిగో... ఇప్పుడే రెండువేలు చెక్కు రాసిచ్చారు ఇంటి అదె బాకీ—దుకాణంలో బాకీ తీర్చేస్తాను. రేపు మిగతా విషయాలు మాట్లాడుకుందాము...విశ్రాంతి తీసుకో..'

సావిత్రి నిర్జీవమైన నవ్వు నవ్వింది.

'ఈ పిండం విలువ ఇప్పుడు రెండువేలు.'

అతను నవ్వేశాడు.

కొన్నిరోజులు దొర్లిపోయాయి.

పాప కదిలింది. ఆమెకు తెలుసు. వారం గతించిపోయింది.

డాక్టర్ రమణి—పద్మ సావిత్రి ఇంటికివెళ్ళారు.

రమణి పరీక్ష చేసింది.

'అంతా సవ్యంగా వుంది. పాప తిరుగుతోందా?'

సావిత్రి జవాబిచ్చింది. 'డాక్టర్‌గారు చాల సంతోషిస్తారు. ఆపరేషన్ విజయవంతమైందని.'

పద్మ వెళుతూ ఐదువందలు చేతిలో పెట్టింది.

'మీరు మంచిభోజనం తీసుకోవాలి. ముఖం తీసిపోయినట్లుంది.'

సావిత్రి గుడ్లప్పగించి చూస్తోంది.

పద్మ అటు వెళ్లగనే తన ప్రతిబింబాన్ని చూచుకుంది.

ముఖం నిండుగా హుందాగా కనబడింది. మునుపటికన్నా ఆరోగ్యంగావుంది. మరి ఆమె మాటల్లో అంతరార్థం?

ఆ రోజునించీ పద్మ రోజూవచ్చి చూచిపోయేది. ఆమెను చూడనంతసేపు— తను దినచర్యలో మునిగి పోయి తన విషయం తనకు మామూలుగా అనిపించేది. పద్మను చూచిన తక్షణం తన గర్భంలో పాప తనది కాదే అన్న భావం ఆమెను కృంగదీసేది.

పద్మవచ్చి కూచుంది. సావిత్రి హడావిడిగా వచ్చింది. సాధారణంగా స్నేహితులతో చెప్పుకున్నట్లుగా అంది: 'అబ్బ— కాస్త తీరికకూడా వుండటం లేదు. పిల్లలకు పరీక్షలు. తెల్లవారి లేచినప్పటినుంచి పడు కునేవఱకు ఏవో పనులు...'

పద్మముఖం చిటపటలాడింది.

సావిత్రికి గుర్తొచ్చింది. మౌనంగా గంభీరంగా కూర్చుంది.

'మీ రింతపని చేయకూడదనుకుంటాను... ఏమంటారు? బిడ్డలేమైనా...'

సావిత్రి విరగబడి నవ్వింది.

'ఇంకా నయం— మంచంమీద కాళ్లుచాపుకుని కూర్చోమన్నారుకారు···వారు ఉద్యోగంలో వున్నప్పుడు నాకింతకు రెండంతలు పని వుండేది····ముగ్గుర్ని కన్నాను...నాకు తలిదండ్రులు— ఎవ్వరు లేనందున ఎక్క డికి వెళ్లేదాన్నిగాను. అనుపత్రికివెళ్లి వచ్చేదాన్ని...ఈ పనికి పాప కే అపాయం రాదు...మీరు బలహీనులు· అందుకే బరువు పనులు నిషేధం— నా కెందుకు?'

పద్మ కీ సంయమము నచ్చలేదు.

'మీ రింతపనిచేసూ_ అలసిపోవడం సుతరామూ నా కిష్టంలేదు.'

సావిత్రి పగలబడి నవ్వింది. ఆ నవ్వులో క్రోధం మిళితమై వుంది.

'మరేం చెయ్యమంటారు. మీ రిచ్చేడబ్బుతో ముప్పూటలా తిని హాయిగా విశ్రమించమంటారా?'

'ఔను. అదే నేనూ చెప్పబోతున్నాను...'

'చాలా మంచి సలహా పద్మగారూ·· మీకు తెలీదు....బిడ్డ పెరిగి పెరిగి...చివరికి బైటికి రాలేక పోతే మా యిద్దరికీ...'

ఆమె గుటకలు మ్రింగింది.

'మీకు అర్థం కాదు. డాక్టర్ను అడగండి'.

సావిత్రి నుదురు తుడుచుకుంటూ ఓట్చా ర్చింది.

'సోనీ·· మీరు యింట్లో వుండండి...కావలసి నంత వ్యాయామంమాత్రం తీసుకోవచ్చు...లేనిపోని బాధ్యతలుండవు.' సావిత్రి శిలాప్రతిమయై కలవర పాటుతో చూస్తోంది.

'మరి...మరి...నా —నా సంసారం నా పిల్లలు...'

'డబ్బిస్తానుగా...మంచి పనిమనిషిని పెట్టిస్తే సరిపోతుంది.'

సావిత్రి కళ్లలో నీళ్లు సుళ్లు తిరిగాయి.

'తల్లికి— భార్యకు సాటి— ఏమీ—ఎవరూ— లేరు...' ఆమె మాట్లాడలేక నిశ్శబ్దంగా ఏడుస్తూ కూచుంది.

'మీరు దుఃఖించరాదు...బిడ్డకు...'

సావిత్రి ఇక భరించలేకపోయింది.

'నాకు తెలుసు...బిడ్డ నాలోవుంది... నా కంతా తెలుసు— ఈ రోజుకు మీారు దయతో వెళ్లిపొండి.' సావిత్రి చటుక్కున లేచి వెళ్లిపోయింది.

కొంతసేపటికి రమణి వచ్చింది.

'ఏం జరిగింది...' ఆత్రాతురతతో ప్రశ్నించింది.

సావిత్రి దుఃఖం పెల్లుబికింది... 'నే నెంతో పొరపాటు చేశాను... నా గర్భాన్ని భరించి ఎంత దిగజారి అధోగతి పాలయ్యానో ... డాక్టరుగారూ... ఈ బాధ భరించలేను...'

'ఏం జరిగింది...నీ నోట వినాలనివుంది.'

జరిగినదంతా చెప్పింది సావిత్రి. 'నేను ఇంటిపని చేసుకోరాదు. తిని త్రాగి కాలుమీద కాలు వేసుకుని ఆనందించాలి. నా భర్తను, నా బిడ్డల్ని, నా సంసా రాన్ని...వదిలిపెట్టి...' బోరున ఏడ్చింది సావిత్రి. రమణి ఆమెను పొదివిపట్టుకుంది. సజలనేత్రాలను కొంగుతో తుడుచుకుంది ... 'పద్మ ఇంత ఇదిగా

ప్రవర్తిస్తుందని అనుకోలేదు... నీకు నాలుగవ గర్భంలా వుంటుందని — అంత సాధారణంగా కొన్ని నెలలు గడిచి పోతాయని—నీ ఇంట్లో—నీకు అనుకూలమైన వాతావరణంలో బిడ్డ పెరుగుతాడని ఆశించి ఆ విధంగా జరుగుతుందని విశ్వసించానుగానీ ... పద్మ ఇంత మూర్ఖంగా...ఒక అమూల్యమైన మనిషిని తూచితూచి విలువకట్టి తేలికగా మాట్లాడుతుందని కలలోకూడ అనుకోలేదు. ఒక వస్తువును అద్దెకు తీసుకుని మన ఇచ్ఛానుసారం వాడుకున్నట్లు— అంత తేలికగా అభిప్రాయపడింది ... అదేవిధంగా మాట్లాడుతోంది... ఇకపై ఆమె రోజూ రాకుండా చేస్తాను. నిశ్చింతగా వుండు.'

రమణి వెళ్ళిపోయింది. మరి వారానికిగాని పద్మ రాలేదు. పండ్లూ, పూలు, మిఠాయిలు సన్న బియ్యం తెచ్చింది.

సావిత్రి లోపల పెట్టిపెట్టకముందే పిల్లలు బడినించి వచ్చారు. గుడ్డలు మార్చుకుని తలో పండు తిన్నారు. మిఠాయిబుట్ట సగం ఖాళీ అయింది. గోల గోలగా అల్లరిపెడుతూ తింటున్నారు.

పద్మ ముఖం అదోలా మారిపోయింది.

'అవి కేవలం మీకని తెచ్చాను...వాళ్ళంతా.

సావిత్రి నవ్వింది. పద్మ కళ్ళలోకి నిశితంగా చూచింది. 'వాళ్ళు తిన్నారు. నా కడుపునిండిపోయింది... దీని అర్థం మీకు బోధపడదు పద్మగారూ...ఇకపై ఏది తెచ్చినా నా ఒక్కర్తి కోసం తేకండి...'

పద్మ వెళ్ళిపోయింది. సావిత్రి భారంగా అడుగులు వేస్తూ లోపలికి వెళ్ళింది. పెద్దవాడు పరుగెత్తుకి వెళ్ళి చిన్నపళ్ళెం తెచ్చాడు. రెండవ పాప ఒక్కోరకం మిఠాయి పెట్టింది. మూడవవాడు ఆప్యాయంగా తల్లి కందించాడు. బిడ్డలు ముగ్గుర్నీ హృదయానికి హత్తుకుంది సావిత్రి.

'నా కడుపు నిండిపోయిందర్రా...తండ్రులు— తల్లీ!'

క్రచ్చస్ శబ్దంవిని ఆమె లేచి ఆ పళ్ళెరాన్ని భర్త కందించబోయింది.

'నాకు అప్పుడే యిచ్చారు పిల్లలు...నువ్వు తిను ...నీ కోసమేగా ఆమె తెచ్చింది ?'

ఆమె భర్త ముఖంలోకి నిర్లిప్తతతో చూచి నెమ్మదిగా లేచి వెళ్ళిపోయింది.

ఆ చూపు అతని హృదయాన్ని దహించి వేసింది...'ఏం చెయ్యను? నేనేం చెయ్యను? అంగీకరించి సావిత్రికి తీరని అపకారం చేశానా?'

కడుపులో బిడ్డ వయసు ఏడుమాసాలు.

సావిత్రి పెద్దకొడుకు టైఫాయిడ్‌తో మంచం పట్టాడు.

సావిత్రి రేయింబవళ్లు తీరని వ్యథతో మంచం వదలకుండా కొడుకుని కనిపెట్టుకుని వుంది...

తన 'స్వంతం' అయినట్లయితే—ఇది త్రాగు, ఇది తిను—విశ్రాంతి తీసుకో—అని ఎవరైనా అన్నట్లయితే ఆమె అంత బాధపడేదిగాదు. ఎంతో సహజంగా వుండేది. ఇప్పుడు బిడ్డకోసం 'ఆ బిడ్డ భద్రతకోసం' అన్నమాటలు కుండలీకరణాల్లోవున్నట్లు భ్రమపడి బాధపడేది. ఏదో భయం తన్ను ఆవరించింది. ఇది గుర్తుకు రావటంతో ఆమెకు దుఃఖం ఆగేదికాదు.

పద్మకు తెలిసింది. రెక్కలు కట్టుకుని వాలింది.

సావిత్రికి పద్మను చూడటానికే మనసొప్ప లేదు.

ఆమె తల దువ్వుకోలేదు—బిడ్డ అనారోగ్యం ఆమెను కృంగదీసింది.

ముఖంలో కాంతిలేదు. నిస్సత్తువతో అడుగులో అడుగువేస్తూ వచ్చింది.

సావిత్రిని—ఆ విధంగాజూచి పద్మ తృళ్ళిపడింది.

ఏదో మాట్లాడింది...సావిత్రి వినటం లేదు. ఆమె మనస్సంతా వికలమై పోయింది. పద్మ ఎప్పుడు వెళ్ళునా—తను కొడుకు మంచం దగ్గరకువెళ్ళాలని ఆత్రపడుతోంది. పద్మ వెళ్ళేట్లు లేదు! ఇక తాళి లాభం లేదు.

'పద్మగారూ—నా పెద్దకొడుక్కు సుస్తీగా వుంది. మీరు అన్యథా భావించక ఈ నాటికి సెలవు తీసుకుంటే మీకు కృతజ్ఞురాలిని.'

పద్మ కళ్లు విప్పారినై. ఎ జీర తొంగి చూచింది!

సావిత్రి ఆమెను చూడదల్చుకోలేదు.

'వారం రోజులుగా మీ అబ్బాయికి సుస్తీగా వుందట...ఇన్నాళ్లు ఇదే విధంగా ఆందోళనతో మనః క్లేశంతో గడుపుతున్నారు ? ...... సరైన భోజనంలేక వేళకు సరిగా తినకుండా మా కన్యాయం చేస్తారా ? ఒక్కసారి అద్దంలో మీ ప్రతిబింబం చూచుకోండి. మీ ముఖమే న్యాయం చెబుతుంది !...మీరు...నా బిడ్డను...సరిగా...పోషించటం లేదు...'

ఆమె వెక్కి వెక్కి ఏడుస్తోంది.

సావిత్రి ప్రమానుపడి తిలకిస్తోంది. కొన్ని క్షణాలకు రెండు చేతుల్తో గర్భాన్ని పట్టుకుంది. కన్నీరు కాల్వలు కట్టినై. వెక్కిళ్ళ మధ్య అంది: 'నేను తల్లిని...నా లోని ప్రతి అణువు బిడ్డక్షేమాన్ని కాంక్షిస్తోంది...డబ్బు...డబ్బుతో నన్ను కొనలేరు... ఇది వస్తువు...ఒక జడపదార్థం కాదు...నా కన్న కొడుకు మా యింటికి దీపం...డబ్బుతో పడుకుని వుంటే నన్ను...నన్ను...హాయిగా వుండమంటారా— ఏ కన్నతల్లినైనా అడుగమ్మా చెబుతుంది......వ్యక్తిత్వాన్ని మాతృత్వాన్ని ధనంతో తూచే మీకు...ఈ విషయాలు బోధపడవు...'

సావిత్రి నెమ్మదిగా లేచింది.

రమణి మెల్లగావచ్చి సావిత్రి భుజాల చుట్టూ చేయివేసింది.

'బాబుకెలావుంది సావిత్రీ!'

'మీరు...! మీ రెప్పుడు వచ్చారు...డాక్టర్ గారూ...' ఆమె మాట్లాడలేక పద్మవైపు నిశ్చలంగా ఒక్కక్షణం చూచి లోపలికి వెళ్ళిపోయింది.

డాక్టర్ రమణి పద్మను నిశ్చల దృక్కులతో తిలకించి నెమ్మదిగా ఆమెను సమీపించింది. పద్మ తలవంచుకుంది.

'పద్మా—మీరీ విధంగా అనుక్షణం ఆమెను బాధిస్తారనుకోలేదు. నేను మీ కనేక పర్యాయాలు బోధపరచాను. మీ బిడ్డ అయినప్పటికీ ఆమె కడుపులో ఆమె బిడ్డగా పెరగాలి. ఆమె తన స్వంత బిడ్డ గర్భంలో వుండేటప్పు డేవిధమైన సాధకబాధకాలు, సమస్యలు కష్టాలను ఎదుర్కుంటుందో అలాంటి వాతావరణంలోనే ఆమె మసలుతుంది కనుక—మీరు—సావిత్రిని అన్నిటికి అతీతంగా ఒక యంత్రంలా వ్యవహరించాలని కోరటం వట్టి అనాలోచిత క్రియ. ఆమెను వదలివేయండి...మీకు బిడ్డలు పుట్టిన తర్వాత అన్నీ తెలియవచ్చు...కానీ మీనించి నేను ఈ ప్రవర్తన కోరలేదు. సావిత్రిని తనపాటికి తనను స్వేచ్ఛగా వదిలి వేస్తారనుకున్నామేగాని ఆమె ప్రతిక్రియకు అంక్ష విధిస్తారని కలలోకూడా అనుకోలేదు...సావిత్రిని ఇంత ఇరకాటంలో పడేస్తామనికూడ మేము ఊహించలేదు.'

పద్మ వెళ్లిపోయింది.

సావిత్రికి నెలలు నిండిన కొలది అనుమానాలు! భయాలు! బిడ్డ సరిగ్గా పుడతాడా? తను ఆరోగ్యవంతురాలు. తను సుఖంగానే ప్రసవిస్తుంది కానీ...ఈసారి......ఏ విధంగా వుంటుంది? బిడ్డ ఏ అవలక్షణం లేకుండా పుట్టాలి—కానీ...అలాపుడితే అది తన తప్పుక్రింద జమకట్టి తనను దూషిస్తే? నువ్వు సరిగా లేవు...ఏవో చింతలతో- సమస్యలతో సతమతమైపోతూ నా బిడ్డ కన్యాయం చేశావంటే— తనేం చెయ్యగలదు? ఎన్నో విధమైన శంకలతో ఆమె మనసు వికలమై పోయేది.

ఆ రోజు రానే వచ్చింది.

పండువంటి మగబిడ్డను ప్రసవించింది.

కేర్ మన్న కేకతో ఉలిక్కిపడి కళ్లు తెరిచింది.

పద్మ బిడ్డను సావిత్రిప్రక్కలో పరుండజేసి ప్రక్కగా కుర్చీలో కూచుంది. రమణి వచ్చేసరికి సావిత్రి బిడ్డను ఆప్యాయంగా నిమురుతోంది. ఆ చిన్నారి నుదుటిపై లీలామాత్రంగా అగుపించే చార లను సవరిస్తూ, చూపుడు వ్రేలుతో నుదురు

రాస్తూ - బుగ్గల్ని సుకుమారంగా నొక్కుతూ తన్మయురాలై బాహ్య ప్రపంచాని కతీతురాలై వుంది.

రమణి కళ్ళు చెమర్చాయి.

పద్మ దీర్ఘంగా నిశ్వసించి ఎటో చూస్తోంది.

తొమ్మిది రోజులు కాలచక్రంలో కలిసి పోయాయి.

పద్మ రోజంతా ఇంట్లో వుండక తప్పింది కాదు.

రమణి బలవంతంపై సావిత్రి దగ్గఅ బాబును వదలక తప్పలేదు. వారిద్దరికి ఏకాంతం కావాలట—సావిత్రికి ఆ బిడ్డమధ్య అవినాభావ సంబంధం వుంది. అది అనిర్వచనీయమైనది. ఈ బాంధవ్యాన్ని త్రుంచివేసి నాశనం చేయగల శక్తి ఎవ్వరికీ లేదట. ఈ కొద్ది రోజులు వారిని ఒంటరిగా వదలి తాను దూరంగా వుండాలట...పద్మ అయిష్టంగానే దూరంగా వుంది. కొడుకును చూడాలని—పొదివి పట్టుకుని హృదయానికి హత్తుకోవాలన్న బలవత్తరమైన కోర్కెను అతిప్రయాసతో అణచుకుంది. ఒకసారి వెళ్లిందికూడ—కాని ఆమె ఐదు నిమిషాలకన్నా ఎక్కువ వుండటానికి వీల్లేకపోయింది.

ఈ రోజు ఇరవై ఒకటవ రోజు.

పద్మ వాళ్ళ గృహం బంధుమిత్రులతో—పచ్చతోరణాలతో—అత్యంతము సందడిగా సుందరంగా కళకళలాడుతోంది.

పద్మ, ఆమె భర్త గుమ్మందగ్గఅ ఆత్రుతతో ఎదురు చూస్తున్నారు.

కారు ఆగింది.

సావిత్రి పావతో దిగింది. ఆమె విలువైన పట్టుచీర కట్టుకుంది. బాలింతరాలు - నిండుగా హుందాగా దిగింది, గాని ఆమె ముఖంలో చీకటి చ్ఛాయలు. వెనువెంట భర్త నెమ్మదిగా దిగాడు. దంపతులను సాదరంగా ఆహ్వానించి దిష్టి తీసేశారు.

పద్మ అత్త మామలు దూరంనించి ఆనంద భరితులై తిలకిస్తున్నారు!

సావిత్రి భర్తప్రక్కను పీటమీద కూర్చుంది.

ఆమె ఒడిలో బాలుడు నిశ్చింతగా పోతున్నాడు.

వాతావరణం స్తంభించిపోయింది.

బిడ్డ ముమ్మూర్తులా పద్మలా వున్నాడు!

అందరూ ఆశ్చర్యంతో చూస్తున్నారు.

రమణి ముకుందరావులు ముందుకొచ్చారు.

పద్మ పెద్ద వెండి పళ్ళెంలో రూపాయిల నిండుగాపోసి పండ్లు, పువ్వులు, తాంబూలం, కొబ్బరి కాయ పెట్టుకుని వచ్చి నుంచుంది.

రమణి పద్మవైపు వింతగా చూచింది.

సావిత్రి రమణిని చూస్తోంది... 'ఆ క్షణం వచ్చింది—భరించక తప్పదా?' అన్నట్లు తిలకిస్తోంది.

ఆమె హృదయం అల్లకల్లోలమై గిలగిల కొట్టుకుంది.

ఆ క్షణంలో పద్మముఖం ఆనందంతో మానంగా వెలిగిపోతోంది. ప్రశాంతమైన ఆమె ముఖం హృదయ నైర్మల్యాన్ని ప్రతిఫలింప జేస్తోంది!

రమణి ఏదో చెప్పటానికి నోరు తెరచిందిగాని వ్యవధిలేక పోయింది.

పద్మ ఆ పళ్ళాన్ని సావిత్రి కందించి బదులుగా ఒడిపట్టింది.

సావిత్రి తట్ట క్రిందపెట్టి భర్తవైపు చూచింది.

అతని ముఖం ప్రశాంతంగా వుంది.

సావిత్రి చటుక్కున బిడను చేతుల్లో తీసు గాఢంగా ముద్దుపెట్టుకుంది. బిడను ఆశీర దిస్తున్నట్లు అశ్రువులు జలజల రాలాయి.

పద్మ దగ్గఅగావంగి ఒడిపట్టింది...

'మీరు...బాబుకు...పెదతల్లి—పెదతండ్రి... మీకు బాబును చూడాలనుకున్నప్పుడు ... ఎప్పుడైనా రావచ్చు...మీకోసం...మా తలుపులు...సదా...తెరువబడివుంటాయి. ఇంతటితో... మన...బాంధవ్యం తెగినదని అనుకోకండి.'

ఆమె కంఠం పూడుకుపోయింది. అశ్రుభరిత నేత్రాలను తుడుచుకోటానికి ఆమె ప్రయత్నించలేదు.

సావిత్రి ఇక జాగుచేయలేదు. చటుక్కున బిడ్డను ఆమె ఒడిలోవుంచి ఆప్యాయంగా నుదురు నిమిరింది.

చుట్టూ నుంచున్న వారి కళ్ళు చెమర్చాయి. ఆ దృశ్యం అందరి హృదయాలను తట్టింది.

రమణి మౌనంగా వుండలేకపోయింది. పద్మకు దగ్గరగా వచ్చి 'పద్మా...మీరేనా అంటు···ఇలామాట్లాడింది...నాకు చాలా సంతోషం...ఈ గడియను ఎలా భరించాలోనని భయపడిపోయాను...మాకు సంతోషమైంది...మా పని పరిపూర్ణమైంది...ఒక్కమాట... మీరు నిజంగా మారిపోయారు..ఎలా సాధ్యమైంది?'

పద్మ నవ్వింది.

'ఈ ఇరవై ఒక్కరోజులు నాకు కనువిప్పు కల్గించాయి. తల్లి హృదయం ఎటువంటిదో అప్పుడర్థమైంది...ఈ దినాల్లో నాకు.. భోజనం సహించలేదు...ఎక్కడికి వెళ్ళాలనిపించలేదు. నా హృదయాన్ని బాబుమూర్తి ఆవరించింది. వాడు కళ్ళలో మెదిలేవాడు. నా ప్రతి అణువు బిడ్డకోసం తహతహలాడిపోయేది...ఆలోచించే దాన్ని...ఈ ఎడబాటు సావిత్రి గారికి ఎంత సహింపరానిదో ఊహించగల్గాను... అక్కయ్యా—సావిత్రీ...నా తప్పులు మన్నించి అనుగ్రహించండి' అంటూ రెండు చేతులు జోడించింది.



# దిగంబరతరం

## శ్రీ నిఖిలేశ్వర్

ఆకాశంకింద స్వచ్ఛమైన మేఘంలా
నిలుచున్న నా తరం
లోకం దుమ్ము దులుపుకుంటూ
ప్రశ్నల సిలువను మోస్తున్నది దారిపొడుగునా!

ఎదుటి ఇంటివాడు ఏమి చూస్తాడోనని
అనుమానాల తెరలను వేలాడదీసిన కుటుంబాలు
తెగిన వాత్సల్యపు తీగలమధ్య ఊగుతున్న
ఆప్తుల సంబంధబాంధవ్యాలు.

గడియారాల మ్యూజియమ్‌లో
ఏనాడో సణుగుడు మానేసిన
గతించిన కాలపేటిక స్వరాలు,
ఇంకా ఎందుకో అర్థంకాని గాడిద బరువును
లాగుతున్న ఆనవాలులేని ఆధునికులు.

అందం—ఆనందం
పళ్ళెంనిండా అన్నం
లోతైన లోయలో చెల్లాచెదరై
చెరువుగట్టున—నగరం పొట్టన
చేపల్లా తన్నుకుంటున్న
ఎండిన బొమికలు
నవతరాన్ని విశ్వాసంలో
మిగిల్చిన దిగంబర ఆశలు.

పాశవిక సహజాతాన్ని
పశువుల సహజీవనానికి వదిలి
పొడుగునా దూరంగా సాగిపోయే
గ్రాండ్ట్రంక్ రోడ్డుమీద

నిరంతరంగా క్రూరంగా వెనక్కికొట్టే
బూజుపట్టిన భక్తుల మందల మధ్య
ఆకలిని—ఆరాటాన్ని- అణుజ్వాలను
ఈ తరం నలుదిక్కులతో తొడుక్కుంది.

పసితనం—కాయువగరు
ఈ మెదడునిండా, వంటినిండా!
కడుపునింపి—వొళ్ళుకప్పి
మనస్సునిండా మహోద్రేకం రేపే
వ్యవస్థ పొలిమేరలో కూచున్నారు,
క్రొత్తతరం వాళ్ళు, ఆకలితో—దినమొలల్తో
కట్టిచుట్టూ నిద్రాలేమి వలయం
అవిశ్రాంతంగా అజ్ఞాతంగా
పాటుపడుతున్న మంచితనం
బాహాటంగా బట్టలు కట్టుకొన్న చెడ్డతనం.

అవధులులేని భూమిచుట్టూ ఈ తరం
నిరాడంబరంగా నిస్సంశయంగా
కొరడా దెబ్బల గాయాల చుట్టూ
తడుముకొంటూ
సముద్రమంతటి ఆశతో
కళ్ళల్లో నీరసదేవతలకు ఉరితాడు బిగించి
రిక్త హస్తాలలో స్నేహాన్ని కూచోబెట్టి
అంబర చుంబితమైన మేధతో ఈ తరం.

అందంగా తియ్యని అనుభూతికి సాకారంగా
దుస్తుల ఆకారంలో హృదయాన్ని కరిగించే
మనిషి సుందర విగ్రహం,
ఇప్పుడు కళ్ల ఎదుట
విప్పేసిన దుస్తులను వెక్కిరిస్తూ
అంతే ఎనలేని అనుభూతిని
నిలిపే దిగంబర మానవునికోసం
ఇక్కడ ఈ తరం దిగంబర తరం

# ఐకన్‌లు

శ్రీ ఎస్. వి. రామారావు



సెంట్ పారస్కేవా - 14 వ శతాబ్దం నాటి బైజాంటైన్ "ఐకను"

వేసవి కాలంలో చాలా కళాప్రదర్శనలు, శిల్పప్రదర్శనలు జరుగుతాయి లండన్‌లో. అమెరికనులు యూరప్ చూడడానికై వస్తారు. లండన్‌లో ఆగి కొన్ని రోజులుండి వెళ్తారు యూరప్‌కు. యూరప్‌నుండి ఎంతోమంది లండన్ వస్తారు. కళాభిలాషవున్న వారందరు యిక్కడ జరిగే ప్రదర్శనలు చూస్తారు. అందువల్ల గ్యాలరీలు అన్నీ ఎంతో వుత్సాహంగా వివిధ ప్రదర్శనలు ఏర్పాటు చేస్తాయి.

టేటు గాలరిలో బ్రహ్మాండమైన ప్రదర్శన జరుగుతున్నది. పికాసో శిల్పాలన్నిటిని, ఎంతో శ్రమపడి ప్రపంచం నలుమూలలనుండితెచ్చి, ప్రదర్శిస్తున్నది టేటుగ్యాలరి. కామన్‌వెల్త్ ఇన్స్టిట్యూట్‌లో



నల్గురు డైకన్‌లు; ఇద్దరు బిషప్పులు : రష్యన్ "ఐకన్"లు - 16 వ శతాబ్దంనాటివి.

కెనడా చిత్రకళా ప్రదర్శన జరుగుతున్నది. ఆఫ్రికన్ పురాతన శిల్పాల్ని; 13 వ, 14 వ శతాబ్దపు యూరప్ చిత్రాల్ని; మథీస్, డిరైన్ రేఖాచిత్రాల్ని; పురాతన బ్రిటిష్ నీటిరంగుల చిత్రాల్ని; హెన్రీమూర్ క్రొత్త శిల్పాలు; రష్యన్, యుగోస్లావియాలనుండి ఐకన్‌లను ఎన్నో గ్యాలరీలు ప్రదర్శిస్తున్నవి. కళా పిపాసకునికి ఈ ప్రదర్శనలు విందు భోజనంలాంటిది యిప్పటి లండన్.

ఇక్కడ టెంపులు గ్యాలరి అని ఒక్కటి వున్నది. ఇది చాల ఫేషనుబుల్ బ్రామ్‌టన్‌రోడ్డులో వుంది. చిన్ని ముచ్చటైన గాలరి. ఇక్కడనే 'ఐకన్' చిత్రాలు ప్రదర్శిస్తున్నారు. ఎంతోమందిని ఆక ర్షిస్తున్నది ఈ గాలరి. ఐకన్‌లను గురించి చది వాను లండన్ యూనివర్శిటీలో 1964 లో. కొన్నిటిని గురించి వివరంగా నోట్సు వ్రాశాను నేష నల్ మ్యూజియమ్‌లోచూచి. కాని అంతగా ప్రాముఖ్యత యివ్వలేదు ఎవ్వరు వీటికి. ఇన్ని ఐకన్‌లను ఒక్క చోట చూడడం విశేషం. అందువల్లనే గాబోలు అందరూ ఈ ప్రదర్శన చూస్తున్నారు. నేను యిది వరకు యిన్ని ఎక్కడా చూడలేదు లండన్‌లోగాని, అమెరికాలోగాని. ఈ చిత్రాలపై కొద్దిమంది పుస్త కాలు వ్రాశారు. కాని అంతగా తెలియదు వీటిగురించి. వీటిపై రీసెర్చిచేసి తెలుసుకోవలసింది ఎంతో వుంది.

'ఐకన్' అన్నది గ్రీకు పదం. దీనికి 'ప్రతి బింబము' అని అర్థం. గ్రీకు ఆర్థడాక్స్ చర్చి వీటిని ప్రాముఖ్యతలోనికి తెచ్చింది. గ్రీక్‌చర్చి యిహలోకంలోవున్న పరలోకం. అంతటి ఆధిక్యతను తనకు తానే ఆపాదించుకుని భగవంతుని ప్రతిబింబి స్తుంది. క్రీస్తును గురించిన బైబిలుకు సంబంధిం చిన కథలను గురించిన చిత్రాలు ప్రతిబింబిస్తాయి ఐకన్‌లలో. అసలు ఈ ఐకనులకు మూలం ఈజిప్టు లోని సమాధి చిత్రాలు. ఈజిప్షియన్‌లు చనిపోయే ముందు వారి రూపచిత్రాలను చిత్రింపించుకుంటారు వారి కాఫిన్‌లలో. చచ్చిపోయిన శవాలను వారి వారి రూప చిత్రాలలోని కాఫిన్ లలో వుంచుతారు. అది మూలం ఈ ఐకన్‌లకు. గ్రీకు ఆర్థడాక్స్ చర్చి ఈ పద్ధతిని తీసికొని, పూర్తిగా క్రిస్టియన్ చిత్ర కళగా మార్చివేసింది. విపరీతంగా ఐకన్‌లను ప్రచా రంలోనికి తెచ్చింది. రష్యన్‌లు యింకొంచెం ఈ కళను సాగించి స్వంతం చేసుకున్నారు.

ఈ ఐకన్ చిత్రాలు చర్చిలో పూజించడానికై వుపయోగించేవారు. పండుగ వూరేగింపులలో వీటిని మోసుకొని వెళ్లేవారు హృదయాలకు హత్తుకొని. బైజాన్‌టైన్ ఎంపైర్‌లో యిలా ప్రచారంలోనికి వచ్చేముందు ఐకన్ చిత్రాలు ఎన్నో ఆటంకాలను ఎదుర్కోవలసివచ్చింది. ఈ ఎంపైర్ తూర్పు ప్రాంతా లలో (అనగా టర్కీకి దగ్గరప్రాంతాలు) ఆరబ్ నాగరి కత, మత సాంప్రదాయాలు ఎక్కువగా వుండేవి. అరబ్బులు దైవాన్నిగాని, మత ప్రవక్తలనుగాని రూప చిత్రాలలోగాని, శిల్పాలలోగాని మలచి ఆరాధించరు. విగ్రహారాధన వీరికి విరుద్ధం. ఈ ఐకన్‌లు దైవ రూపాలను చిత్రించి చూపుతాయి గనుక ఈ తూర్పు ప్రాంతాలవారు నిరసన విజృంభణ లేవదీసారు. మతాధి పతులు విగ్రహారాధనను నిరసిస్తూ, ఈ ఐకన్ చిత్రా లను తగలబెడుతూ, సభలను ఏర్పాటుచేస్తూ ఈ విష యాన్ని రాజకీయరంగంగా మార్చి అలజడి లేవదీసారు. పశ్చిమప్రాంతంఅంతా ఐకన్‌లను పూజిస్తే అరబ్ మత సంప్రదాయ ప్రభావంతో ప్రాక్‌ప్రాంతం ఐకన్‌లను నిరసిస్తూవచ్చింది. ఈ మత గురువుల వొత్తిడి కొంత కాలం సాగింది బైజాన్‌టైన్ రాజులపై, రాజ్యాంగ వ్యవహారాలపై. కాని ఎంపైర్ మొత్తంపై చాలమంది ప్రజలు ఐకన్‌లను పూజించేవారు. క్రీ. శ. 787 లో బైజాన్‌టైను మహారాణి 'నిసియ రెండవ మహా సభ' ఏర్పాటు చేసింది. ప్రజలు ఐకన్ చిత్రాలను పూజించడంలో తప్పులేదని, భగవంతుని ఆరాధించ డంలో మహదానందం వున్నదని, ఈ చిత్రారాధనను ఎక్కువగా ప్రజలు అనుసరించాలని ఆ సభలో తీర్మా నింపబడింది. దీనితో ఐకన్ చిత్రరచన ఎంతో విజృం భణగాసాగింది. బైజాన్‌టైన్ ఎంపైర్ అంతా ఈఐకన్ చిత్రాలు పూజింపబడసాగినవి. రాజాంగీకారం, ప్రభు త్వపు అండ ఈ చిత్రరచనకు బాగా దోహదం చేశాయి. యూరప్ అంతటి నుండి ప్రజలు వచ్చి ఈ చిత్రాలను తీసికొని పూజించడం ప్రారంభించారు. దీనికి ఒక ముఖ్యకారణం వుంది. ఈ చిత్రాలు ఆరా

ధించేవారికి ఏ జబ్బులున్నా నయమైపోతాయని, భగవంతుడు ఎప్పుడూ వీరి యింట్లోనే నివసిస్తాడని, పిలిస్తే దేవుడు బదులు పలుకుతాడని, యింకా ఏవేవో కథలతోగూడిన మూఢనమ్మకాలు ప్రచారంలోకి వచ్చాయి. ఇకనేం ప్రజలు వేలంవెర్రిగా వీటిని ఆరాధించడం సాగించారు. చిత్రాన్ని ఎంతో భక్తితో ముద్దుపెట్టుకొని దేవుణ్ని వరాలు కోరేవారు. అందువల్ల ఎన్నో ఐకన్‌లు రంగులుపోయి, జిగురు పూసుకొని, మైనపువత్తి పొగలతో కప్పుకొని అసలు గుర్తించడానికే కష్టంగా వుంటాయి. వీటిని గుర్తుపట్టడం, ఏ దేశంలో చిత్రించబడ్డాయో కనుక్కోవటం ఎంతో కష్టమైన పని. ఈ చిత్రాలు యుగోస్లావియా, రష్యాలలోగూడా ప్రచారంలోనికి వచ్చాయి.

ఈ చిత్రాలను చెక్కపై చిత్రించడం వాడుకలో వుండేది. చిత్రించదలచిన చెక్కను ఎన్నుకొని, జాగ్రత్తగా, చిత్రించేందుకు వీలుగా పదును చేస్తారు. లేకపోతే చెక్క బీటలువారి పగిలిపోతుంది. నిమ్మ, బర్చి, అల్డర్, ఓక్ చెక్కలను వాడేవారు. ఇవి రంగులువేసిన తర్వాత చాలా కాలం నిలచేవి. తర్వాత స్ప్రెస్ చెక్కలను గూడ వుపయోగించారు. దంతపు ఐకనులను గూడ చూచాను. ఇవి చాల అరుదు.

చర్చి ఎంతోమంది చిత్రకారులచేత ఐకనులను చిత్రింపించేది. చాలమంది చిత్రకారులు మతగురువులే. మొనాస్టరీలలో చిత్రకారులు చర్చి పూజలకొఱకు చిత్రించేవారు. ఈ చిత్రకారులు జీవితాన్ని చర్చికి అంకితం చేసిన సాధువులు. అందువల్లనే ప్రజలలో ఎంతో భక్తి ఈ ఐకనులంటే. ఇవి చర్చిలో తయారు చేయబడ్డవి గనుకనే ఎన్నో కథలతో, మూఢనమ్మకాలతో కూడుకొని ప్రజలలో నమ్మకాల్ని పెంపొందింప చేసేవి.

ప్రజలలో వీటి అవసరం ఎంతో వుండడం వల్ల చర్చిలోని ముఖ్యమైన చిత్రకారులు ఐకన్‌లలోని 'ముఖము'లను మాత్రమే చిత్రించేవారు. వీరి శిష్యులు మిగిలిన చిత్రాన్ని, చిత్రంచుట్టూవున్న డిజైనులను పూర్తిచేసేవారు. ఆ విధంగా చర్చికి, ప్రజలకు, కావలసిన చిత్రాలను అందజేసేవారు చిత్రకారులు. ముఖ్యంగా 'ముఖముల'ను మాత్రమే చిత్రించే ప్రముఖ చిత్రకారులను రష్యన్‌లు 'లిచ్ మికి' అని, మిగిలిన చిత్రాన్ని పూర్తిచేసే శిష్యులను 'డోల్చినికి' అని పిలుస్తారు. చిత్రంలోని బ్యాక్ గ్రౌండు భాగం అంతా తగరపులాంటి సన్నని బంగారము లేక వెండి పొరలను అతికించేవారు చెక్కకు. ముందుగా ఈ భాగాన్ని ఎఱుపు ద్రాక్షరసంతో శుభ్రపరుస్తారు. చిత్రంలోని ఈ బంగారపు మెఱుపును 'స్వెత్' అంటారు రష్యన్‌లో; అంటే 'వెలుగు' అని అర్థం. ఇది దేవుని యొక్క ప్రకాశం. మన హిందూ చిత్రాలలోగూడ ఈలాంటి పద్ధతేవుంది. దేవుని తలవెనుక సూర్యునిలాంటి వెలుగు ప్రకాశిస్తుంది. అది ఆయన మహిమను, దైవత్వాన్ని సూచిస్తుంది. కొన్ని ఐకన్‌లలో కంచు, బంగారపు పొరలనుగూడ వాడేవారు రష్యనులు. దీన్ని 'ఇనొకాప్' అంటారు. రష్యనులు ఈ ఐకన్ చిత్రాలను ఇంటి గదిలోని కుడివైపు మూలలో వుంచుతారు. చిత్రంముందు ఎప్పుడూ క్రొవ్వువత్తి వెలుగుతూ వుంటుంది. ఈ విధంగా క్రీస్తుమతం సర్వవేళలా ఇంటిలో వెలుగుతుంది.

రష్యాలోని 'కియఫ్' నగరంలో ఐకన్ చిత్రాలు రచించడం జరిగింది మొట్టమొదటి సారిగా. అప్పటికి బహుకొద్ది క్రిస్టియన్ చర్చిలు మాత్రమే వున్నాయి రష్యాలో. అసలు క్రిస్టియన్ మతం మొదటినుండి రష్యాలో లేదు. రష్యనులు క్రీ. శ. 988 వరకు ఎంతోమంది దేవుళ్లను ప్రార్థించేవారు. విగ్రహారాధన విపరీతంగా వుండేది. ఈ నగరంలోవున్న బహుకొద్ది చర్చిలు రష్యనులకు కాదు, ఇతరదేశాలనుండి వ్యాపారం చేయడానికై ఈ నగరానికి వచ్చిన వ్యాపారస్థుల కోసం నిర్మించబడినాయి. కియఫ్ ఎంతో ప్రాముఖ్యమైన వ్యాపార కేంద్రం. క్రీ. శ. 988 లో ప్రిన్స్ ఆఫ్ కీవ్ అయిన వ్లాడిమియొ, గ్రీకు ఆర్థడాక్స్ మతాన్ని స్వీకరించాడు. రాజు తలచుకుంటె దెబ్బలకు కొదవేమిటి? తాను మతం పుచ్చుకున్నాడు గనుక తన రాజ్యంలో వున్న ప్రజలందరు ఈ మతం పుచ్చుకోవాలని శాసించాడు. రష్యాలో శాసనం వచ్చిందంటే అధికారులు క్రమం తప్పకుండా అనుసరింప చేస్తారు ప్రజల్ని. మొదటినుండి అలాంటి పద్ధతి వారిది. ఇకనేం ప్రజలందరు మరో ఆలోచన లేకుండా బాప్టిజం తీసుకున్నారు. అంతవరకు వారు పూజిస్తున్న వివిధ దైవ విగ్రహాలు, చిత్రాలు అన్నిటిని ధ్వంసం చేయించాడు

రాజు వ్లాడిమియె. ఎన్నో చర్చిలను కట్టించాడు. గ్రీక్ ఆర్థొడాక్స్ ఎంపైర్‌కు జీవమైన 'కాన్‌స్టాంటినోపుల్' నగరానికి ప్రతిబింబంగా తయారయింది "కియఫ్" నగరం. ఇప్పటి రష్యాలంతా అసలు కియఫ్‌ను ఆధారంగా చేసుకొని పెరిగింది అని చెప్పవచ్చు. కియఫ్ నగరం ఐకన్ చిత్రాలకు కేంద్రమైంది. ఎన్నో చిత్రాలు యిక్కడ చర్చిలనుండి వచ్చాయి. వ్లాడిమియె మొట్టమొదటి చర్చికి శంఖుస్థాపన చేసాడు. ఇదే రమ్యమైన 'వర్జిన్ ఆఫ్ ది డైమ్స్' చర్చి. ఇది రష్యన్ ఐకను చిత్రాలకు, గోడపై చిత్రాలకు ఎంతో ప్రసిద్ధి. ఇతని చిన్నకొడుకు యారొస్లావ్ క్రీ. శ. 1036 లో 'హగియ సోఫియ' అనే బ్రహ్మాండమైన చర్చిని కట్టించాడు. ఇది తండ్రి కట్టించిన చర్చిని మించి వుంటుంది సుందరతలో.

కియఫ్ నగరంలోని సుందరమైన ఐకన్‌లను చిత్రించినది ముఖ్యంగా గ్రీకు చిత్రకారులు. ప్రముఖ గ్రీకు చిత్రకారులను పిలిపించడం జరిగింది. వారికి సహాయపడుతూ ఎంతోమంది రష్యనులుగూడా వున్నారు. ఈ ఐకన్‌లు చర్చి ఆఫ్ డైమ్స్, హగియ సోఫియా, చర్చి ఆఫ్ సెంట్ మైఖేల్, చర్చి ఆఫ్ ది మోనాస్ట్రి ఆఫ్ ది కేవ్స్‌లలో కన్పిస్తాయి. రష్యనులు ఎంతో జాగ్రత్త తీసుకున్నారు ప్రారంభంనుండి చిత్ర రచనలో. బైజాన్‌టైన్ చిత్రాలు సంప్రదాయసిద్ధంగా, ఎక్కడా ఏ మార్పు లేకుండా ఒకేమాదిరిగా వుంటాయి. మార్పు కన్పించదు ఏ కాలంలో గూడా. కాని రష్యనులు వారి చిత్రాలలో రూపాలను సహజ సిద్ధంగా వుండేట్లు, ముఖములో మృదుత్వం వుండేట్లు (బైజాన్‌టైన్ చిత్రాలలోని రూపచిత్రాల ముఖకవళికలు చాల బిరుసుగా వుంటాయి) చిత్రించారు. చిత్రంలోని రూపాలదేహం బలంగాను, రూపచిత్రంలో విషయంలో రేఖామయంగాను వుంటాయి.

కియఫ్‌లోని ఐకన్ చిత్రరచనలాగే చెప్పుకోవలసిన మరొక ముఖ్యకేంద్రం నఫ్‌గోరడ్. 13 వ, 14 వ శతాబ్దాలలో ఎంతో ప్రాముఖ్యతలోనికి వచ్చింది. ఇక్కడి చిత్రకారులు కియఫ్ చిత్రకారుల వలెనే బైజాన్‌టైన్ ఐకను చిత్రాలనుండి తమ శైలులను రూపొందించుకున్నారు. వీరి పద్ధతులలో ముఖ్యంగా కన్పించేది గుండ్రని బాగా వాలిపోయిన భుజాలు. ఈ చిత్రాలలో ఎఱుపు, బంగారుమెఱుగు రంగు మిశ్రమం ఎక్కువగా వుంటుంది. తెలుపు, లేతఆకుపచ్చనిరంగు, ప్రపంచప్రసిద్ధమైన ఒక విధమైన రష్యన్‌బ్లూరంగుల మిశ్రమం ఒక ప్రత్యేకత. ఈ మిశ్రమానికే 'నఫ్‌గోరడ్' చిత్రకారులు ప్రసిద్ధి. వీరి చిత్రాలలోని మతగురువులు వరుసగా నిలబడి వుంటారు. ఒకరి వెనుక వొకరు నిలబడి వున్నట్లు చిత్రించారు. వీరి శరీరాలు చాల దృఢంగా వుంటాయి. మరొక ప్రత్యేకత గుండ్రని తలలు. రష్యనుల తలలు గుండ్రంగా వుంటాయి. గనుక చిత్రం చూడగానే ఇది రష్యనుల ఐకన్ అని చెప్పవచ్చు. అలాంటి ప్రత్యేకత కొఱకే రష్యను చిత్రకారులు (గ్రీకు చిత్రకారుల సహాయంతో మొట్టమొదటగా ప్రారంభించినా) ఎన్నో మార్పులు తెచ్చారు.

రష్యను చిత్రకారులలో చెప్పుకోదగ్గ ప్రతిభావంతులు ఆండ్రూ రూబ్లేఫ్, దియోనిసియస్‌లు. వారిద్దరు సంప్రదాయ సిద్ధంగా చిత్రరచన చేశారు. ఏ మాత్రం మార్పులన్నా సహించలేదు. ప్రజల అవసరం తీర్చడానికై రష్యన్ చర్చిలు లోహపు ఐకను ముద్రణలు తయారు చేయించేవి. వీటినుండి ఎన్నో కంచు, ఇత్తడి ఐకనులను ముద్రింపించారు. ఇదొక్కటే సులభమైన మార్గం ప్రజలకు ఐకనులను త్వరగా అందించడంలో. ఇంత విజృంభణగ సాగిన ఐకన్ చిత్రాలకు క్షీణదశ వచ్చింది. కాన్‌స్టాంటినోపుల్‌ను టర్కి జయించింది 1453 లో. దీనితో ఈ నగరపు రూపే మారిపోయింది. నగరం ఎంతో అభివృద్ధి అయింది వ్యాపార రంగంలో. వ్యాపారం పెరగడంవల్ల మధ్యతరకపు ధనిక తరగతి క్రొత్తగా పైకివచ్చింది. వీరు చిత్రాలను కొనడం ప్రారంభించారు. వీరి అభిరుచులు వేరు. దానితోబాటు కళాభిరుచులు గూడ వేరుగానే వున్నాయి. మాస్కోలో ఇటాలియన్ ఆర్కిటెక్ట్స్ రావడం, వారితోబాటు క్రొత్తరకపు అభిరుచులను తేవడం జరిగింది. మాస్కోలోని పెక్కుభవనాలను యిటాలియన్‌లచేత కట్టించారు రష్యనులు. ఇటాలియన్ల కళాభిరుచి ఐకన్ చిత్రకళ క్షీణదశకు శంఖుస్థాపన చేసింది.

యుగోస్లావియా గూడ ఐకన్‌లకు చాలా ప్రసిద్ధి. ఓహ్రిడ్‌లో ఐకన్‌లను చిత్రించడం జరిగింది. బైజాన్‌టైన్ పద్ధతి అప్పటికే ఎంతో బలంగా వుంది. ఈ పద్ధతినుండి తప్పించుకొని

క్రొత్తరకపు కళను సాగించడం ఎంతో కష్టం. అయినా యుగోస్లావియా మార్పుకు ప్రయత్నం చేసింది. అందువల్లనే 13 వ శతాబ్దపు యుగోస్లావియా ఐకన్ కళలో బిరుసైన, సంప్రదాయసిద్ధమైన బైజాన్‌టైన్ శైలి, సాగసైన, ఆహ్లాదకరమైన స్లావిక్ శైలులు కనిపిస్తాయి. కాన్‌స్టాంటినోపుల్‌ను టర్కీ జయించడంతో ఎంతో మార్పు వచ్చింది. సెర్బియన్ చర్చిలలోని చిత్రకారుల సంప్రదాయాన్ని పోనివ్వకుండా సాగించారు చిత్రరచన. కాని అది ఎంతో కాలం జరుగలేదు.

16 వ శతాబ్దంలో టర్కీ జయించిన ప్రాంతాలలో చిత్రమైన మార్పులు వచ్చాయి ఐకన్ చిత్రకళలో. చిత్రరచనలో, రేఖలతీరులలో ఎంతో బలహీనత, దేహపురంగులలో మామూలుగా వుండే యూరపియన్ రంగులకు బదులు కొద్దిగా నల్లని ముతుకరంగులు వచ్చాయి.

18 వ శతాబ్దము వచ్చేసరికి దాదాపు ఐకన్‌ల పద్ధతి, మారిపోయింది. బలమైన ముతకరంగులతో ఏదో గ్రామీణ చిత్రకళ మాదిరిగా తయారయ్యాయి. ఈ ఐకన్ చిత్రకళ మతసంప్రదాయాన్ని ప్రతియింటిలోనికి తెచ్చింది. ప్రజలలో దైవభక్తిని పెంపొందించింది. చర్చి అభివృద్ధికి ఎంతో దోహదమిచ్చింది. కాలం మారుతూ, ప్రజలలోని అభిరుచులుమారుతూ వుండే సరికి, ఐకన్ పద్ధతి కాలానికి వెనుకబడ సాగింది. ఇప్పుడు ఐకన్ ఒకనాటి కళ.

ఇప్పుడు చూస్తే, క్రొత్తగా వుంటుంది. ఆ నాటి కళ, ఆ నాటి అభిరుచి ఒక వినూత్నమైన అనుభవం యిప్పుడు.

# లండన్‌లో యువచిత్రకారులు-వారిపద్ధతులు

కొంతకాలం క్రిందట ఇద్దరు యువ చిత్రకారులు తమచిత్రాలను ప్రదర్శించారు లండన్‌లో. ఒరిస్సానుండి ప్రఫుల్ల మోహన్తి, కలకత్తానుండి ఆషూరాయ్ చాలకాలంనుండి లండన్‌లో వున్నారు ఉద్యోగాలుచేస్తూ. ఆషూ ఫిజిక్స్‌లో సర్ప్‌డిగ్రీ, ప్రఫుల్ల ఆర్కిటెక్చర్‌లో డిగ్రీని తీసుకున్నారు. ఇద్దరికి చిత్రకళపైనే బ్రతకవలసిన అవసరం లేదు. కాని చిత్రకళతో పేరు తెచ్చుకోవాలని ఆశిస్తున్న యువకులు.

కామన్‌వెల్త్ ఇన్స్టిట్యూట్‌లో ఆషూ ప్రదర్శన, గ్రిడియాన్‌గాలరీలో ప్రఫుల్ల ప్రదర్శనలు జరిగాయి. ఆషూ 50 చిత్రాలు (శిల్పాలా?) ప్రదర్శిస్తే, ప్రఫుల్ల 38 చిత్రాలను ప్రదర్శించారు. ఇద్దరు ఎన్నో విధాల విభిన్నులు. ఆషూవి, శిల్పమయ చిత్రాలు. పల్చని చెక్కలతో పేర్చి అల్లినవి. ఎన్నో ఆకారాలలో మలచినవి. వీటికి రంగులువేసి గోడకు తగిలిస్తాడు. అన్నీ ఆధునిక కళకు చెందినవే. వీటి సైజులు 60" X 40" నుండి 8" X 3" లకు మధ్యన వుంటాయి. ధరలు 30 పౌండ్లనుండి (నాలుగు మాత్రమే 20 పౌండ్లనుండి 30 పౌండ్ల వెలలో వున్నాయి) 2 పౌండ్లవరకు వున్నాయి. ఇంత తక్కువ ధరలతోవున్న ఏ చిత్ర



చిత్రకారుడు : శ్రీ ప్రఫుల్ల మోహన్తి

కళా ప్రదర్శనను నేను చూడలేదు. ఈ ధరలు లండన్‌లో ధరలు కావు. అంతతక్కువ. నిజానికి చాలా చిత్రాల 'ధర'లు వాటి చెక్కలకు, రంగులకు, ఫ్రేములకు అయిన ధరంకంటె తక్కువ. చూచిన వారు—ఎక్కువగ బెంగాళీయులు—మూడు, నాలుగు చిత్రాలు కొన్నారు 2 పౌండ్లవి, 4 పౌండ్లవి. ఏపొక్క పత్రికా వ్రాయలేదు. అసలు ఈ ప్రదర్శన జరుగుతున్నదని ఎంతమందికి తెలుసు?

ప్రఫుల్ల చిత్రాలు కాన్వాస్‌పై చిత్రించినవి, కాగితంపై నీటిరంగులలో వేసినవి. చాలా డ్రాయింగులు (డిజైనులా?) గూడా వున్నాయి. చాల డబ్బు ఖర్చుపెట్టాడు పోస్టర్లకు. సినిమాపోస్టర్లమాదిరిగ రంగులలో ప్రింటు చేయించి లండన్‌లోని అండర్ గ్రౌండు స్టేషన్లలో అతికింపించాడు. తనకు వున్న గుణగణాలను బాహాటంగా చాటుకున్నాడు. చిన్నపిల్లలంటే ఎంతో ప్రేమ అని, నృత్యం గూడ చేస్తానని, చిన్నపిల్లలకు చిత్రలేఖనం, నృత్యంనేర్పడంలో తాను మహదానందం చెందుతానని, ఎంతో బీదప్రాంతమైన గ్రామంలోనుండి వచ్చానని—యిలా ఏవేవో కబుర్లతో కథలతోనూ, ఇండియాను వర్ణించిన్ని తాను యిండియన్ ఆర్టిస్టునని, చెప్పుకున్నాడు. ఇతని ప్రదర్శన ఆషాకంటే కొద్దిగ విజయవంతమనే చెప్పాలి, అర్థికంగా. మన దిండ్ల గలీబులకు వేసే డిజైనులను కాగితంపై గీసి డ్రాయింగులుగా ప్రదర్శించాడు. కమలము మాదిరిగ రంగులలో, ఎక్కువగా కుంకుమరంగులో చిత్రించాడు. నాలుగైదు చిత్రాలు చూస్తే చాలు అన్నీ అలాగనే వుంటాయి. తాను మోడరన్ చిత్రకారుడనని చెబుతాడు. స్వతహాగా చిత్రకళను నేర్చుకొని ప్రదర్శిస్తున్న యువకుడు. ఇక్కడ చాలమందిని చూచాను, భారతీయులను. ముఖ్యంగా బొంబాయిలో ఆర్కిటెక్చరు నేర్చుకున్నవారిని. అందరు యిక్కడకు వచ్చినతరువాత మరల ఆర్కిటెక్చరు. ముఖ్యంగా టౌనుప్లానింగ్ చదువుతారు. వీటిలో ఉద్యోగాలు తేలికగా దొరుకుతాయిట. కాస్త ఆర్థికంగా బలపడినతర్వాత చిత్రలేఖనం మొదలుపెడతారు, ఏదో ఈవినింగు ఆర్ట్ స్కూల్‌లో వారానికి నాలుగైదు గంటలు నేర్చుకొని కొద్దికాలం.

వారి చిత్రాలతోబాటు ఇండియాను ప్రదర్శిస్తారు, ఎన్నో విలవల పలవల కథలతో వర్ణిస్తూ. చిత్రకళా ప్రదర్శనలలో, ముఖ్యంగా అంతర్జాతీయ కేంద్రమైన లండన్ నగరంలో ఏ విమర్శకుడూ, కళ అంటే ఏమాత్రం తెలిసిన అతనూ, చిత్రకారుడు రంగురంగుల ప్రాంతంనుండి వచ్చాడు గనుక మెచ్చుకోడు చిత్రాలను. ఆ సంగతి తెలుసుకుంటే ఎవరూ యిలా కథలు చెప్పకోరు తమగురించి, తమ దేశం గురించి.

వారి ప్రదర్శనలు విఫలమైతే (అంటే వారనుకున్నంతగా విమర్శకులు మెచ్చుకోకపోతే, అమ్మకపోతే చిత్రాలు) అందరిని పట్టుకొని తెగనాడతారు—అసలు వీరికి ఇండియన్ కల్చర్ అంటే ఏమి తెలుసునని. ఈమధ్య ఒకావిడ బొంబాయి స్కూల్‌లో డిప్లమా పొందివచ్చింది ప్రికాలో ప్రదర్శించింది. లోకల్ పేపర్లు వ్రాసాయి బాగా వున్నాయని. అవన్నీ పట్టుకొని లండన్ వచ్చింది భర్తతో. ఎన్నో గాలరీలు చూచింది. తన చిత్రాలను చూపించింది. పాపం ఏ గాలరీకి ఈవిడ చిత్రాలు నచ్చలేదు. వారికి తెలిసిన అతను ఒకాయన నన్ను కలుసుకోమని చెప్పగా నన్ను కలిసింది. చిత్రాలను చూపించి నా అభిప్రాయం అడిగింది. చిత్రాలు చాల మామూలు పద్ధతిలో 'బావినుండి నీరు తెస్తున్న యువతి' లేక 'చెట్టుకు ఆనుకొని నిల్చున్న స్త్రీ'ల లాంటివి. కొన్ని బలవంతంగా ఆబ్స్ట్రాక్ట్ పద్ధతిలోను, మరికొన్ని ఇంప్రెషనిస్ట్ పద్ధలోను చేసినవి. ఇలా కలగాపులగంగావుండి, అసలు ఏమిచెప్పదలచుకున్నదో చిత్రకారిణి, ఎవ్వరికి తెలియదు. నా అభిప్రాయం చెప్పమని ప్రాణంతీస్తే నిజమేకదా అని, తోటిచిత్రకారుని అభిప్రాయాన్ని స్నేహపూర్వకంగా తీసికొంటుందని బుద్ధిపొరపాటున భావించి, నాకు తోచినట్లు విమర్శనగా చెప్పాను ఆవిడ చిత్రాలను గురించి. అంతే మరల ఆవిడను యింతవరకు చూడలేదు. నాకు చాలామంది తెలుసు గనుక నా చిత్రాలను గురించి వ్రాశారని, అంతా Influence అని, ఏదేదో అన్నదట. నా అభిప్రాయం అడిగితే తోచింది

చెప్పాను. నేను కొన్ని గ్యాలరీలపేర్లిచ్చి వెళ్ళి చిత్రాలను చూపించమని సలహా యిచ్చాను. కాని ఆవిడ వెళ్ళినట్లులేదు.

లండన్‌లో ఏదైనా భారతీయుల చిత్రకళా ప్రదర్శన ఏర్పాటుచేద్దామని సదుద్దేశ్యంతో ఎవరైనా పూనుకుంటే ఎంతోమంది చిత్రాలు వస్తాయి. ప్రతివారు పికాసో అనుకుంటారు. ఎంతో కష్టమైనపని.

నిజానికి చెప్పుకోవాలంటే ఇక్కడ పేరున్న భారతీయ చిత్రకారులు యిద్దరు - సూజా, అవినాశ్ చంద్ర. సూజా ఈమధ్యన దెబ్బ తిన్నారు. కోర్టు వ్యవహారాలలో ఆయన చిక్కుకున్నారు. దురదృష్టవశాత్తు ఆయన రెండు ప్రదర్శనలు విఫలమయ్యాయి-పేపర్లన్ని చాల విమర్శిస్తూ, చెప్పదలచుకున్నదివుంటే అది అంతా చెప్పడం అయిపోయింది సూజా అని వ్రాశాయి. అవినాశ్‌చంద్ర చిత్రాలకంటే గోడల మ్యూరల్స్ ఎక్కువగా చేయడం ప్రారంభించారు గ్లాసులో. డబ్బు వీటిలో అయితే బాగా వస్తుంది గనుక. ఏది ఏమైనా భారతీయ చిత్రకారులుగా పేరు తెచ్చుకున్న ఈ యిద్దరూ భారతదేశానికి ఎంతోపేరు తెచ్చారు లండన్‌లో. ఎంతోకాలంనుండి లండన్‌లో వుండి, ఎంతో శ్రమించి, చిత్రకళను క్షుణ్ణంగా అర్థంచేసుకొని నూత్నచిత్రాలతో తమకు, తమ దేశానికి పేరు తెచ్చారు.

'చూడండి. ఇతను అయినకాడికి, ఎంతవస్తే అంతకమ్మి డబ్బు తీసుకుందామనికాకపోతే ఏమిటిది? చిత్రం ధర రెండు పౌనులా? దానికి అయిన అసలు ఖరీదు అంతకంటే ఎక్కువ. ఇది ఏమైనా కూరగాయల షాపా? ప్రదర్శించకపోతే ఏమి సహాయంచేయడంలేదని నిందచేస్తారు. తీరా ప్రదర్శిస్తే యిలా వుంటుంది. ఇక ఈ గ్యాలరీకి Standard ఏముంటుంది' అని నాతో అనడం జరిగింది, ఒక ప్రముఖకళావిమర్శకుడు కామన్‌వెల్తు గ్యాలరిలో ఆషాచిత్రాలను చూడడానికి వెడితే. గ్యాలరి క్యూరేటరును అడిగి ఆషాచిత్రాల ఫోటోలు తెచ్చాను ఈ వ్యాసంలో ప్రచురించడానికి.

ఎంతో ఆలోచించాను ఈ వ్యాసం వ్రాసే ముందు. ఈ ప్రదర్శనలు అంతబాగుండలేనికాడికి ఎందుకు వ్రాయడం అని. భారతీయ చిత్రకారులు



చిత్రకారుడు : శ్రీ ఆషా రాయ్.

లండన్‌లో ప్రదర్శిస్తున్నారు గనుక మనదేశంలో తెలియాలిగదా అనే నిర్ణయానికి వచ్చాను. విమర్శనగ వ్రాస్తే మరి చెప్పవలసివస్తుంది ఏమాత్రం ఈ చిత్రాలు విజయవంతమైనవి అని. లండన్‌లో మంచి ప్రదర్శనలు జరుగుతాయి; మామూలువి చెప్పుకోదగనివీ జరుగుతాయి. వ్రాసి తెలియపరచడం విమర్శకుని విధి. అందువల్ల వ్రాసాను ఈ వ్యాసం. ఇక్కడ ఏమి జరుగుతున్నది తెలియపరచడమే పని.

లండన్‌లో ప్రదర్శిస్తే మంచి గ్యాలరీలలో ప్రదర్శించాలి. ఇవి చిత్రకళలో తగిన స్తోమత వుంటేనేగాని ప్రదర్శించరు. అందుకు నిలబడగలిగితే మంచిదే. ఇక ఎలాంటి విమర్శలు వస్తాయి ప్రదర్శనకు అన్నది ఎవరూ చెప్పలేరు విమర్శకులు తప్ప. మన భారతీయ చిత్రకారులకు మంచి గ్యాలరీలు దొరకవు ఏ వొకరికో యిద్దరికోతప్ప. అదిగాక మన చిత్రకారులకు ఎలాగోలాగా, ఎక్కడోక్కడ చిత్రాలు ప్రదర్శిస్తే చాలు అనే దూకుడు అభిప్రాయం ఎక్కువగా వున్నది. లండన్‌లో ప్రదర్శించాను అనేది తమ పేరుకు తగిలిస్తే చాలు అనుకుంటారు. ఢిల్లీలో పేరున్నఒకచిత్రకారుడు,లండన్‌లోమారుమూల

ఎక్కడోవున్న ఒక టెక్నికల్ కాలేజిలో తమ చిత్రాలను ప్రదర్శించడం జరిగింది. పాశ్చాత్యులు భారతీయ కళను బాగా కొంటారని ఆశించి గాబోలు, ఎన్నో రేఖాచిత్రాలను, నీటిరంగుల చిత్రాలను మన క్రిస్టమస్ గ్రీటింగ్‌కార్డులమాదిరిగా చిత్రించి ప్రదర్శించడం జరిగింది. ఇండియాలో ఆధునికచిత్రాలు ప్రదర్శించే ఈ ఆర్టిస్టు లండన్‌లో రాజపుట్ మొగలులాంటి చిత్రాలు ప్రదర్శించడం; ఇలా ప్రదర్శించడంలో చిత్రకారులకు ఏ అభిప్రాయం వుందో నాకు అర్థంకాదు. దీనివల్ల చిత్రకారులకుగాని, చిత్రాలకుగాని ఏవిధమైన న్యాయం జరగదు.

దీనికి తగినట్లు మన భారత హైకమిషన్ ఏవిధంగాను చిత్రకారులకు తగినవిధంగా సహాయపడదు. అమెరికన్ ఎంబసీ తమ చిత్రకారుల ప్రదర్శనలకు ఎన్నో ఏర్పాట్లుచేస్తుంది. అసలు ఎలా ప్రదర్శన ఏర్పాటుచేయాలి అన్నది ఒక కళ. మన హైకమిషనులో ఎవరికి ఏమాత్రం కళగురించి రుచివున్నట్లు గాని తెలిసినట్లు నాకుగాని, చూచిన ఎవరికైనాగాని అనిపించదు. మన హైకమీషను భవనంలో Window Display చేయడానికి ఎంతో అవకాశముంది. పల్లెటూరి దుకాణంమాదిరిగా వుంటాయి, వారి Display సోదా, మరమేకులు, ఇనుపబందులు, చిన్న పూరగాయసీసాలు ప్రదర్శిస్తూ. చూస్తే డోకు వస్తుంది.

అదృష్టంకలిసివచ్చి ఇటీవల కొదికాలంపాటు Acting High Commissoner గా శ్రీ హక్సర్ గారున్నారు. ఈయనకు కళలంటే ఎంతో యిష్టం. మన కళలకు కాస్త జీవం పోసారు లండన్‌లో. చాలా సంగీతకచ్చేరీలు ఏర్పాటుచేశారు. ఎంతోమందిని వివిధదేశాల రాయబారుల కార్యాలయాలనుండి ఆహ్వానించి మన కళలను తెలియపరచేవారు. ఎన్నో విలువ గల చిత్రాలు వున్నాయి వారి స్వంత కలక్షన్‌లో. ఆ తర్వాత ఇండియాకు వెళ్లారు ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధిగారికి ప్రధాన సెక్రటరిగ. నా చిత్రప్రదర్శనను మన హైకమీషను భవనంలో బ్రహ్మాండంగా ఏర్పాటుచేయాలని తలచారు. ఈలోగా వారిని శ్రీమతి గాంధిగారు ఇండియాకు పిలవడం, నాకు అదృష్టవశాత్తు మంచి గ్యాలరిలో ప్రదర్శించే అవకాశం దొరకడం జరిగింది. మన హైకమీషను తలచుకుంటే చాల తోడ్పడగలదు ముఖ్యంగా చిత్రకారులకు. వచ్చే హైకమీషనరుగారు ఎవరోగాని, కాస్త కళలంటే ఏమిటో తెలిసినవారు వస్తే యిక్కడవున్న కళాకారులకు, భారతదేశానికి నిజంగా ఎంతో సేవచేసిన వారవుతారు. ఇదివరకు హైకమీషనరుగావున్న శ్రీ కృష్ణమీనన్‌గారు లండన్‌లో చేసిన అపారమైన సేవ ఎవరూ మరువరానిది. ఇక్కడవున్న భారతీయులేగాదు, ఇంగ్లీషువారుగూడ ఎంతగానో చెప్పుకుంటారు. ముఖ్యంగా ఆయన మన భారతీయ చిత్రకారుడు సూజాకు ఎంతో, ఎంతో సహాయపడ్డారు. సూజా అప్పుడు ఎవరికీ తెలియదు అంతగా. సూజా ఈనాడు యింతగా పేరు తెచ్చుకున్నాడంటే శ్రీ కృష్ణమీనన్ దానికి ఎంతో కారణం ఆరంభంలో. అలాంటి వారు ఎవరైనా మరల లండన్‌కు హైకమీషనరుగ వస్తారని ఆశిస్తాను.



# పూ జా వ న ము

## [దివ్యమానుష దృశ్యము]

### శ్రీ నోరి నరసింహ శా

[గతసంచిక తరువాయి]

[తెరలో] ధ్వనులు

ఓ పుణ్యపురుషుడా, ఈ జన్మ మేము భరించ లేము, భరించలేము, తండ్రీ!—అమ్మా, పుణ్యాత్మురాలా, నీవన్నా మమ్ములను ఉద్ధరించు తల్లీ!

భర్త : ఎవరబ్బా, ఇంత ఉత్కంఠతో బ్రతిమాలు తున్నారు!

[తెరలో] ధ్వనులు

మేము రాలిపోయినా పరమేశ్వరి పాదాలు బహుకాలము సురభిళము చేస్తూ అలంకరించ గలము. మమ్ములను ఉద్ధరించి మా జన్మలు ధన్యము లయ్యేట్లు చేయండి, తండ్రీ!—మేము వాడిపోయినా పుణ్యవాసన వదలబోము, తల్లీ!—నీవైనా మమ్ములను కనికరించు కాస్త.

భార్య: ఎంత పరాకుగా ఉన్నాము! ఈ పగడమాను చల్లదనానికి ముగ్ధులమై, దీనిపైనుంచి రాలుతున్న పగడపూల మాటలు గుర్తించలేక పోయినాము.

పగడపూల పాట [తెరలో]

ఈ పుణ్యాత్ముల శ్రీపాదములను
తాకినంతనే ధన్యులమైతిమి
శ్రీదేవీ శ్రీ పాదస్పర్శను
ఎంతటి ధన్యత ఎసగి రమింతుమొ!

భర్త: అమ్మలారా, మీ కీ సువాసన రావడానికి ఎంత సుకృతము చేసుకొంటిరో గదా!

(తెరలో) పగడపూలు

ఈ జన్మ ఎత్తినంతమాత్రాన ప్రయోజనము లేదు, నాయనా!

భార్య: ఏమమ్మా, ఎందువల్ల?

(తెరలో) పగడపూలు

ఓపికచేసుకొని మా కథ సావధానంగా వినండి!—నిత్యమూ విష్ణుపూజ చేస్తారు కదా అని, ఒకసారి వైష్ణవుల ఇంట్లో ఒక పెద్ద పగడి మానులో జన్మించాము. తెల్లవారకముందే, ఒక బాల వితంతువు మమ్ములను ఏరి దండగుచ్చి, రహస్యముగా తన ప్రియునికి పంపింది. మమ్ములను వ్యథపెట్టింది, తామూ వ్యథ పడ్డది. పాప మామె ప్రియుడు కూడా బహు కాలము ఆ వకుళమాలిక వాసనతో వ్యథ పడ్డాడు. మా జన్మ వృథా ఐనది.

భర్త: అయ్యో, అయ్యో! మిమ్ములను మీ పూర్వ జన్మలో నేను చూచినట్లున్నానే. అతడు మిమ్మును ఒక దంతపు బరణిలో పెట్టి, రోజు రోజూ తన విషాద ప్రేమగాథ వెళ్ళబోసు కొనేవాడు కాదూ!

(తెరలో) పగడపూలు

మరచిపోతున్న ఆ విషాదవాసన మళ్లీ మా కెందుకు జ్ఞాపకంచేస్తావు, బాబూ!

భార్య: పాప మా నిర్భాగ్యుల కథ తడవడ మెందుకు కాని-తర్వాత మళ్లీ మీ రెక్కడ జన్మించారు?

(తెరలో) పగడపూలు

వైష్ణవుల ఇంట్లో మాకు జన్మ సాఫల్యము లభించలేదని, ఆ తర్వాత శివపూజా ధురంధరుల ఇంట్లో పెద్ద తోటలో పుట్టినాము.

భార్య: ఆహా, ధన్యాత్ములు మీరు!

(తెరలో) పగడపూలు

అయ్యో, మా కథ తీరా విను, శివపూజకు ఉద్ధరిస్తారుగదా అని, తెల్లవారేసరికి వారి తోటలో రాలి కుప్పలు కుప్పలుగా పడ్డాము. ఆ యజమాని శివార్చనకు పూలకోసము తోటలోకి వచ్చి, నేలమీదపడ్డ పూలు తన శివార్చనకు పనికిరావంటూ, మమ్మును తాకనైనా తాకలేదు. మే మెంత గొడవచేసినా ఆయన వినిపించుకోలేదు. పొద్దెక్కిన తర్వాత సేవకులూ ఆటవికులూ ఇంకా రకరకాల మనుష్యులూ మమ్మ నిర్లక్ష్యంగా దుమ్ముతోకలిపి పోగులు చేసి ఏరి, సూదులతో మా కడుపులలో పొడిచి, దారాలకు వేలాడగట్టి పణ్యవీధికి పంపినారు—మళ్లీ మళ్లీ బహు పర్యాయాలు ఇదే జరిగినది—మధ్య మధ్య మమ్మును శివాలంకరణానికి కూడా ఉపయోగించారు—ఎంత మొత్తుకున్నా మా మొర ఆ క్షుద్రుడు వినిపించుకోలేదు.

భర్త: పాపము, మీ తొందరే మీకు చిక్కు తెచ్చినది

(తెరలో) పగడపూలు

ఇప్పుడు నీకాళ్ల పడ్డాముకదా, మమ్ములను కృతార్థులను చేయి, నాయనా!

భర్త: అయ్యో, ఎట్లా? తొందరపడి ఇట్లా నా పాదాలమీదపడ్డ మిమ్ములను పరమేశ్వరి పూజకు ఎట్లా వినియోగించేది చెప్పండి, మీరే!

(తెరలో) పగడపూలు

అయ్యో, అయ్యో!

భార్య: అట్లా నిర్దాక్షిణ్యంగా మాట్లాడుతారేమి?

భర్త: అయ్యో, మరి నేనేమి చేయగలను, నీవే చెప్పు, పోనీ!

(తెరలో) పగడపూలు

ఆహా! అయ్యో, బిడ్డలుకన్న తల్లిని నీవైనా కాస్త చెప్పు, తల్లీ!—మేము శివశాపము పొందిన ఆ మొగలిపువ్వు మాత్రమైనా చేయము, పోనీ!

భర్త: క్షమించండి, స్ఫురించలేదు, క్షమించండి! మీ కెంత అపరాధము చేసేవాణ్ణి!

భార్య: (చిరునవ్వుతో) స్వామీ, మీ పాదాలమీద పడ్డ ఆ పూలు నా కేశపాశములో మీ తిరుహస్తాలతో అలంకరిస్తే తృప్తిపడతవేమో కనుక్కోండి!

(తెరలో) పగడపూలు

ధన్యులము, నేటికి ధన్యులము!

భర్త: ఈనాటి కింతే. ఈమాట—రేపే, మిమ్ములను పాదాలతో తాకకుండా జాగ్రత్తగా ఉద్ధరించి శ్రద్ధగా పరమేశ్వరి పూజకు వినియోగిస్తాను!

[భర్త పగడపూలు తీసి భార్య కేశపాశములో మొగలిచెండు చుట్టూ అలంకరిస్తాడు.]

భర్త: (తలయెత్తి నలుదిక్కులా ఆఘ్రాణిస్తూ) ఏమిది, ఏమిది! ఏదో పురాణవాసన నా నాసాపుటాలలో ప్రవేశించి నా హృదయకుహరమేకాక శరీరమంతా ఆక్రమిస్తున్నదే!

భార్య: నిజమే. ఈ పగడచెట్టుపైనుంచే వీస్తున్నది. ఎవరో మిమ్ము వాత్సల్యంతో పిలుస్తున్నారు కూడాను, వినండి!

భర్త: మార్కండేయ పురాణర్షి పిలుపును ఆంధ్ర భాషలో అనుకరిస్తున్నట్లుగా ఉన్నది,

పైనుంచి పిలుపు (తెరలో)

ఒరే నాయనా! నా గొంతు గుర్తించావా, అబ్బాయీ!

భర్త: ఎవరో నా పితృదేవత పిలుస్తున్నట్లున్నది, నీకా గొంతు ఏమైనా గుర్తు తగులుతున్నదా?

భార్య: లేదు. కొంచెము అనునాసికంగా వస్తున్నదా కంఠస్వరము. మాట చెన్నపట్టణపు యాసతో ఉన్నట్లు స్ఫురిస్తున్నది.

[పైనుండి స్వరము]

మార్కండేయ పురాణమే కాదు. స్కాందమూ మహాభారతమూ రామాయణమూ నా వాసనలో ఇమిడి వున్నవి. ఇంకా అనేక శాస్త్రవాసనలు కూడా...... గుర్తు తగిలినదా, నాయనా?

భర్త: [ఆలోచించి] నా బాల్యములో రెండుమూడు సారులే దర్శించిన మా పిన్నతండ్రి గొంతువలె తోస్తున్నది. నిజమే పురాణవాసనే కాదు, బహుశాస్త్రవాసన కూడా గుబాళిస్తున్నది. సాహిత్యశాస్త్రమూ, జ్యోతిషమూ, వేదాంతమూ, ధర్మశాస్త్రమూ—చివరకు పాతంజల భాష్యవాసన కూడా నీలో పరిమళిస్తున్నది. 'ప్రతిజ్ఞానునాసిక్యాః పాణినీయాః' అని పెద్ద లందురుగదా! సందేహములేదు. గుర్తించాను. నా అంజలిలో వేంచేసి నన్ను అనుగ్రహించు, పిన్నబాబూ!

[పైనుండి పగడపువ్వు భర్త దోసిలిలో రాలుతూ దాని ధ్వని]

నన్ను సరిగా గుర్తించావురా. నీకు సౌఖ్యము కలుగుతుందిలేరా, నాయనా!

భర్త: [అప్పుడే దోసిటిలో రాలిన పగడపువ్వును చూపుతూ] ఇదుగో, మా పినతండ్రిని గుర్తించుకో!

భార్య: [భక్తితో ఆ పువ్వు గ్రహించి కళ్ల కద్దుకొని బుట్టలో గుర్తుగా ఉంచుతూ] ధన్యురాలను!—చూడండి! ఆహా! ఒక క్రొత్త దివ్యగంధము మన శిరస్సులమీద పెద్ద పెట్టున దూకుతున్నది. ఆహా!

భర్త: ఆహాహా! ఆకాశగంగ మనలను పరిశుద్ధులను చేయడానికి మన శిరస్సులమీదికి అవతరణము చేస్తూ ఉన్నట్లున్నది. [కన్నులరమోడ్చి] ఎంత చల్లగా ఉన్నది!

భార్య: [కన్నులరమోడ్చి] నిజమే. వీరి పాదవిన్యాసము ఎంత మృదువుగా ఉన్నది! వీ రెవరో మహాదాతలు! అడిగినవారి కోరికలు తీర్చేవారు. దధీచి, శిబి, కర్ణుడూ—ఆ కోవలోనివారు.

భర్త: ఆహా, వీరి పాదాలు లేతఎరుపుతో ఎంత కోమలంగా ఉన్నవి!

భార్య: అవిగో, వీరి రూపాలు దయారసంవలె స్వచ్ఛంగా ఉన్నవి.

భర్త: నిజంగా వీరు తమ సర్వస్వమూ ఆర్తులకు దానము చేసినవారే, ఇప్పుడుకూడా ఎంత నిర్లక్ష్యంగా విరివిగా కుప్పలుకుప్పలుగా రాలి భూదేవిని అలంకరిస్తున్నారు! వీరి దానానికి అవధిలేదు, విశ్వదాతలు. ఎవరో వీరు?

భార్య: వీరి దివ్యగంధమే వీరి పేరు చాటుతున్నది—పారిజాతాలట!

భర్త: చూశావా, చూశావా! స్వర్గము ఎక్కడో ఉంటుందనీ, అందులో ఎక్కడో కల్పవృక్షాలు ఉంటాయనీ అనుకుంటాము. అది సరికాదు. స్వర్గము విశ్వమంతటా వ్యాపించి ఉన్నది.

భార్య: అయితే కల్పవృక్షాలలో పారిజాతమనేది మన తోటలో ఉన్న ఈ పారిజాతమే అంటారా?

భర్త: నే ననేదేమిటి? సందేహము కూడానా? మనకు సరియైన దృష్టే ఉండవలె. ఇది సాక్షాత్తుగా స్వర్గంలోని పారిజాతతరువే.

భార్య: అందుకు దాఖలా ఏమిటి?

భర్త: వేరే దాఖలా కావలెనా? గాలి ఇంత కదలినా, ఇట్లా విచ్చలవిడిగా రాలిపడుతున్న ఈ పూల గుణమే, వీటి దానశీలతను చాటుతున్నది. ఇది కల్పతరువు లైదింటిలోని పారిజాతమే.

భార్య: ఓహో! అయితే సరేకాని, మరి నేలమీద పడ్డ ఈ పూలు పూజకు పనికివస్తవా?

భర్త: అయ్యో, ఏమిటి నీ కీ అజ్ఞానము! త్యాగ గుణమున్న మహనీయులు ఎక్కడ ఉన్నా

పూజార్హులే. వారికి నేల ఏమిటి, అంతరిక్ష మేమిటి? వారు ఎక్కడ పాదవిన్యాసముచేస్తే, అదే పుణ్యక్షేత్రము! కాశి, ప్రయాగ! అదే స్వర్గసీమ అవుతుంది.

భార్య: ఇవి త్వరగా రాలి వాడిపోయి నేవళమూ కాంతీ సువాసనా పోగొట్టుకుంటవి.

భర్త: తమ సర్వస్వమూ అర్థులకు ధారపోసే దాన శీలత అంటే మరేమిటి! – వీరిని భక్తితో గ్రహించవలె సుమా!

భార్య: సరే కానండి, జ్ఞాపకము వచ్చింది. వెనక సత్యభామకోసము శ్రీకృష్ణభగవానుడు స్వర్గ లోకమువిూదికి దండెత్తిపోయినది ఈ పారి జాతము తీసుకొని రావడానికే అంటారా?

భర్త: సందేహము కూడానా! నారదుడు ముందు రుక్మిణీదేవికి ఒక్కటంటే ఒక్కటే పువ్వు తెచ్చిఇచ్చి, సత్యభామను ఊరించినది ఈ అపూర్వపుష్పమే. అంతవాళ్లు అంతగా కావలె నని మోజుపడ్డది ఈ పారిజాత పుష్పము కోసమే. వాళ్ల పుణ్యమా అంటూ, ఇది మన కిక్కడ అవతరించినది. ఈ పారిజాతాల విలువ ఇప్పటికైనా తెలిసినదా?

[ఇద్దరూ పారిజాతాలు కన్నుల కద్దు కొంటూ బుట్టలలో వేస్తూ ఉంటారు:]

భార్య: ఏదో పాట వినిపిస్తున్నది, ఆలకించండి!

భర్త: నిజమే, పారిజాతము పాట కాబోలు!

పారిజాతము పాట [తెరలో]

భజగోవిందం భజగోవిందం
గోవిందం భజ మూఢమతే,
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహినహి రక్షతి డుకృఞ్ కరణే.

భార్య: ఎన్నడో గొంతు విన్నదిగా ఉన్నది!

భర్త: ఒక్కసారి కాదు. నా చిన్నప్పటినుంచీ చాలా సార్లు విన్నట్లున్నది.

భార్య: అయ్యో, అయ్యో! అవసానకాలములో విూ అమ్మ పాడిన గోవిందగీతమండీ!—ఆ గొంతే!

భర్త: అమ్మా, అవసానవేళలో చేసిన గోవిందభజనమే ఇప్పుడూ చేస్తూఉన్నావా? – ఎక్కడున్నావు తల్లీ, ఎక్కడే?—ఎక్కడనమ్మా, ఎక్కడనే?

[తెరలో] పారిజాతపుష్పాల బృందగానము

పునరపి జననం పునరపి మరణం
పునరపి జననీ జఠరే శయనమ్,
ఇహ సంసారే బహుదుస్తారే
కృపయాపారే పాహిమురారే!

భార్య: విూ అమ్మ కంఠము ప్రత్యేకము గుర్తిం చేందుకు వీలులేకుండా ఈ పారిజాతాలన్నీ గోవిందభజన ఎత్తుకొని ఉద్ఘోషిస్తూ ఆనంద తాండవము చేస్తున్నవి.

భర్త: అట్లా కాదు. ఈ ఒక్కజన్మలో మా అమ్మ కనుక నీకూ నాకూ ఒక గొంతు గుర్తుకు వచ్చినది. నన్ను అనేకజన్మలలో కనిపెంచిన మాతృదేవతాకంఠాలు సుమా, ఇవి! లీలగా కలలోవలె నాకిప్పుడు కాస్తకాస్త గుర్తు తగులుతున్నట్లున్నది

భార్య: ఆహా, మనముకూడా వీరిని అనుకరిద్దాము గ్రహిస్తూ.

[భార్యాభర్తలు పాట పాడుతూ పారి జాతాలు గ్రహిస్తారు.]

భర్త: నలినీ దలగత జల మతితరలం

భార్య: తద్వజ్జీవిత మతిశయ చపలమ్

భర్త: విద్ధివ్యాధ్యభిమానగ్రస్తం

భార్య: లోకం శోకహతం చ సమస్తమ్!

[తెరలో] పారిజాతాల బృందగానము

భజగోవిందం......నహినహి రక్షతి డుకృఞ్ కరణే.

భర్త: యోగరతో వా భోగరతో వా
సంగరతో వా సంగవిహీనః

భార్య: యస్య బ్రహ్మణి రమతే చిత్తం
నందతి నందతి నందత్యేవ.

[తెరలో] పారిజాతాల బృందగానము

భజగోవిందం......నహినహి రక్షతి డుకృఞ్ కరణే.

భర్త : [తల ఎత్తి] ఎవరది?

భార్య : ఏమి ఈ పరిమళము! దీనితో కడుపు నిండినట్లుగా తోస్తున్నదే.

భర్త : ఇది రేకుసంపెంగ పరిమళము కాదా?

భార్య : సందేహ మెందుకు? పాపము, రేకుసంపెంగ అన్నందుకు ఈ ఫలసంపెంగకు కాస్త నామోషీ వేసినట్లున్నది.

భర్త : పైగా నామోషీ కూడానా? జాతిసంపెంగకు ఉన్న నేవళమూ రంగూ అందచందాలూ లేక పోయినా, ఎక్కడపెట్టినా దాగని గాఢపరిమళ భాగ్యము ఉండడమే, ఈ రేకుసంపెంగ విశిష్టత కదా!

భార్య : [చిన్నబుచ్చుకొని] మళ్లీ ఆ మాటేనా? ఒక్కరికే అన్నిగుణాలూ ఉంటవా మరి?

భర్త : నే నేమన్నాను? ఈ రేకుసంపెంగను......

భార్య : అదుగో మళ్లీ ఆ మాటే!

భర్త : మహా వెనకవేసుకొనివస్తున్నావు. నీకూ మధ్య మధ్య దాని గుణము వస్తుంటుంది గనుకనా?

భార్య : ఏమిటో అంత దుర్గుణము!

భర్త : యండ్రకాయ గిట్టలవలె ఉన్న దానిరేకులు గూడు నీకే తెలుసు ంది.

భార్య : పాపము, మీ మాటకు సిగ్గుపడి కాబోలు, కనపడకుండా ఆకులచాటున దాగుకొన్నది. పోనీ, ముం దాజాతిసంపెంగనే గ్రహించండి!

భర్త : నీ కెందుకో వృథాగా కోపము వచ్చినట్లున్నది. కాని జాతిసంపెంగకూ ఈ రేకుసంపెంగకూ పోలిక ఏమైనా ఉన్నదా?

భార్య : అదుగో, మళ్లీ ఆ మాటే—ఏమో దాని ఎక్కువ?

భర్త : నీవే చూడు. ఎరుపుఛాయ కలసిన దీని పసిమి మరి ఏ పుష్పాని కున్నది?

భార్య : ఏ పువ్వు రంగు ఆ పువ్వుదే. ప్రతిపువ్వూ ఒక కొత్తరంగుతో మెరుస్తుంటుంది.

భర్త : నీ వన్నదీ కొంత నిజమే అనుకో! ఐనా దీని రంగులో విశేషమున్నది. రంగులోనే కాదు. దీనినేవళము దీని ఆకారము దీని చిరుగంధమూ అపూర్వమై కాళిదాసు కవిత్వాన్ని జ్ఞాపకం చేస్తున్నవి.

భార్య : నాకు మీ కవిత్వాలు రావుగా మరి.

భర్త : నీవు పద్యాలు చెప్పలేకపోయినా ఏమిగాని, నా జీవితాన్నే కావ్యంగా చేసినావు. కాబట్టి నీకు కవిత్వము రాదంటే నే నొప్పను.

భార్య : ఓహో! మీ మాట ఒప్పించడానికి ఎంత బులిబుచ్చికాలైనా మాట్లాడగలరు.

భర్త : కాదు, కాదు. (దోసిటిలో జాతిసంపెంగలు భక్తితో గ్రహించి) చూడు, నిజంగా వీటిలో కాళిదాసు కవిత్వవాసనే నాకు పొడకట్టుతున్నది.

భార్య : ఎవరో సంస్కృతశ్లోకాలు ప్రాకృతగాథలు గీతాలూ పాడుతున్నారు. వినిపిస్తున్నదా?

భర్త : [సంపెంగల దోసిలి చెవివద్ద ఉంచుకుని] నిజమే సుమా! రఘువంశము, విక్రమోర్వశీయము, శాకుంతలమూ— వీటిలో ఘట్టాలు ఈ పూలు ప్రదర్శిస్తున్నవి. ఏమి చిత్రము!

భార్య : [చిరునవ్వుతో] మరి ఆ గొంతు ఎవరిదో గుర్తించారా?

భర్త : లేదు, లేదు. కాళిదాసు రచనలే కాదు. బాణభట్టు, భారవి, మాఘుడు, భవభూతి, మురారి, శ్రీహర్షుడు—ఇత్యాది సంస్కృత కవీశ్వరుల కావ్యవాసనలుకూడా ఆ కంఠములో వాసిస్తున్నవి.

భార్య : వినిపించుకోరేమి? సాక్షాత్తుగా మామగారి గొంతు—గుర్తించలా?

భర్త : మా మామగారికి సంస్కృతము ఎప్పుడు వచ్చింది?

భార్య : మీ మామగారు కాదు. మా మామగారు!

భర్త: [మళ్లీ దోసిలి చెవివద్ద శ్రద్ధగా పెట్టుకొని] ఆఁ! ఆఁ! మానాన్నే! కాళిదాసాది సంస్కృత మహాకవుల పరిమళము మనస్సుకు ఎక్కించి నది మానాన్నే! ఆయన ఈ రూపంలో నన్ను అనుగ్రహించవచ్చాడన్న మాట!

[దోసిటిలోని జాతిసంపెంగలు కళ్ల కద్దు కొని పారిజాతాల ప్రక్కను ఉంచుతాడు.]

భార్య: ఇప్పుడైనా ఆ సంపెంగను గ్రహిస్తారా?

భర్త: ఏమో, నీకంత అభిమానము రేకుసంపెంగ మీద!

భార్య: అదుగో, మళ్లీ ఆ మాటే!—అవును. దానిది నా స్వభావమే అంటిరిగా. కాదు. నాకే దాని స్వభావము వచ్చినది.

భర్త: ఏమో?

భార్య: ఎండ్రకాయ గిట్టలవలె దాని రేకులు ఉంటవి అంటిరిగా! ఆ గిట్టలలో విషమేమీ లేదు లెండి!

భర్త: విషమే కాదు, గట్టిదనముకూడా లేదు.

[తెరలో] సంపెంగ పొదలోనుండి ఫల సంపెంగ: ఏమే, నీవైనా నన్ను కోయరాదుటే?

భార్య: [ఉలికిపడి] విన్నారా, మానాన్న పిలుపు?

భర్త: పాపము, విన్నే పిలుస్తున్నాడు, ఐతే నీవే కోయి!

భార్య: [సంభ్రమముతో పోయి ఫలసంపెంగ కోసి కళ్ల కద్దుకొని భర్తచేతికి ఇస్తుంది.] దీని గిట్టలు కళ్లమీద పెట్టుకున్నా గుచ్చు కోవులెండి!

భర్త: అందులో నీ కసలే గుచ్చుకోవు. ఈ సువా సన మధుకరాలకు ఇష్టములేదట.

భార్య: ఎందువల్లనో?

భర్త: ఏమో నాకు తెలియదు. పూచిన సంపెంగ పొలుపు మధుకరాంగనలకు ఇష్టముకాదు, అది తలనొప్పి కలిగిస్తుందట—ఇది చాలా దట్ట మైన గంధము—భూలోకవాసనవంటిది.

భార్య: అంటే ఏమో?

భర్త: గంధవతీ పృథివీ—అన్నాడు శాస్త్రకారుడు!

భార్య: నాకు శాస్త్రాలు రావు కాని—ఐతే, తక్కిన పూలగంధాలు గంధాలు కావా?

భర్త: అవి వేరు.

భార్య: అంటే వాటిలోవలె మీ కవిత్వాల గంధం వీటిలో లేదనా?

భర్త: నీవే చూచి చెప్పు మరి. ఈ ఫలసంపెంగ దగ్గర పెట్టుకొని ఏ పండు మనస్సులో తలచు కొన్నా, ఆ పండు రుచి అనుభవానికి వస్తుం దంటారు.

భార్య: అయితే?

భర్త: నాకెందుకు ఇది పిల్లలు తినే పెప్పరమెంటు బిళ్లల వాసన వేస్తుంది. ఇది కడుపునింపే వాసనగాని హృదయంగమమైనదికాదు.

భార్య: ఇంతకూ మానాన్న కవిత్వాలూ మీ సంస్కృ తాలూ చదువుకోలేదనేగదా ఈ ఎద్దేవా!—ఎందుకండీ ఈ చదువులు?

భర్త. బహు బాగున్నది.

భార్య: బాగున్నదా, మరీ బాగున్నదా?—మా వంశంలో పెద్దలు సోమయాగాలు చేసినవాళ్లు!—మీకే తెలుస్తుంది ఈ ఫలసంపెంగ ఏమని జపము చేస్తున్నదో వింటే.

భర్త: [ఆశ్చర్యంతో] ఆఁ, ఆఁ! ఏమీ!

భార్య: వినండి, వినండి!

[తెరలో] ఫలసంపెంగ:

అహం వైశ్వానరో భూత్వా
ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపానసమాయుక్తః
పచా మ్యన్నం చతుర్విధమ్!

భర్త: అయ్యో, అల్పవిద్యాగంధముచేత నేను చేసి తిరస్కారానికి ఈ సంపెంగ నాకు బాగా శాస్తి చేస్తున్నది.

భార్య : నిత్యమూ పురుషోత్తమప్రాప్తియోగము పారాయణ చేసేవారికి ఉత్తమగతి కలగదా, మరి?

భర్త : నిజమే. అన్నగతప్రాణులను చులకనచేసిన నాకు ఈ అంతర్వైశ్వదేవమంత్రముతో ఈ ఫలసంపెంగ ఎంత సున్నితంగా నీతిపాఠము చెప్పింది! దీనికి క్షమాపణ చెప్పుకుంటాను. ఇవ్వాళ ఈ పూలు మన కెన్నెన్ని విషయాలు మనస్సుకు పట్టిస్తున్నవి!—(ఆలకించి) ఏమిటది?

భార్య : ముగ్గురి గొంతులు వినబడుతున్నవి. వేద మంత్రాలు పారాయణ చేస్తున్నారు. వినండి, ఈ ఫలసంపెంగ చెట్టులోనే!

(తెరలో) ఫలసంపెగలు :

అన్నం బ్రహ్మేతి వ్యజానాత్. అన్నాద్ధ్యేవఖల్విమాని భూతాని జాయంతే. అన్నేన జాతాని జీవంతి. అన్నం ప్రయం త్యభిసంవిశం తీతి. త ద్విజ్ఞాయ.

భర్త : అందులో ఒకటి నే నెరిగిన మా మాతామహుని కంఠము. ఆయన వేదము సాంగముగా అధ్యయనము చేసి అగ్న్యాధానముచేసిన హవిర్యాజి దీక్షితుడు! ఆయన తండ్రి తాతలు కూడా సాంగదావేధ్యయనము చేసినవారు. తక్కిన ఇద్దరూ వాళ్లేనేమో. భృగువల్లి పారాయణ చేస్తున్నారు. విను, విను!

(ఫలసంపెంగ వృక్షములోనుండి శ్రుతి)

అన్నం న నింద్యాత్, తద్వ్రతమ్! ప్రాణోవా అన్నమ్. శరీర మన్నాదమ్...... అన్నం నపరిచక్షీత, తద్వ్రతమ్! ఆపోవా అన్నమ్. జ్యోతి రన్నాదమ్...అన్నం బహు కుర్వీత, తద్వ్రతమ్! పృథివీ వా అన్నమ్. ఆకాశోఽన్నాదః...... అన్నవా నన్నాదో భవతి, మహాన్ భవతి ప్రజయా పశుభి ర్బ్రహ్మ వర్చసేన, మహాన్కీర్త్యా

(భర్తమౌనముగా నమస్కార పూర్వకంగా మూడు సంపెంగలూకోసి కళ్ళకద్దుకొని బుట్టలో ఉంచును.)

భార్య : ఎక్కడో శంఖనాదాలు వినవస్తున్నవి?

భర్త ఇవి శంఖుపూలు. ఈ శంఖనాదాల అర్థమేమిటో?

భార్య : ఎవరో పుణ్యపురుషులు వేంచేస్తున్నారని వారి రాకనివి ఉద్ఘోషిస్తున్నవి.

భర్త : (శంఖుపూలు గ్రహిస్తూ) వారెవరో ఎక్కడో చూడు!

భార్య : ఎవరో వీరే పురుషోత్తములు మన ఎదుట సాక్షాత్కరించినారు.

భర్త : వాళ్లు ఏ మంటున్నారో విను!

భార్య : ఆహా, వినండి వినండి.

(తెరలో) పూలు :

యో మా మేవ మసమ్మూఢో
జానాతి పురుషోత్తమమ్
స సర్వవి ద్భజతి మాం
సర్వ భావేన భారత!

భర్త : పురుషోత్తమ ధ్యానముచేత పురుషోత్తమ ప్రాప్తి యోగించిన పున్నాగులు వీరు. వీరిని భక్తి శ్రద్ధలతో గ్రహించవలె సుమా!
(ఉభయులూ పున్నాగపూలు బుట్టలలోనికి ఎత్తుతారు)

భార్య : ఎక్కడో ఆనంద నాట్యము చేస్తున్నట్లుగా ఉన్నది!

భర్త ఈ మందవాయువుకూడా ఆనందముతో చిరుగంతులువేస్తూ చిత్రంగా సోకి ఆవరిస్తున్నది.

భార్య నాట్యంతో ఏదో గీతంకూడా వినిపిస్తున్నదే వినండి!

(తెరలో) అశోకముల పాట :

తకతై తకతై తకతై!
విషయ సౌఖ్యముల విడనాడితి మిక
సుషిర సుశోభన శుద్ధశాంతిమై
తకతై తకతై తకతై!

లేదు శీత మిక లే దుష్కం బిక
లేదిక దుఃఖము సౌఖ్యంబున్
తకతై తకతై తకతై!
అన్ని ద్వంద్వముల అంతము గంటిమి
ధన్యత గంటిమి తకతై తకతై
తకతై తకతై తకతై!

భర్త: శోకమునుండి తరించిన యోగీశ్వరుల అశోక గీతము!

భార్య: అంటే మనము వీరిని గ్రహించినా గ్రహించక పోయినా వారికొక లెక్కలోనిది కాదన్నమాట!

భర్త: అంతే. లోకసంగ్రహార్థము అవతరించే ఆధికారిక పురుషులు. వారిని గనక గ్రహిస్తే వారి కృతార్థతావాసన మనకూ ఏ కాస్త పిసరో అంటి, వారు చేరుకొన్న స్థానానికి మనకూ కాస్త దారి దొరుకుతుంది.

భార్య: ఆహా, మనము కూడా ఎన్నటికో కదా, ఈ అశోకానంద నాట్యముచేసే భాగ్యము పొందగలిగేది!

[ఇద్దరూ అశోకములు గ్రహిస్తారు.]

భర్త: ఈ రంగురంగుల పూలు ఎంత నేత్రపర్వంగా ఉన్నవి:

భార్య: అవును. వీటికి సువాసనా లేదు, కేసరాలూ లేవు. అద్భుతమైన ఈ రంగు ఎట్లా అబ్బినదో?

భర్త: జాగ్రత్తగా ఆలోచించు, ఏమన్నా అంటున్నవేమో విను!

భార్య: ప్చ్! [మళ్లీ ఆలకించి] ప్చ్! వాసనలేని పూలు నోరులేని మనుష్యులవంటివి-మూగవి.

భర్త: గుణవంతులు కానివారికి ఈ దివ్యవర్ణము రాదు. సువాసన లేనిది పూజార్హతలేదు. ఆలోచిద్దాము, వీరు పూర్వజన్మలో ఎట్టివారై యుంటారో!

[ఇద్దరూ తులసికోట అరుగుమీద విశ్రమిస్తారు.]

భార్య: ఏమోనండీ! ఏమయినాకానీ, నా కీపూలు కోయ బుద్ధిపుడుతున్నది. అవి మాత్రము కోయ మని మూగసంజ్ఞలైనా చేయడములేదు.

: నన్నూ వాటిరంగు ర్షిస్తున్నది. ఈ మూగపూలలో నాకొక ఆత్మీయత గోచరిస్తున్నది.

భార్య: పూర్వము మీరుకూడా దైవమంటే విశ్వాసము లేకుండా ఉండేవారు, జ్ఞాపకమున్నదా?

భర్త: భక్తులమని చెప్పుకొనేవాళ్లు అబద్ధాలాడుతూ పనికిమాలిన పనులు చేయడము చూస్తూ ఉంటే, వాళ్లమీద అసహ్యముకొద్దీ, దేవుడంటే మోసానికి ముసుగనిపించేది.

భార్య: మరి ఇప్పుడో?

భర్త: సందేహము లేకుండా ఇప్పటి మన భక్తికూడా ఇతరులను కాకున్నా, మనలను మనము మోసగించుకునే ముసుగేనేమో అనిపిస్తున్నది.

భార్య: పరమేశ్వరిని మహామాయ అంటారు కదాండీ!

భర్త: ఇందుకే కావచ్చు!

భార్య: ఈ వాసనలేని మూగపూలు తమ మౌనముద్రతో మన కెటువంటి నీతిపాఠం చెప్పినవి! ఇందాకటినుంచీ మన మేదో మహాభక్తుల మైనట్లూ, శ్రీదేవికి గొప్పగా అర్చన చేసే మహనీయుల మైనట్లూ, పుణ్యాత్ములంతా మనము గ్రహించి పూజలో వినియోగిస్తే తరిస్తామని ఎక్కడెక్కడినుంచో వెతుక్కుంటూవచ్చి మన తోటలో పూలుగా జన్మలెత్తి మమ్మంటే మమ్మ కోయమని ప్రాధేయపడుతున్నట్లూ — ఇంకా ఏవోఏవో ధ్వనులు వినిపించిన వనుకొన్నామే, - అదంతా నిజమేనంటారా? కాక మనము మహాభక్తులమనే గర్వమున్నవాళ్లమని మనకు తెలివిడిచేసి గర్వభంగము చేసేందుకు ఆ మహామాయ కల్పించిన భ్రమ అంటారా?

భర్త: నేనుకూడా ఈ కాగితపు పూలవంటి వాణ్ణే. భక్తి అక్కరలేదు అనుకొంటేనేమి, లేనిభక్తి అభినయిస్తే నేమి? పైగా రెండవది ఆత్మవంచనా పరప్రతారణమూను. మనబోంట్లము పూజలు చేయడానికి తగము. మనకిక పూజలు వద్దు!

భార్య : నాస్తికులైన ఈ పూలను చూచేప్పటికి మీకు కూడా వెనకటి నాస్తికవాసన దేకెత్తుతున్నదా ఏమి? వీటిని కాగితపుపూలు అంటారేమి, అనామకమైన వన్నట్లు! —ఇవి బోగన్ విల్లాలు!

భర్త : పే రేమయితేనేమి! ఇవి వాసనలేని నోరులేని మూగ కాగితపుపూలే. మనవంటివే సుమా!

భార్య: నన్నుమాత్రము వాటిలో కలపకండి!

భర్త : ఓహో! సరే ఎందుకుకాని, విన్నొకమాట అడుగుతాను. దాచకుండా జవాబుచెప్పు, నిజము.

భార్య: ఏమిటో?

భర్త : నీవు రోజూ జపాలు చేస్తావు. పూజలుచేస్తావు. ఆ కాసేపైనా నీ మనస్సు చలించకుండా పర దేవతమీద నిలిచి ఉంటుందా? నీ సంగతీ, నా సంగతీ, మన సంసారము సంగతీ, ఇంకా ఎన్నెన్నో లౌకిక విషయాల సంగతీ, రాకుండా ఉంటుందా?—అబద్ధమాడక నిజం చెప్పు!

భార్య : ఎందుకుంటుంది?

భర్త : అట్లా దారికి రా! అయితే మనశ్శుద్ధిలేని ఈ దొంగపూజలూ కొంగజపాలూ దేనికి?

(తెరలో) తోటలో కలకల నవ్వులు

హహ్హాహ్హా! అహ్హాహ్హా! హహ్హాహ్హా!

భార్య : వింటున్నారా?

భర్త : ఏమిటి?

భార్య : ఆ నవ్వులూ, ఆ కేకిసలూ.

భర్త : ఎవరది?

తోటలో గొంతులు (తెరలో)

మే మెవరమో చెప్పుకోవలెనా? మా రూపూ మా రేఖా మా కమ్మని వాసనా ఉండగా, మే మెవరమో చెప్పుకోవలెనటయ్యా?—మేము మూగవాళ్లము కాము. చెవిటివాళ్లమూ కాము!

భర్త : తెలియలా, మీ అహంభావ మొకటేతప్ప

తోటలో గొంతులు

మాది అహంభావమా? మా రూపూ మా రేఖా మా రంగూ మా సువాసనా నీవు మాత్రము కాదన గలవా? ఉన్నది ఉన్నదనుకొంటే అహంభావ మనిపించు కోదు. లేని భక్తి ఉన్నట్లు భావించే నీబోటివాళ్లది అహంభావ మనిపించుకొంటుంది. పైగా సిగ్గైనా లేకుండా మాదిఅహంభావ మంటున్నావటయ్యా?

భార్య: వాళ్ల సరసులు కారుకాని వాళ్ల మాటలు వినిపించుకోబోకండి!

భర్త : ఎట్లా వినకుండా ఉండేది? వాళ్ల మాటలు సత్యవాక్కులవలె హృదయంలో శూలాలవలె సూటిగా గుచ్చుకుంటున్నవి—ఎవరు బాబూ మీరు?

తోటలో ధ్వనులు

మే మెవరమో తెలియడంలా? ఇందాకటినుంచీ ఏదో లోపలి చెవి ఉన్నదనీ, మహాభక్తులమనీ, పూజలుచేసేవాళ్లమనీ, ప్రగల్భా లాడుకుంటూ పొంగి పోతూఉంటిరే?—అసలు మీకు రెండు కళ్లు చర్మ చక్షుస్సులూ, రెండు ముక్కులూ ఐనా ఉన్నవా?

భర్త : [వినయముతో] కోపించకండి, బాబుల్లారా!

తోటలో ధ్వనులు

కోపించవద్దా? నీవు పరదేశీయ పాలనలో పుట్టావు, విదేశీ చదువులు చదివావు, విదేశీయ వాతా వరణంలో పెరిగావు. విదేశీయుల సద్గుణాలన్నీ ఏక ముఖంగా పుంజీభవించిన మమ్ములను చూచి విదేశీ యులమని ఈసడిస్తావా? అదుగో చూడు, మీ అమ్మాయి లిద్దరూ మాకోసము ఎట్లా పరుగెత్తు కొని వస్తున్నారో!

ఇరవయ్యో శతాబ్దం! ఇరవయ్యో శతాబ్దం!

[భార్యాభర్తలు ఒక్కసారిగా పకపక నవ్వుతారు.]

భర్త : ఓహెూహెూ! గులాబీగార్లా? వీళ్ల ముళ్ళ బుద్ధి పోనీయలేదు—అమ్మాయిల్లా, మీ ర గులాబీలను కోయబోకండమ్మా!

ఆవల పెద్దపిల్ల గొంతు

కోస్తే ఏమండీ, నాన్నగారూ?

భర్త : నేను చెబుతున్నాగా గులాబీలు కోయకండి!

ఆవల చిన్నపిల్ల గొంతు

ఏమండీ నాన్నగారూ, ఎంత చక్కగా ఉంటాయి గులాబీలు! అమ్మవారికిపెట్టినా, అమ్మతలలో పెట్టినా, మా జడలలో పెట్టుకున్నా, మీా కోటులో గుచ్చినా, ఫ్లవరువాజెసులోపెట్టినా, ఎక్కడపెట్టినా, ఎంత చక్కగా ఉంటవి? ఎంత కమ్మటి వాసన!

తోటలో గులాబీల ధ్వనులు

ఆ చిన్నపిల్ల మాటలు వినయినా బుద్ధి తెచ్చు కోండి పెద్దవాళ్ళు!

భర్త: గులాబీలు కోయరాదమ్మా, వాటికి పొగరు!

ఆవల చిన్నపిల్ల గొంతు

నాన్నగారు నవ్వుటాలకు అంటున్నారు. పూలకు పొగరేమిటి, మనుష్యుల కుంటుందికాని!

భర్త: (చిరాకుతో) వాదనచేయక అవతలికి పొండి ముందు!

ఆవల పెద్దపిల్ల గొంతు

చెల్లాయి, నాన్నగారు ఇవ్వాళ ఎందుకో కోపంగా ఉన్నారుకాని అవతలికి పోదాంపద!

భార్య: ఏమండీ, అంతకోపంగా ఉన్నారు. మనము చేసిన పూర్వజన్మల పుణ్యమంతా ఆ ఇద్దరి రూపంగా పండిందఽటూ ఉంటారే. వాళ్ల నట్లా గదమాయిస్తే ఎంత చిన్నబుచ్చుకు పోతున్నారో చూడండి పాపము!

భర్త: నాకు వంటబట్టి జీర్ణించిపోయిన ఈ విదేశ వాసన వాళ్ల కెట్లా ఐనా అంటకుండా చేయాలి!

[తెరలో] గులాబిపూల పాట

ఇరవయ్యో శతాబ్దం ఇరవయ్యో శతాబ్దం!
మనదేశ మేమిటి పరదేశ మేమిటి?
ప్రపంచమంతా ఒక దేశం!
స్వదేశీయు లేమిటి విదేశీయు లేమిటి?
మానవులంతా మనవాళ్లే!
ఇరవయ్యోశతాబ్దం-ఇది-ఇరవయ్యోశతాబ్దం!

భార్య: ఇదుగోనండీ, నామాట విని వాటి మాటలు వినిపించుకోక, ఈ వాసనలేని బోగన్‌విల్లాల సంగతి కాస్త చూడండి!

భర్త: వీటినా శ్రద్ధతో ఆదరంతో కోదాము. వాటిలో సుగుణాలు చాలా ఉన్నవి.

భార్య: ఏమిటి?

భర్త: ఏమి టంటావా, ఐతే విను వాటికి భక్తి లేదు. అందువల్ల వాటికి సువాసనలేదు. ఇంకో జన్మమీాదకాని కర్మఫలంమీాదకాని వాటికి విశ్వాసంలేదు. ఈ శరీరము రాలిపోతే అంతటి తోనే కథ అంతా ఆఖరనుకుంటున్నవవి. అందువల్ల వాటికి కేసరాలు లేవు. అయితే మాత్రమేమి? మనము బ్రతికిఉండే కొంచెము కాలమూ మంచిపనులే చేద్దాము, బాధపడే వాళ్ల బాధ చేతనయినంతవరకు తొలిగిద్దాము, కష్టంలోఉన్నవాళ్లకు చేతనయినంత సహాయం చేద్దాము-ఇట్లా అనుకొని వీరు ఎప్పుడూ మంచిమార్గంలో జీవితము నడిపినవాళ్లు. అందువల్లనే వీళ్ల కింత కాంతీ - తేజస్సూ— అబ్బినవి. సువాసనా కేసరాలూ కూడా ఉన్న ఈ పూల సాహచర్యంవల్ల వీటి కీ నాస్తికత పోయి, నీతితోపాటు భక్తీ ఆస్తికతా పట్టు వడి ముబ్బడిగా ప్రకాశింపగలవు!

భార్య: ఈ పూలు పూజకు పనికిరావంటారుగదా మరి?

భర్త: పూజకు కాకపోతే, పూజామందిరము అలంక రించడానికి వినియోగిదాము.

[ఇద్దరూ జాలితో కాగితపు పూలు కోస్తారు]

ఆవల తోటలోనుండి పిలుపులు

అమ్మా, మేము మీాకు కనిపించనేలేదా? అయ్యో, మేము కనిపించడములేదా?

భార్య: ఎవరది?

ఆవల గొంతులు

ఇక్కడమ్మా!—ఇక్కడ బాబూ!

భర్త: ఎవరో వంచిన గొంతులతో పిలుస్తున్నారు స్పష్టంగా తెలియడములేదు.

ఆవల గొంతులు

బాగా గుర్తించావు నాయనా, మా గొంతులే! కాదు, మాతలలే వంచుకుని ఉన్నాము, - సిగ్గుతో.

భర్త : ఎవరంక్షీ బాబూ ? మీ రెందుకు తలలు వంచుకోవలసి వచ్చింది ?

ఆవలగొంతులు

మమ్ములను దేవతలు తమ నందనోద్యానంలో నుంచి పొమ్మని వెళ్ళగొట్టివేశారు. తలలు వంచుకొని పుణ్య వాసనావేశము మిగిలి ఉన్నందున ఇక్కడపుట్టి గద్గద కంఠాలతో మిమ్ములనువచ్చి కోయమని అడుగలేక అడుగలేక అడుగుతున్నాము.

భార్య : చూచారా అంక్షీ. చూచారా? పాపము, తమపేరు చెప్పుకోడానికికూడా సిగ్గుపడుతున్నారు. మహా సంపద అనుభవించి దైవవశాత్తుగా చిదికి పోయిన ఐశ్వర్యం కలవారు వీరు !

భర్త : ఇతర భోగభాగ్యాలు జారిపోయినా, వినయ సంపదమాత్రము పుష్కలంగా నిలుపుకొన్న పుణ్యాత్ములు వీరు!

భార్య : [గుర్తించిన సంతోషముతో] ఆ దేవకాంచ నాల మీదినుంచి అంక్షీ ఆ పిలుపులు!

భర్త : అమరభాషలో పేర్లు ఎంత సార్థకమైనవి! దేవకాంచనాలా? దేవలోకంలో నుంచి దిగి వచ్చినవారా? మహాత్ములారా! దేవతలు మీమీద కోపముచేత మిమ్మిక్కడికి పంపి ఉండరు—పంపలేదు —వారికి మిమ్ములను అను గ్రహించవలెననే కోరికతో, మమ్ములనూ కృతార్థులను చేసినట్లూ అవుతుందని త్వర త్వరగా మిమ్ముల నిక్కడికి సాగనంపినారు. ఆకులచాటున మడగి తలలు వ్రేలాడ వేసు కుని ఉండడానికి మీరుచేసిన దోషమేమీ లేదు, నమ్మండి. శ్రీదేవి పాదాలమీద మీరు తలలెత్తుకొని ఉండేట్టుగా అలంకరిస్తాము!

ఆవల దేవకాంచనాలు

నిస్పృహతో దిగజారిపోతున్న మాకు ఎంత ఆశ పెడుతున్నావు నాయనా! మీ బోంట్లకు మా పుణ్య విశేషము ఏలేశ మున్నా, సంతోషంగా అర్పించు కోడానికి వెనుకాడము!

భార్యా భర్తలు : కృతార్థులము!

[ఇద్దరూ దేవకాంచనాలు భక్తితోకోస్తూ ఉంటారు]

భార్య : ఆహా ! ఈ దేవకాంచనాలలో పుణ్యము పుంజీ భవించినది. కాంచనవర్ణము మృదులమూర్తి మనోజ్ఞరూపమూ—వీటికితోడు ఎంత అడ కువ !

భర్త : యువతికి లజ్జవలె వీరి లజ్జకూడా శోభను ద్విగుణీకరింప జేస్తున్నది.

భార్య : వీరి సిగ్గు పరీక్షగా చూస్తున్నకొద్దీ దాని హేతువు లీలగా స్ఫురిస్తున్నది.

భర్త : నీ ఊహ ఏమని?

భార్య : ఊహకాదు, నిశ్చయము. మహాపుణ్యాత్ము లున్నారే, వారు తాముచేసిన పుణ్యములతో తనివితీరక, ఇంకా పుణ్యము చేయలేకపోతిమే అని సిగ్గుపడతారు. అట్లా సిగ్గుపడుతున్నారు వీరు!

ఆవల ధ్వనులు

హమ్—సః – సః – హమ్—హం— సః –

భర్త : ఎవరిదో దివ్యకంఠము వినవస్తున్నది.

భార్య : ఎవరో జపము చేస్తున్నట్లున్నారు.

భర్త : [నెమ్మదిగా] ఎక్కడ?

భార్య : [ఆనందము విరిసిన ముఖముతో] మందా రాలు వేసిన ఆ మడిలో నుంచి వస్తున్నది ఆ నాదము !

భర్త : ఆ నాదము చిత్రమైన పిలుపు.

భార్య : అంటే

భర్త : పరమహంస సన్యాసులు భిక్షార్థులై వాకిట నిల్చి 'ఓంహి' అంటారు. బ్రహ్మచారులవలె 'భవతి భిక్షాందేహి' అని అర్థింపరుగదా !

భార్య : ఆ పరమహంసలవంటివారా మందారమడిలోని పుణ్యాత్ములు ? ఈ మందార పూలవి ఎన్నెన్ని రంగులు, ఎన్నెన్ని రూపాలు !

భర్త : ఆ మందారమడి స్వర్గలోకంలోని రంగుల పెట్టెవలె ఉన్నది.

భార్య : అవును ఎర్రనివి పసుపుపచ్చనివి తెల్లనివి కాషాయరంగువి గులాబిరంగువి— రేకువి కోపువి ముదవి జములవి ముప్పిరివి పంచముఖివి—

భర్త : ఇవి నందనవనంలోని పుష్పాలు కనుకనే మందార పుష్పాలనే పేరు వీటికి వచ్చినది.

భార్య : శ్రీదేవి మందార కుసుమప్రియ గదా జపా పుష్పాలంటే ఏవో ?

భర్త : ఏమో కాని, వీటిలో ఆ ఎర్రటి వాటినే జపా కుసుమాలంటా రనుకొంటాను.

భార్య : అందుకే కాబోలు, అవి శ్రీవిద్యాజపం చేస్తున్నవి. జపాకుసుమభాసురాం జపవిధౌ స్మరేదంబికామ్!

భర్త : అంతేకాదు. జ్ఞాపకం తెచ్చుకో రహస్య నామాలు.

భార్య : ఏమిటి?

భర్త : పరమేశ్వరి స్వర్గాపవర్గదా శుద్ధా జపాపుష్ప నిభాకృతిః కాదా?

భార్య : నిజమే, ఈవిధంగా శ్రీవిద్య నిత్యమూ జపము చేసేవారు శ్రీదేవివంటి స్వరూపాలు ఉన్నవారు కాదూ?

భర్త : శ్రీదేవే వారి స్వరూపము కలదేమో!—వీరి కిప్పుడు జపభంగం కలగకుండా వీరిని మన పూల సజ్జలలో మౌనంగా గ్రహించవలె !

[ఇద్దరూ నిశ్శబ్దంగా మందార పుష్పాలు గ్రహిస్తారు.]

ఆవల గొంతులు

ఆగండి, ఆగండి!

భర్త : ఆ పిలుపు తీరులో ఏదో వింతఉన్నది. పోల్చుకో లేకుండా ఉన్నాను

ఆవల గొంతులు

ఆ—గం—డి! ఆ—గం—డి! ఆ—గం - డి!

భార్య : [ఆలకిస్తూ] ఏమీ లేదండీ ఆ చిత్రము! 'ఆ' నెమ్మదిగా పలికి, 'గం' ఊదిపలికి, మళ్లీ 'డి' తేల్చివేస్తూ 'ఆ-గం-డి' అంటున్నవి మళ్లీ మళ్లీ !

భర్త : [ఆలోచించి] నిజమే 'గం' మీద ఒత్తు తున్నవి—గణపతిని స్మరించకపోతే విఘ్నాలు వచే ట్లే—ఆగండి—ఆగండి—అంటున్నవా?

భార్య : [సంతోషంతో] ఆహా, గన్నేరుపూలండీ. ఎర్ర గన్నేరు, వాడగన్నేరు, సువర్ణగన్నేరు, తెల్ల గన్నేరు, పచ్చగన్నేరు, బిళ్లగన్నేరు — ఇన్ని రకాల గన్నేరులూ పిలుస్తున్నవి.

భర్త : బిళ్లగన్నేరు కూడానా? దానికి కేసరాలు లేవు, సువాసనలేదు, పైగా ఒకవిధమైన అపరిపక్వమైన పసరువాసనకూడాను. ఎర్రగన్నేరు, వాడ గన్నేరు, సువర్ణ గన్నేరుమాత్రం కోద్దాము.

భార్య : పాపం, పచ్చగన్నేరో?

భర్త : దానిని మనము ముట్టుకోవడ మెందుకులే.

భార్య : ఎందుచేతనేమండీ, ఆ ఔదాసీన్యం?

భర్త : దాని గింజలలో ప్రాణాంతకమైన విషమున్నది కాదూ !

భార్య : పూవులో లేదుగా.

భర్త : పువ్వులో లేనిది గింజలోకి ఎక్కడినుంచి వస్తుంది?

[ఇద్దరూ ఎర్రగన్నేరు సువర్ణగన్నేరు వాడగన్నేరు కోస్తూ బుట్టలలో వేస్తూఉంటారు.]

భార్య : [కోస్తూనే] పాప మాపచ్చగన్నేరులోనూ తెల్ల గన్నేరులోనూ — పూలల్లో విషం లేదండీ.

భర్త : [విసుగుతో] నీవు పదేపదే అదేపనిగా అడుగు తున్నావు గనుక చెప్తా విను. దానిపేరే హయ మారకము !

భార్య : [కన్నులు పెద విచేసి] మారకమా? - చంపేదా?

భర్త : కరవీరమన్నా కత్తివంటిదనే అర్థము. ఏదో ఇతరులమీద ద్వేషముండి పగలు సాధించడానికి ప్రయోగించేవి ఆ పూలు! మన కెందుకు లెద్దూ !

ఆవల పూలధ్వని [తెరలో]

ఏమి పండితుడవయ్యా! నీ బోటివాళ్లనే పండితంమన్య అంటారు.

[భార్యాభర్తలు తెల్లబోయి చూస్తారు]

భర్త : [తెప్పరిల్లి] నే నన్నమాటలో పొరబాటున్నదా?

పచ్చగన్నేరులు [తెరలో]

సగము.

తెల్ల గన్నేరులు [తెరలో]
ఇంకా సరిగ్గా మాట్లాడితే ముప్పొతిక.

...: ఎట్లాగో దయచేసి విశదంచేస్తారా?

పచ్చగన్నేరులు తెల్ల గన్నేరులు [తెరలో]
ఈట్లా దారికివచ్చి వినయంతో అడుగు చెబుతాము.

భర్త : మీకిదే నా నమస్కారః నా తప్పేమో సెలవీయండి !

పచ్చ తెల్ల గన్నేరులు [తెరలో]
మేము హయములనేకాదు. శత్రువుల నందరినీ మారణము చేసేమాట వాస్తవమే.

భార్యాభర్తలు

[ఇద్దరూ గజగజ వణుకుతూ చేతులుజోడించి]

బాబుల్లారా, మీకు వేయిదణ్ణాలు. మీకు పుణ్యముంటుంది. మా శత్రువులనుకూడా చంపకండి, మాకా పాపము అంటకట్టకండి !

పచ్చ తెల్ల గన్నేరులు [తెరలో]
హహహ!

భార్య : బాబుల్లారా, వద్దు బాబుల్లారా !

పచ్చ తెల్ల గన్నేరులు [తెరలో]
అమ్మాయీ, నీకెవరూ శత్రువులు లేరా?

భార్య : లేరు.

పచ్చ తెల్ల గన్నేరులు [తెరలో]
మరి నీకయ్యా?

భర్త : నాకూశత్రువు లెవరూ ఉన్నట్లు తోచదు.

ప తె. గన్నేరులు [తెరలో]
ఇదేనటోయి నీచదువు ! శత్రువు లెన్నిరకాలు?

భర్త : ఆఁ ఆఁ! – ఓహో! — బాహ్య శత్రువులూ అంతశ్శత్రువులూ.

ప. తె. గన్నేరులు [తెరలో]
వారిలో బలవత్తరు లెవరు?

భర్త : తెలిసింది. అంతశ్శత్రువులు ! మా అంత శ్శత్రువులను హరించి మమ్ములను కటాక్షిం చండి, ఇదే, మీకు మొక్కుతున్నాము!

[ఇద్దరూ పచ్చ తెల్లగన్నేరుల పూలకు నమస్కరిస్తూ వాటిని కోస్తారు]

భార్య : ఎక్కడనో మనోహరరాగము వినబడుతున్నది?

భర్త : నిజమేసుమా ! ఆ రాగంలో చిత్రము గమనించావా?

భార్య : ఏమిటో?

భర్త : రాగధ్వని వినిపించేది చెవులకుగదా మరి! ఆ రాగ ధ్వని కన్నులకు వినబడుతున్నట్లున్నది.

భార్య: మీ మాటలు భావకవిత్వమువలె ఉన్నవి. ఆ పూదానిమ్మపూల కాంతి మన కన్నులద్వారా మన ఆత్మలో ప్రవేశించి మనోహరమైన రాగము కలిగిస్తున్నది.

భర్త : దాడిమీ కుసుమ ప్రభ కలది శ్రీదేవి అని రహస్యనామ మంటున్నదికదా, ఇవ్వాళ మన కీ తోటలో శ్రీదేవియే ఆవహించి అడుగడు గునా నానారూపాలతో ప్రత్యక్ష మవుతున్నది. ఎటు చూచినా శ్రీదేవీ స్వరూపమే భాసి స్తున్నది.

[ఇద్దరూ భక్తితో పూదానిమ్మపూలు గ్రహిస్తారు]

[తెరలో]

అహం కాశిం గమిష్యామి
తత్రైవ నివసామ్యహమ్
ఇతి బ్రువాణ స్సతతం
కాశివాస ఫలం లభేత్

భార్య: ఆ తీగెమీదినుంచి కాశీరత్నముల పిలుపు వింటున్నారా? దానిమ్మ కుసుంభరాగంలో వాటిని మరచిపోతామేమో అని జ్ఞాపకం చేస్తున్నట్లున్నవి.

భర్త : నిజమే. కాని మనము కాశీరత్నాలనే మరుస్తామా?

[ఇద్దరూ కాశీరత్నములు కోస్తారు]

ఆవలనుండి ధ్వని [తెరలో]
అమ్మాయీ, అబ్బాయీ !

భార్య: ఎవరబ్బా అది, అంత వాత్సల్యంతో పిలుస్తున్నారు!

భర్త: ఆ చేమంతి మడిమీదినుంచి కాదూ?

భార్య: సందేహంలేదు. చమత్కారంగానే ఉన్నది. ఇప్పుడు మీ కీ పూలభాష కరతలామలకమైనట్లున్నదే!

భర్త: మొదట్లో నీవు కాస్త విప్పిచెప్పినావు. నేను అల్లుకొని పోతున్నాను. ఈ చేమంతులు కోద్దాము.

భార్య: ఈ ఎర్రటి దాడిమీ కుసుంభకాంతిలో ఈ బంగారుపూలు మనము చూడలేకపోతామేమో అనుకున్నవి కాబోలు!

[ఇద్దరూ చేమంతిపూలు కోస్తారు]

భర్త: పాప మాబంతిపూలు పూజకు పనికిరావని కోయమేమో అని కాబోలు, దిగులుతో నిట్టూర్పులు విడుస్తున్నవి. పాపము, వాటితో మందిరమూ మందిరద్వారమూ అలంకరిద్దాము, కోయి!

[ఇద్దరూ రకరకాల బంతిపూలు కోస్తారు]

భార్య: ఎక్కడో చిలకలు అరుస్తున్నవి. ఎక్కడ నబ్బా?

భర్త [తేరి పారజూచి]

మన వనంలో చిలక లెక్కడా వాలినట్లు లేదే!

భార్య: కాదు. వినండి ఆ చిలకల కలకలము '

తోటలో పాట

హారేరామ హారేరామ రామరామ హారేహారే!
రంగురంగుల రామచిలుకలు
పొంగ నానందంపు తరగలు
గింగురెత్తగ శ్రవణములు బహు
భంగులను పాడున్-బహు-భంగులనుపాడున్
హారేకృష్ణహారేకృష్ణ కృష్ణకృష్ణ హారేహారే!

భర్త: అదుగో, ఆ పాదులలోనుంచి ఆ రంగురంగుల పూలు కలిసంతరణోపనిషత్తులోని రామకృష్ణ గీతము పాడుతున్నవి. ఆనందపుపాట. ఈ చిలకముక్కుపూలవీ ఎన్నెన్ని రంగులు, ఎన్నెన్ని ఆకారాలు!—అన్నిటికీ శుకనాసములు తప్పవు.

భార్య: ఆ శుకమహర్షులవారి సంతానమేమో ఇవి?

భర్త: అందుకు సందేహమా?—శ్రీ వ్యాసభగవానులు భాగవతము ముందు ఉపదేశించినది శుకమహర్షులకే.— అక్కడినుంచి శ్రీహరిసంకీర్తనములు వినబడుతున్నవి. ఆహా!

చిలకముక్కుపూల పాట [తెరలో]

నారాయణ హరినామం బెప్పుడు
పారాయణతో పాడుదమా?
హరే రామ హరే రామ రామ రామ హరే హరే!
హరికీర్తనముల నాలాపించుచు
హరి మురహరి యని యాడుదమా?
శ్రీవిభు లీలల జిత్రించెదమా
గోవిందుని మది గోరుదమా?
శిరమున శ్రీవిభు జేర్చెదమా, మన
మురహరి పదముల మ్రొక్కుదమా?
కేశవు మాధవు కీర్తించెదమా,
ఈశానార్చితు నెన్నెదమా?
భగవల్లీలలు వర్ణించెదమా
భగవచ్చరితము పల్కెదమా?
నారాయణ ధృత నానారూపా
నారద వీణా నాదరతా,
వ్యాస భాగవత వర్ణితలీలా
వాసిత లోకవ్రాతా!
ఝణ ఝణా ఝణ ఝణ ఝణా ఝణ
ఝణ ఝణా ఝణ ఝణ ఝణ ఝుం!
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే!

(భార్య భర్తలిద్దరూ ఆ పాటతో కలిపి పాడుతూ చిలకముక్కుపూలు కోస్తుంటారు.)

[సశేషం]

# దశకుమార చరిత్రము

శ్రీ నిడుదవోలు వెంకటరావు

"కవితఁ జెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన యతఁడు మెచ్చఁ
బరగ దశకుమార చరితంబు జెప్పిన
ప్రోడ నన్ను వేఱ బొగడనేల"

అని కేతన తన దశకుమార చరిత్ర రచనను గూర్చి సగర్వంగా చెప్పుకున్నాడు. ఈ పద్యమాంధ్ర సాహితీ లోకానికి సుపరిచితమైనా, ఈ నడుమ ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన దశకుమార చరిత్ర 'సంవీక్ష' 51 పుటలలోనూ[1] ఎక్కడా ఉదాహరింపబడలేదు. ఈ పద్యమొక్కటే కాదు. దశకుమార చరిత్రమునుండి తెలియదగిన భాషా చారిత్రక సాహితీ విశేషాలెన్నో ఆ సంవీక్షలో వివరింపబడలేదు. కాబట్టి ఈ వ్యాసము మూలంగా వానిని తెలుపుచున్నాను.

## ముద్రితాముద్రిత ప్రతులు

కేయూరబాహు చరిత్రమునకువలె, దశకుమార చరిత్రమునకు ఒక్కటే తాళపత్ర ప్రతిగలదు. అది తంజావూరి పుస్తకశాలలో ఉన్నది. దాని వివరములివి.

'167. దశకుమార చరిత్రము (కేతన)
M 234 $18\frac{1}{2} \times 1\frac{1}{2}$ 162. 1—12. సమ.

ఇందు 162 సంఖ్య తాళపత్ర సంఖ్య తెలుపును. సమ. అనగా సమగ్రము. ఆంధ్రసాహిత్య పరిషత్తు (కాకినాడ) పుస్తక భాండాగారముననున్న దశకుమారచరిత్ర వ్రాతప్రతి పై దాని ప్రతికయేగాని వేఱుప్రతికాదు. పై తంజావూరి తాళపత్ర మాతృక తప్ప దీనికి వేఱుతాళపత్రప్రతి ఇంతవఱకు లభింపనే లేదు—

తంజావూరి తాళపత్రప్రతి నేను పరిశీలించినదే. ఇందు చాలా చోట్ల క్రిమిదష్టభాగములున్నవి. గ్రంథాంతమున ద్వాదశాశ్వాసముచివర నుండవలసిన పద్యములు గద్య పూర్తిగా లేవు.

ఈ ప్రతి ననుసరించియే, యిప్పటికి ఏభై ఆరేండ్ల క్రిందట అనగా క్రీ. శ. 1901 వ సంవత్సరమున కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ చింతామణీముద్రాక్షరశాలలో మొదటిసారిగా ముద్రించారు. వారు ముద్రించినప్పుడు మాతృకలోనున్న లుప్త భాగములను పూరించారు. చివరి ఆశ్వాసమున పద్యాలు పూర్తి చేశారు. వీరేశలింగంగారు ప్రాచీన గ్రంథ ముద్రణ విషయమున చాలా జాగరూకులు. వారు పూరించిన భాగాలను కుండలీకరణము చేశారు. దీనివలన కేతన రచించినది ఇతరులు పూరించినది— స్పష్టముగా లోకమునకు తెలిసినది.[2]

---

1. సంవీక్షా కర్తలు. శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి.

2. ఇట్లు లుప్తభాగాలని పూరించేటప్పుడు కుండలీకరణం చేయడం అత్యావశ్యకం. ఇట్టి కుండలీకరణ విధానం - అవలంబింపక పోబట్టే కీర్తిశేషులు మానవల్లి రామకృష్ణ కవిగారు మొదట నన్నెచోడని కుమార సంభవాన్ని ప్రకటించినపుడు, దానిని వారే వ్రాసి నన్నెచోడని పేరు పెట్టారన్న అపోహ సాహిత్య లోకంలో బయలుదేరింది. ఈ విషయాన్ని వారే గ్రంథస్థం చేశారు.

వీరేశలింగంపంతులు గారిట్లే—నాచనసోముని ఉత్తరహరివంశంలో ప్రథమాశ్వాసం చివరలేని భాగాన్ని పూర్తి చేశారు. ఈ పూరణలలో వారు తమ సాహిత్య గురువులైన పన్నాల సీతారామబ్రహ్మశాస్త్రిగారి సహాయమును పొందారని కీర్తిశేషులు కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి మూలకంగా తెలుసుకున్నాను.

1901 వ సంవత్సర ముద్రణననుసరించే, వావిళ్లవారు దశకుమార చరిత్రను 1925 లో శేషాద్రి రమణ కవుల 'తొలిపలుకు'తో ప్రకటించారు. వారు పూర్వ ముద్రణలోని కుండలీకరణములను విడిచి పెట్టకుండా అచ్చువేశారు. శేషాద్రి రమణ కవులే, తమ పీఠికా రచనా కాలానికి పూర్వమే, ఈ లుప్త భాగములు ఇతరులచే పూరింపబడినవని స్పష్టము చేశారు.

వాస్తవిక పరిస్థితి యిట్లుండగా ప్రస్తుత ముద్రణలో సంవీక్షాకర్త లేరీతిగా వ్రాశారో చూడండి.

'శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గారు విద్వాంసులు—పరిష్కారానుభవముగలవారు. ఈ గ్రంథాన్ని తాళపత్రప్రతితోనూ మాతృకతోనూ, ప్రథమ ముద్రణప్రతితోనూ సరిచూచి వ్రాతప్రతిలో లేని భాగాలన్నూ, ఖిలములైన భాగాలను—మూలాన్ని, అక్కడి రచనను దృష్టిలో పెట్టుకొని సాధ్యమైనంత వట్టు 'తద్రచనయ'కా పూరించినవారు శ్రీ శాస్త్రి గారే. వాటిని కుండలీకరణాలతో యివ్వడం జరిగింది.' (సంవీక్ష పుట 51)

పై వ్రాతనుబట్టి దశకుమార చరిత్రలోని లుప్తభాగములు పూరించినవారు శ్రీ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారనియు, కుండలీకరణ విధానము ప్రథమముగా నీ ముద్రణమునందే ఈయ బడినట్లును స్పష్టమగుచున్నది. కాని యిది యెంత అసంగతమో నేను పైని వ్రాసిన ముద్రితాముద్రిత ప్రతివివరణమువలన తెలియగలదు. ఇంతేకాదు. ప్రస్తుత పరిష్కర్తలు వీరేశలింగంగారి ప్రతిమాట యటుండ నిచ్చి క్రీ శ. 1925 లో ముద్రణనందిన వావిళ్ల వారి ప్రతికూడ పరిశీలించినట్లు కానరాదు. ఆ ప్రతి యందే పూరణములు కుండలీకరణములు వీరేశలింగం గారి 1901 వ సంవత్సరపు ప్రతిననుసరించియే ముద్రితములైనవని విశదముగా వ్రాయబడియుండగా ప్రస్తుత పరిష్కర్తలు, శ్రీ మద్దులపల్లివారే, లుప్త భాగములను పూరించిరనియు, కుండలీకరణ విధానము నూతనమనియు నెట్లు వ్రాసిరో దురూహ్యము.

ఇక మద్దులపల్లి వారెప్పుడు తాళపత్రప్రతిని సంప్రతించిరో, ఎప్పుడు పూరణలు గావించిరో మనకు తెలియదు. కాని ఈ క్రింది యంశమునుబట్టి వారు కందుకూరివారి పూరణములకే మార్పులు చేసిరని నిరూపింపవచ్చును.

1925 ముద్రణమున [సప్తమాశ్వాసాంత పద్యములలో నొక మాలినీ వృత్తమున్నది. దానిపాఠమిది.

'(పరమ కరుణ భావా! భారతామ్నాయసేవా
చరణ!) వితరణాంభోధారణాధః కృతాంభో
ధర! (నిరుపమభద్రీ) ధైర్యజాంబూనదాద్రీ
పరిగత (నయమాత్రా) భాసురామాత్యపుత్రా!
166 ప.

పై వృత్తమున పూరణ భాగములను పురస్కరించుకొని శేషాద్రి రమణ కవులు 'తొలిపలుకు'లో నిట్లు వ్రాసియున్నారు.

'భ్రష్ట భాగములు బూరించుటలో మాతృకా భావములు చాలవఱకు సమర్థింపబడినవి......మఱియు సప్తమాశ్వాసాంత పద్యములలో

'భారతామ్నాయసేవాచరణ'

అని వ్రాయఁబడినది. కేతన తిక్కనసోమ యాజి గ్రంథరచనము భారత రచనము చెప్పనేలేదు. అట్టిచో భారత ప్రశంస కవిమతమునకు విరుద్ధము.' (పుట 12)

పై పద్యము ప్రస్తుత ముద్రణము (పుట 181) లో నెట్లు మారినదో చూడుడు.

మాలిని—(నిరత భరిత భావా! నిర్మలామ్నాయసేవా
చరణ కరుణలాంభో ధారితా)ధః కృతాంభో
ధర (వర గుణ భద్రీస్థైర్య) జాంబూనదాద్రీ
పరిగత (బుధసత్తా భాస్కరామాత్య పౌత్రా)

ఇందు భారతామ్నాయ సేవాచరణ అనుపాఠము తొలగింపబడినది. యతిస్థానముగూడ మార్పుజెంది నది. దీనినిబట్టి మద్దులపల్లి వారే శేషాద్రి రమణ కవుల వ్రాతనుజూచి, దీనిని మార్చిరనుట స్పష్టము. ఇంతకు నీ పద్యమునకు తాళపత్రప్రతిలో మూడు పాదములు లేవు.

'ధర పరిగమ లీలోదాత్త జాంబూనదాద్రీ'

అనిమాత్రమే కలదు. కాబటి యే పూరణకర్త లిచ్చువచ్చి

నట్లు మార్చిరి. దీనినిబట్టి ప్రస్తుత పరిష్కర్తల వ్రాత కెంత ప్రామాణ్య మీయదగునో విద్వల్లోకమే విచారించుగాత.

## అచ్చులోలేని పద్యములు

పూర్వలాక్షణికులును సంకలన గ్రంథకర్తలును దశకుమార చరిత్ర లోనివిగా నుదాహరించిన పద్యము లీ ముద్రణమున గానరావు. 'సంవీక్ష'లో వీని ప్రస్తావనయే లేదు. వాని నీక్రింద వివరించుచున్నాను.

సులక్షణసారము³— లింగమకుంటతిమ్మన — (క్రీ. శ. 1550)

1. బువళి—దీని కుదాహరణము దశకుమార చరిత్రము.

'బుభులు సంతసిల్లఁ గ్రతుముఖ్యులరుదంద
దివిజ తతికి నెల్ల ధృతి గలంగఁ
దృణము మాడ్కి దానవేంద్రుని దునుమాడి
జయము నొందు వేగ జగదధీశ.

2. మావళి

ఇందుకు లక్ష్యం — దశకుమారచరిత్రము
'కమలాప్తాంశులు బలవి
క్రమవంతులు ఖడ్గధరులు రాజులు మీరల్
నుముఁ బ్రోవఁగఁదగదే సం
యమివర్యులఁ జూచి రాకుమారకు లెల్లన్

3. భిన్నయతి

ఇందులకు లక్ష్యం దశకుమార చరిత్ర.
'మించి మదించక రిపుఁహ
రించక సత్కీర్తి యీ మహీతల మెల్లన్
నించక దీనుల దయఁబో
షించక ప్రఖ్యాతి గలుగునే నరనాథా.

తిమ్మన సమకాలమువాడైన సుప్రసిద్ధ సంకలన గ్రంథకర్త పెదపాటి జగ్గన తనప్రబంధ రత్నాకరములో నీ క్రింది పద్య ముదాహరించి యున్నాడు.[4]

కేతన — మూలఘటిక — ఆంధ్రభాషా [భూషణము

'మెచ్చుఁడు మెచ్చవచ్చునెడ
మెచ్చకు డిచ్చకు మెచ్చురానిచో
మెచ్చియు మెచ్చు మింగకుఁడు
మెచ్చక మెచ్చితి మంచు గ్రచ్చలై
మెచ్చకుఁ డిచ్చ మెచ్చుగని
మెచ్చుఁడు మెచ్చొక మానమైనచో
మెచ్చియు మెచ్చు కుండకయ
మెచ్చుడు సత్కవులార మ్రొక్కెదన్ 95 వ.

పై పద్య మాంధ్రభాషా భూషణములోనిదని వ్రాయబడి యున్నను, నది ముద్రితమైన ఆంధ్ర భాషా భూషణమున గానరాదు. తాళపత్ర ప్రతుల లోను గానరాలేదని ప్రభాకరశాస్త్రిగారే యీ పుట యథోజ్ఞాపికలో వ్రాసియున్నారు. ఈ తరువాత నేను ఆంధ్రసాహిత్య పరిషత్తులోను, తంజావూరి పుస్తక శాలలోనుగల ఆంధ్రభాషాభూషణ ప్రతులను పరిశీలించాను. కాని వానియం దెక్కడా పైపద్యము కానరాలేదుర్. కాని యీ పద్యమే—'ప్రబంధమణి భూషణము' అను సంకలనగ్రంధమున నున్నది.6 అది గ్రంథాంతమున 867 సంఖ్యగా నందు ముద్రితమైనది. ఈ ముద్రిత గ్రంథమున పై పద్యపు టాకరము తెలుపబడియుండలేదు. అయినను దాని వ్రాతప్రతిలో[7] నీ పద్యము స్పష్టముగా దశకుమార చరిత్రములోనిదని కలదు. అట్లయిన ప్రస్తుత దశకుమార చరిత్రమున నిది—

అవతారికలో 9 వ పద్యమగు

'వాక్తా (మపర్ణి) కవితా
మౌక్తిక (మణితార) హార మండనులగు తత్

---

3. విద్వాన్ రావూరి దొరసామి శర్మగారి పరిష్కృతము, వావిళ్ల ముద్రణము.

4. ప్రబంధ రత్నావళి—ప్రభాకరశాస్త్రిగారిచే సంపాదితము. 1918. పుట 30.

5. ప్రథమాంధ్ర వ్యాకరణమగు ఆంధ్రభాషా భూషణమును కర్ణాటభాషాభూషణముతో జోడించి విపుల వ్యాఖ్యా పీఠికా సహితముగా నొక సుసంస్కృతి ముద్రణము వెలయించుటకు నేను దొరకిన వ్రాత ప్రతులన్నింటిని పరిశీలించితిని.

6. ప్రబంధమణిభూషణము— మానవల్లివారి సంపాదితము. 1910.

7. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో సంకలన గ్రంథము.

ప్రాక్తన సుకవుల నియమమా
త్యక్తుల వాల్మీకి కాళిదాసులఁ గొల్తున్'

అను పద్యము తరువాతను 'అని యిష్టదేవతా ప్రార్థనంబును సుకవి చరణాభి వందనంబునుం జేసి' అను వచనమునకు ముందును నుండవలెను[8]. తక్కిన పద్యముల సందర్భాదులనిట్లే పరిశీలింపవలెను.

## పాఠభేదములు

ఈ చిన్న వ్యాసమున నిందలి పాఠభేదము లన్నింటిని చర్చించుటకు వీలుపడమి రెండింటిని మాత్రమే చూపుచున్నాను

1—23 సీ. గీ.

మూలఘటికె కన్నవాయ సముద్రపూర్ణ
హిమమయూఖుని మారయ కమలకమల
వదన యగు సంకమాంబకు వరతనూజు
కేతనార్యుని నన్ను విఖ్యాత యశుని

ఇచట కేతన తండ్రి 'మారయ' అనుట సరి కాదు. అతని పేరు 'మానయ'—ఈ 'మానయ' అనుపేరు మార్పరాని ప్రాస స్థానమున నిబద్ధమై కేతన కృత్యంతరమగు విజ్ఞానేశ్వరమున నిట్లున్నది.

మానయకు సంకమాంబకు
సూనుఁడ మిత సత్య హితవచోవిభుఁడను వి
జ్ఞానారాధ్యయశస్కుఁడ
నానాశాస్త్రజ్ఞుఁడను వినయభూషణుఁడన్
5 ప.

దీనినిబట్టి 'మానయ'అనియే యుండవలెను.

1—90.

అగుననఁ గొమ్మయతిక్కఁడు
జగతి నపూర్వార్థశబ్దచారుకవితమై
నెగడిన 'బాణోచ్ఛిష్టం
జగత్త్రయం' బనిన పలుకు సఫలంబయ్యెన్.

ఇచట 'పలుకు సఫలంబయ్యెన్' అన్నపాఠమెంత మాత్రము సరికాదు. ఆ పాఠమున్నచో నది యపార్థము నిచ్చును.

"బాణోచ్ఛిష్టం జగత్త్రయమ్" అను వాక్యమున కర్థమిది. బాణుడు లోకోత్తరమైన రచన చేసెను. అతని తరువాతి కవులెవ్వరును అతనితో సమానులు కాలేకపోయిరి. ఒకవేళ కవులు రచనలు చేసినను, అందు బాణుడు చెప్పినదేతప్ప క్రొత్తవిషయ మేమియు నుండదు. అందుచే తక్కిన రచనలన్నియు బాణుని యెంగిలిపదార్థములైనవి. అనగా బాణునివంటి కవి యాతనివెనుక మఱి పుట్టలేదు— అని సారాంశము.

పై యర్థము ననుసరించి పై పాఠముచూచిన 'బాణోచ్ఛిష్టం జగత్త్రయమ్' అన్న పలుకు తిక్కన సఫలముచేసినట్లగుచున్నది. అనగా తిక్కన రచనయు, బాణుని యుచ్ఛిష్టమే అగుచున్నది. ఇది యెంతయు కేతన చెప్పినదానికి విరుద్ధము. కేతన చెప్పినదేమనగా —

తిక్కన అపూర్వమై మనోహరమై శబ్దార్థ కవితచేత, బాణోచ్ఛిష్టం జగత్త్రయం అన్నమాట— వ్యర్థము చేసినాడు అని. అప్పుడు పాఠము

'బాణోచ్ఛిష్టం జగత్త్రయం బనిన పలు కసఫలంబయ్యెన్'అని యుండవలెను. పలుకు + అసఫలం బయ్యెన్ – అని పదచ్ఛేదము. దీనినిబట్టి సంస్కృతమున తిక్కన— బాణుని కవిత గురించి లోకములో వ్యాప్తములోనున్న సూక్తిని విస్మృతము చేయజాలిన రచన చేయగల సామర్థ్యముగలవాడని వ్యక్తమగుచున్నది. కాని తిక్కన సంస్కృత రచనలు మనకు లభ్యముకాలేదు. మధురా విజయ కర్త్రియగు గంగాంబ తన సంస్కృత కావ్యమున 'తిక్కయజ్వకవేస్సూక్తిః' అని తిక్కనను పేర్కొన్నది. నిర్వచనోత్తర రామాయణాది యందుగల, 'శ్రీరాస్తాం మనుమక్షితీశ్వర భుజ స్తంభే' అనునదియు, భారతావతారిక యందుగల 'కిమస్తిమాలాం కిం కౌస్తుభంవా' అను శ్లోకములు రెండుమాత్రమే మనకు లభ్యమగుచున్నవి.

## విభక్త్యంత రచన: ఆశ్వాసవిభాగము

కేతన, నన్నెచోడ కవి ననుసరించి యాశ్వాసాద్యంతములు విభక్త్యంతములుగా రచించినను,

---

8. ఇట్లే అప్పకవి నాచనసోముని యుత్తర హరివంశములోనిదని యుదాహరించిన — 'నాతో మార్కొనలేరు' అన్న పద్యము నేటి ఉత్తర హరి వంశ ముద్రితప్రతిలో గానరాదు.

ఆశ్వాసవిభాగమున, తనకు ముందుగాని, తనకు తరువాతగాని కవులెవ్వరును త్రొక్కని యొక నూతన పథకము త్రొక్కియున్నాడు. సాధారణముగా కవు లవతారికలో షష్ఠ్యంతములు చెప్పి,ఆవెనుక—'అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన' అని కథ ప్రారంభించి కొంత నడచినవెనుక దానిని ప్రథమాశ్వాసముగా పరిగణింతురు. కాని కేతన యట్లు చేయ లేదు. ప్రథమాశ్వాసమున నిష్టదేవతా స్తుతితో ప్రారంభించి, కవి కావ్య సందర్భమును వివరించి, కృతిపతివంశ వర్ణనగావించి షష్ఠ్యంతములతో నిట్లు ముగించినాడు. ప్రథమాశ్వాస ప్రారంభము—'శ్రీరమణీ గృహాంగణము చెన్నువహింప నలంకరింపగా'

అంతము—మాలిని :

కనకగిరితటీసంకాశవక్షస్థలీ భా
గునకు భజనవృత్త క్షోణిదేవాదరోద్యత్
ఘనయశునకు మన్మక్ష్మాపతిప్రాజ్యరాజ్యాం
బునిధిశశికి వాణీస్ఫూర్తిమన్మూర్తి కుర్విన్

గద్యము.

ఇది సకలసుకవిజన ప్రసాద విభవ విలాస దళినవదండి నామధేయ విఖ్యాత కేతనార్య ప్రణీతంబైన దశకుమార చరిత్రంబను మహాకావ్యంబు నందు ప్రథమాశ్వాసము.

ఇట్లు ప్రథమాశ్వాసము ముగించి ద్వితీయాశ్వాసము నీరీతి ప్రారంభించినాడు—

'శ్రీశ్రితవక్షునకు ముదా
త్తశ్రౌత స్మార్త
విశ్రుత విశ్రాణునకు నృ
పాశ్రితచరణునకుఁ దిక్కనామాత్యునకున్

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా చెప్పంబూనిన కథానికాయంబను (సుర)లతాజాలం బెట్టిదనిన...'

కేతన ప్రథమాశ్వాసమును షష్ఠ్యంతములతో ముగించినను వాని యందొక విశేషము గనబఱచినాడు. ఆశ్వాసాంతమున వ్రాయవలసిన పద్యములకొక నియమ మున్నది. సాధారణముగ నందు 3 పద్యము లుండును.[9] అందొకటి వృత్తమును, ఒక కందమును, ఒక మాలినీ వృత్తమును నుండవలెను. ఆ సంప్రదాయము ననుసరించి కేతన—షష్ఠ్యంత పద్యము లెనిమిది వ్రాసిన తరువాత నీక్రింది మూడు పద్యములు రచించియున్నాడు.

"తేజోరాజితసర్వలోకునకు
భూదేవాన్వయాంభోజినీ
రాజీవాప్తున కాగమప్రథిత
కర్మప్రస్ఫురత్కీర్తికిన్
బూజాతర్పిత రాజశేఖరునకున్
పుష్పాస్త్రరూపోపమారాజన్మూర్తికి
దోష దర్ప దమనారంభైక సంరంభికిన్'
దేవేంద్ర విభవునకు భూ
దేవకులాగ్రణికి భారతీసుస్థితి సం
భావిత సదన సదనునకు
సేవాతర్పిత శశాంకశేఖరున కిలన్—
మాలిని; కనకగిరి తటీ...............

స్ఫూర్తిమన్మూర్తికుర్విన్.

దీనినిబట్టి కేతన వ్రాసిన షష్ఠ్యంతము లెనిమిదే యనియు మిగిలిన పై మూడు పద్యములును ఆశ్వాసాంత పద్య సంప్రదాయమునకు జెందినవనియూ గ్రహింపన గును.[10] అట్లయిన నీ మూడు పద్యములును షష్ఠ్యంతములుగానే నేల వ్రాసెనని సందేహముకలుగవచ్చును కాని యట్టిసందేహమున కవకాశం లేదు. ఆశ్వాసాంతములో విభక్త్యంతములు పాటించునపుడు రెండింటియందు నొకే విభక్తి యుండవలెను. ప్రస్తుతము ప్రథమాశ్వాసము షష్ఠ్యంతములతో నంతమొందినది కావున, కేతన, ఆశ్వాసాంతము షష్ఠ్యంతములతోనే వ్రాసి ద్వితీయాశ్వాసమున తొలిపద్య మా షష్ఠీ విభక్తియందే నిబంధించియున్నాడు.

షష్ఠ్యంతములతోనే ఆశ్వాసమంతము నొందించుట క్రొత్త పద్ధతియేయైనను కేతన ప్రణాళిక

---

9. దీని కపవాదములు గలవు. నన్నయభట్టు 2 పద్యములును, నన్నెచోడ డైదుపద్యములను వ్రాసియున్నారు.

10. 'నన్నెచోడుని కవిత్వము' అను గ్రంథమున, ఈ సంప్రదాయము విస్మృతమైనది. చూ. షష్ఠ్యంతములు అను శీర్షికలో.

ననుసరించి అది యావశ్యకమే యగుచున్నది. ఏల ననగా షష్ఠ్యంతములు వ్రాయునప్పటికే నూటఒక్క పద్యమైనది. ఇక దానితో కథా ప్రారంభమును చేర్చి కొంతవఱకైన వ్రాసిన—ఆ యాశ్వాసము పెద్దదై పాఠకులకు, కథాసరణియం దడ్డము గల్గించును. అది యునుగాక, కేతన ప్రథమాశ్వాసమంతయు కృతిపతి చరిత్రకే వినియోగించునట్లు స్పష్టము. దానితో కథా సందర్భమునుగూడ చేర్చిన-ఆ చరిత్రకు భంగము కలుగును. కృతిపతి విషయమున నొక ప్రత్యేక విశిష్టత యుండవలయునని భావము గలవాడగుటచేతనే కేతన, దీనిని కథాభాగమునుండి వేఱు పఱచి యొక ఆశ్వాసముగా విభాగించియున్నాడు. ఇది యెంతయు సముచితమై కృతిపతికి, కావ్యమునకు, కృతికర్తకు నుత్కర్ష నాపాదించినది.

నన్నెచోడని కుమారసంభవమున చివరి యాశ్వాసము, సంబోధనతోగాక ప్రథమావిభక్తితోనే యున్నది. కేతన ఆ పద్ధతిని వీడి చివరి ఆశ్వాసము సంబోధనతో ముగించినాడు. మంచనయు కేతన ననుసరించి యున్నాడు. తిక్కన నిర్వచనోత్తర రామాయణమున కావ్యాంతమున ప్రథమావిభక్తి పాటించియున్నాడు. దీనినిబట్టి ఈ విషయమై పరిశ్రమ చేయవలసిన యావశ్యకత యున్నదని తేలుచున్నది.

## పూర్వకవుల యనుసరణములు

కేతన తనకు పూర్వులగు నన్నయ నన్నెచోడుల గ్రంథములనుండి పదములను ప్రయోగములనేకాక పద్యములను అనుసరించి యున్నాడు—

దశకుమార చరిత్రమున తెలుగు కవి స్తుతి చేయక పోయినను తన ఆంధ్రభాషాభూషణమున కేతన నన్నయ నిట్లు పేర్కొన్నాడు.

'మున్ను తెనుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్ప రే జెప్పెదవి
ద్వన్నికరము మదిమెచ్చఁగ
నన్నయభట్టాది కవిజనంబుల కరుణన్ (5 ప.)

ఇంతేకాక ఈ క్రింది పద్యమున నన్నయ ప్రయోగములను రెండింటిని ప్రమాణీకరించి యున్నాడు—

వాఁడిమయూఖము లనఁగా
వేఁడిపయోధారలనఁగ వింజామరనా
మూఁడ్రస్తంబు లనంగాఁ
బోఁడిమి కలకంఠనామమున్ బోలి తగున్.
(133 ప.)

ఇందు వాడిమయూఖములు అనునది ఆది 3—112 లోను—కలకంఠుడు అనునది, అర. 1—326 లోను గలవు.

నన్నయపద్యము నొకదానిని కేతన యిట్లనుసరించినాడు.

నన్నయ—

'దాని శరీరసౌరభము
దాని విశాల విలోకనంబులున్
దాని మనోహరాకృతియు
దాని శుచిస్మిత వక్త్రకాంతియున్
దాని విలాసముం గడు ము
దంబునఁజూచి మనోజ బాణ సం
తాన హతాత్ముఁడై నృపతి
దానికి నిట్లనియెం బ్రియంబునన్
(ఆది—4—171)

కేతన:

'దాని రమా విలాసములు
దాని యపాంగవిలోకనంబులున్
దాని మృదుప్రియోక్తులును
దాని నివేశము దాని గాన వి
ద్యానుగ నర్తనంబు హృద
యంబున నెక్కొన నప్పుడచ్చటం
దేనియుఁబడ్డ యీగగతి
ధీరతఁ గోల్పడి యిట్లు చొక్కితిన్ (6—30)

నన్నెచోడకవి—

'మగ లాడువారికి మరిగి ముచ్చిలి బంది
వట్టి కన్నంబులు వెట్టి తెరువు
ద్రెక్కొని చని పరదేశంబు లుడుగక
త్రిమ్మరి వేళ్లను ధౌమ్ము బోయి
యాచకులై వేడి నీచుల సేవించి
కలమెక్కి చని సరి కయ్యమాడి
యేనుం గునకు బాడియు ట్లిన్నియేనియు

కష్టముల్ పడి చని గఁదు గాక
మగలుఁ గోరి తొల్లి మగువలు తపములు
సేసి నవసిరనిన చెట్టలెందు
గలదె దీనికచ్చు నిలిపితి స్వివ నీ
వలన సతుల పురులు `వొలిసెగాక —
కుమారసంభవము. 7—36

కే. త న

'కన్నంబువెట్టి తెక్కలిగొని యంకంబు
పలువురతో నాడి బందివెట్టి
జూదంబునకుఁ జొచ్చి చూఱకాండ్రను గూడి
పరదేశములకేగి తెరువులడిచి
యాలి రోయిడి తల్లి నాఁగి బిడ్డలనమ్మి
కన్న తండ్రులతోడఁ గయ్యమాడి
రాజులఁగొల్చి క్రూరంపుఁ జెయ్యులుచేసి
లజ్జాభిమానంబు లుజ్జగించి
ధనములార్జించి మిండాటమునకుఁ జొచ్చి
యిచ్చఁ గ్రీడింతు రంత నట్లేఁగి యేఁగి
యజినరత్నంబు మీకిచ్చినాతఁ డెవ్వఁ
డతని నెఱిఁగింపుమని నన్ను నడుగఁబనిచె.
దశకు. 6—95

ఇచట మూలమున నొక్క సంస్కృత వాక్యమున్నది. కేతన నన్నెచోడని గ్రంథము చదివి దానిని పెంపుగావించినాడు.

## కేతన ననుసరించిన కవులు

శ్రీనాథమహాకవి కేతన దశకుమార చరిత్రము చదివినట్లు క్రింది సందర్భములనుబట్టి తెలియుచున్నది.

కే త న

'తేజోరాజిత సర్వలోకునకు
భూదేవాన్వయాంభోజినీ
రాజీవాప్తున
కాగమప్రథితకర్మ ప్రస్ఫురత్కీర్తికిన్

పుష్పాస్త్ర రూపోపమా రాజన్మూర్తికి
దోషదర్పదమనారంభైక సంరంభికిన్'
దశకు 1—102

శ్రీనాథుడు

'జేజేయంచుభజింతు
నిష్టఫల సంసిద్ధుల్ మదింగోరి
నిర్వ్యాజ ప్రౌఢ కృపావలంబుని
కటప్రస్యంది దానాంబునిన్
బహుజాతర్పితదేవదానవకదంబున్
బాలకేళీ కథా రాజత్కౌతుక
రంజితోరగపతిప్రాలంబు హేరంబునిన్'
శృంగార నైషధము 1—4

ఇందొకే ప్రాస — కడపటి రెండుపాదములు పరిశీలింపనగును.

కే త న

పారావారపరీతవిశ్వవసుధా
భాగంబునన్ గీర్తికా
ధారంబై వెలుగొందు వా డతుల
సత్యత్యాగశీలంబులన్
బారీణుండు
'విరించివంశవనధిప్రాలేయభానుండు'
దుర్వారాంధః పరిపంథి సర్గ నిబిడ
ప్రాలేయభానుం డొగిన్ 2—118

శ్రీనాథుడు

పంచాంగ స్థిరమాత్ర రక్షణ కళాప్రౌఢుండు
బాలామనః పాంచాలుండు
'విరించి వంశవనధిప్రాలేయభానుండు'
దోశ్చంచచ్చాపకృపాణలబ్ధ విజయైశ్వర్యుండు
దిక్కామినీ కాంచీ మౌక్తిక కీర్తి
పెద్దమణి సింగం డొక్కనా డిమ్ములన్
నైషధము 1—10

పై పద్యమున 'విరించివంశవనధిప్రాలేయభానుండు' సరిగా పద్యపాదమున కేతన యెట్లు వాడినాడో శ్రీనాథు డట్లే వాడినాడు. శ్రీనాథునికి తనకంటె ప్రాచీనులగు కవుల కృతులు కంఠస్థములు.

నైషధమున నింకొకచో శ్రీనాథుడు కేతన ననుసరించినాడు.

కేతన — లక్ష్మి కూరిమిసుతు రాజ్యలక్ష్మిహోని
(5—47)

శ్రీనాథుఁడు—'జాతరూపచ్ఛదచ్ఛటాజాత రాప లక్ష్మి' (నైష 1—104)

## కేతనను స్తుతించిన కవులు

కొఱవి గోపరాజు

చ. అనఘు హుళిక్కి భాస్కరు
మహామతి పిల్లలమఱ్ఱిపెద్దిరాజును
ఘనునాగరాజు
కవి సోమునిఁ
దిక్కన సోమయాజి
కేతన కవి రంగనాథు
సుచితజ్ఞుని నెన నాచిరాజ సో
మన నమరేశ్వరుం దలఁతు
మత్కులచంద్రుల సత్కవీంద్రులన్
సింహాసన ద్వాత్రింశిక 1 -26

ఎడపాటి ఎఱ్ఱన -

చ. వినుతి యొనర్తు సంస్కృతసుకవిప్రభు
నన్నయభట్టుఁ దిక్కయ
జ్వను శివదేవు భాస్కరుని జక్కన
నాచనసోము సర్వదే
వుని భవదూరువేము నల పోతన
పిల్లలమఱ్ఱి వీరభ
ద్రుని శరభాంకు వీరకవి ధూర్జటిఁ
గేతన భట్టుబాణునిన్
మల్హణ చరిత్ర 1—21

అప్పకవి—

'తాతనయు మాత్నదండియు'నని కేతనను బిరుదముతో పేర్కొనుటయేగాక —ఆంధ్రభాషాభూష ణమును లక్షణ గ్రంథములలో స్మరించియున్నాడు.

## భాషావ్యాకరణ విశేషములు

కేతన, తెలుగుభాషలో మొదట లక్ష్యలక్షణము చేసిన మహాకవి. ఆతడు తొలుత లక్ష్యగ్రంథముగు దశకుమారచరిత్రము రచించి యావెనుక లక్షణ గ్రంథమగు ఆంధ్రభాషాభూషణమును రచించి యున్నాడు. కాబట్టియే అది తరువాతి లాక్షిణికులకు ప్రామాణ్య గ్రంథమైనది. ఈ వ్యాసమున నా లక్ష్య లక్షణ సమన్వయమునకు అవకాశములేదు.

## ఛందోవిశేషములు: యతులు

'బోరన కటకంబు వెల్వడి నృపాత్మజుఁడంత' (4 -22)

ఇచట—బోరన శబ్దములో అచ్చునకు యతి బోరు+అన అని పదచ్ఛేదము. ఇట్లే నన్నెచోడకవి

'బోరన చనుదెంచె నారద మహాముని' (3—81)

అని యచ్చుపైన యతి పాటించియున్నాడు. నన్నయ మతమున హల్లునకే యతి.

'బోరన చనుదెంచిరి స్వయంవరమునకు ప్రీతిన్' (ఆరణ్య 3 - 29)

'భా। మా తెంపుంబడియైన యీ వికటవర్మం
జెప్పగా జెల్లునే.'

ఇచట వలపలగిలక యతి - మ... మ్మఁ

## ప్రాసలు

'ఉ। గ్రపు దసమాచరించి—' (2--57)

ఇచట 'ఉగ్రపు' అని ప్రాసలో నున్నది. కర్మ ధారయ సమాసమున—'ంపు' రావలెనని నేటి వ్యాకర ణములు. కాని ప్రాచీనకాలమున—'పు' మాత్రమే వచ్చును. దీనికి తిక్కనాదులనుండి ప్రయోగములు గలవు.

'నేచియు నేరకుండియును'— 'నేర్చియు' అను టకు 'నేచియు' 3 -40-

తక్కిన పాదము— తక్కిన పాదములు — చూచిన— తోచు— చూచిన - అనునవి -ఇది వలపలగిలక ప్రాస. (నేర్చి—నేచ్చిఁ)

## శబ్దవిశేషములు

**ఉజ్జేని** - ఈ రూపములో నీ పదమునకు సింహాసన ద్వాత్రింశికలోను చినతిమ్మన ప్రసన్నరాఘవ నాట్యప్రబంధమునను ప్రయోగములు గలవు.

**కనుబేటము** — (3—23) చూచుటయుఁ దను రాగము. ఈ 'బేటము' అనునది నన్నెచోడుని నుండి గ్రహించినది. 'బేటంబేటముగా' (కు. సం. 1—100)

గోమిని—(10—108) లక్ష్మి—ఇదియు నర్మే—కు—సం—గోమిని—(3—108.)

పొయితల — (5—22)—పరిష్కర్తలకీ శద మర్థము కాలేదు. 'పాయి తల' అని వేఱుగా ముద్రితము. ఇది సరికాదు 'పొయితల' అను నది ఏకపదము. ఇది శుద్ధముగా తమిళ పదము. పొయితలై—అనగా అబద్ధపు తల యని యర్థము. దొంగ లుపయోగించు సాధ నములలో నిది యొకటి. దొంగ, తన తల పరి ణామముగల కృత్రిమమైన తలను తయారు చేయించి యుంచుకొనును. కన్నమును త్రవ్వి, మొదట— ఆ కృత్రిమపుత్రులను, అందు పట్టునో లేదో యని చూచును. అది పట్టి నట్లయిన తానందు దూరును. లేకపోయిన మఱింత వెడలుపుగా కన్నము త్రవ్వును.

దిక్ప్రదర్శనంగా కొన్ని తెలిపాముగాని — దశ కుమార చరిత్రలోని చాలా పదములు, పదబంధాలు— నిఘంటువులలో చేరలేదు.[11]

# కన్నడభాషా ప్రభావము

కేతనపై కన్నడభాషా ప్రభావ మున్నది. అతడు వ్రాసిన 'ఆంధ్రభాషా భూషణము' కన్నడ నాగ వర్మ విరచితమైన 'కర్ణాటభాషాభూషణము'నకు సరియైన అనుసరణము. అది సంస్కృతమున నుండగా కేతన తెలుగుభాషలో దీనిని రచియించియున్నాడు.[12]

మఱియు—కేతన దశకుమార చరిత్రమును రచించుటకు కొంచెము పూర్వమున 'చౌండరసు' అను కన్నడ కవి దశకుమారచరిత్రమును నా భాషలో రచించియున్నాడు. దానికి 'అభినవ దశకుమార చరిత్ర' అని పేరు. కాని యాతని కభినవదండి బిరుదము లేదు. కేతన చౌండరసుకన్న మిన్నగా రచించుట చేతనే, ఆతని కభినవదండి బిరుదము సార్థకమై నదని చెప్పవచ్చును. ఈ విషయ మాకాలమున కర్ణాటాంధ్ర ములకుగల సన్నిహితసంబంధము వ్యక్తము చేయు చున్నది.

స్థాలీపులాకన్యాయంగా, కొన్నివిశేషాలుమాత్రమే తెలుపగలిగాను కాని యింకా తెలుపవలసిన వెన్నో ఉన్నవి. కవిబ్రహ్మ తిక్కన పొగడ్తకు పాత్రమై ప్రాచీనాంధ్రకావ్యాలలో ప్రసిద్ధమైన ఈ దశ కుమారచరిత్రను—సాధుపాఠాలలో, సంపూర్ణ భాషా సాహిత్య సంకలిత విపుల వ్యాఖ్యానంతో—సమీచీనంగా తిరిగి ముద్రించడము—అత్యావశ్యకమని విన్నపము.

జ్ఞా పి క :

ఈ కావ్యాన్ని పునర్ముద్రణంచేసే సందర్భంలో తంజావూరిలోఉండే తాళపత్రప్రతిని, ప్రత్యక్షరము పరిశీలించాలి. దీనితోపాటు—వీరేశలింగంగారి ప్రథమ ముద్రణప్రతి సరి చూడాలి. ఆ ప్రతి చెన్నపురి రాజధానీ కళాశాల తెలుగు శాఖలో వీరేశలింగ పుస్తకభాండా గారంలో ఉన్నది.

---

11. శబ్దరత్నాకరానుబంధమున నిట్టివానిని కొన్ని యిచ్చియున్నాను.

12. ఆంధ్రకర్ణాట సారస్వతములు—పరస్పర ప్రభావము. పుట 17—22.



# శిశుగీతం

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

ఇప్పుడే పుట్టాను నేను
ఇంకా పేరుకూడా పెట్టలేదు
బొడ్డుకోసి ఆవలిగట్టునుండి ఈవలకు పడవేశారు.
మాయనుండి మమతాబంధంలోకి విసిరేశారు
కాయగావున్న నా మనస్సు
కటిక రాయిగా మారుతుందో—
విచ్చుకొన్న పువ్వులా వున్న నా ఆత్మ
మొగ్గలా ముడుచుకు పోతుందో-
ఇప్పుడే పుట్టిన నాకు—
అనంత గర్భంలోంచి, ఆకాశహర్మ్యంలోంచి, అమ్మ కడుపులోకిపడ నాకు
రక్తంలా వేడిగా, పాలలా తెల్లగా,
పేరులేక, ఊరులేక, కరుణించేవారులేక
పుల్లవోలె, గాలి రెమ్మవోలె వున్న నాకు ఏం తెలుస్తుంది?
అపుడే ఆకలి అనిపిస్తున్నది,
అమ్మా అని ఇంద్రియాలు ఆక్రోశిస్తున్నవి,
గట్టుమీద, చెట్టునీడ
గాజుకళ్ల, చింకిబట్ట, చివుకు బుట్ట,
వేస్సైడ్ ఈవ్, వేస్ట్‌పేపర్ బాస్కెట్
ఎండిన తన రొమ్మును నా కందిస్తే
ఎండు చేప వాసన నను మండిస్తే,
నా క్షుధాగ్ని శతముఖాల లోలోపల నాలోపల వ్యాపిస్తుంది,
నను కబళిస్తుందని ఎవరికి తెలుస్తుంది?
దేవుడా! ఈ దేశంలో ఎందుకు సృష్టించావు నన్ను?
జనగణమన గీతాన్ని జడుసిలా గానం చేస్తున్న జనత
తెల్లటోపీల వెనుక తెలివి లేనిని దాచగల యువత

నాకు సహాయం చేయకుండా చూడు.
ఆసుపత్రి పాలబడే నా శిశుత్వాన్ని
వూరకుక్కలచే కండలుగా పీకింతుకోలేను.
అనాథాలయంలో అమ్ముడుపోయే వ్యక్తిత్వాన్ని
డైమన్‌్డరాణీగా, కళావరు జాకీగా మార్చలేను
హంసలా, ఆరనిమంటలా, హరిణ శాబకంలా,
విద్యుత్తు లాగ, వీరుని లాగ, ఋషి శాపం లాగ,
వర్షంలా, వెన్నెలలా, నవయౌవనిలా బ్రతకాలని—
మబ్బు పరదాక్రింద, పక్షిలా నాట్యం చేయాలని—
హిమాలయ సానువుల్లో గంగాజలమై గలగల పారాలని—
నా సంఘానికి, నవకవనానికి, ప్రతినిధిగా బ్రతకాలని
అందంగా నవ్వాలని, కన్నీటిని తుడవాలని ఉన్నది.
తండ్రీ! తపనతో తల్లి గర్భంలో మ్రగ్గి భూమిపై పడ్డ నేను
బట్ట తలకూ మోకాటికీ ముడివేయలేను
నల్ల బజారులో లక్ష్మిని నగ్నంగా నిలబెట్టలేను.
వాణిని వేశ్యనుగా, నా దాసిలా, తాడుతెగిన పటంలాగ మార్చలేను.
అర్భకుణ్ని !
అరువు పాలమీద బ్రతకవలసిన వాణ్ని.
ఎరువు తిండిమీద పెరుగుతున్న వాణ్ని.
దేవుడా! నేను పసివాణ్ణి—
బ్రతికిస్తే జీవితాంతం పచ్చగా పసిగా బ్రతికించు
కసితో, మసితో, మనసంతా కాలుష్యంతో ననుకాల్చకు
మీట నొక్కి నను చంపించు
చీకటికీ, ఆకటికీ ఆటవిడుపు కల్పించు.

# ఇల్యా ఎహ్రెన్‌బర్గ్



ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ 1891 జనవరి 27 న పుట్టారు. 1967 ఆగస్టు 31 న మరణించారు. అప్పటికి ఆయనకు 76 ఏళ్లు నిండిపోయాయి. ఆ 76 ఏళ్లు ఆయన నడిపిన జీవితం ఏదో అల్పిష్టమైంది కాదు. రష్యన్ సాహిత్యాన్ని బహుభంగులవెల్లించి, దానికి ఒక పుష్టిని, ఒకకాంతిని, ఓజస్సును చేకూర్చింది.

ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ ఇది వ్రాశాడు, ఇది వ్రాయలేదు అని లేదు. ఆయన కవిత్వం వ్రాశాడు. నవలలు వ్రాశాడు. కథలు వ్రాశాడు. కరపత్రాలు వ్రాశాడు. పత్రికలకు వ్యాసాలు వ్రాశాడు. కవిగా ఆయన ప్రతిభను దియాగో రివేరా అభినుతించి వున్నాడు. 'ఎహ్రెన్‌బర్గ్ రష్యన్ కవులలో అత్యంతము ఉత్తేజం కలవాడు' అన్నాడు.

సన్‌డే టైమ్సు మాస్కో విలేఖరి అలగ్జాండర్ రెత్ ఒక పుస్తకం వ్రాశాడు: రష్యా–1941–45 యుద్ధము—అని; ఆ గ్రంథంలో ఇల్యా ఎహ్రెన్‌బర్గ్‌ను గురించి వ్రాస్తూ 'రష్యన్ ప్రజల నైతిక దార్ఢ్యాన్ని పట్టువీడకుండా వుంచడంలో మహత్తరమైన కృషి చేసిన రచయితలలో ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ అగ్రేసరుడు. సైన్యంలో ప్రతిఒక్కరు ఆయన పుస్తకాలు చదివేవారు. శత్రుశ్రేణుల వెనతట్టులలో వీరవిహారం చేస్తూ వచ్చిన గెరిల్లాలు తమ మరతుపాకులను ఎహ్రెన్‌బర్గ్ రచనలలో ముఖ్యమైన ఘట్టపు పట్టులకోసం మార్చుకొని చదువుకునేందుకు తెచ్చుకునే వారు' అని వ్రాశాడు.

ఎహ్రెన్‌బర్గ్ ఓపికగా వ్రాసేవాడు. ఆయనకు విసుగుఅనేదిలేదు. కొంతకాలంక్రింద ఆయన రచనలను ప్రోగుచేసి ఒక పది సంపుటాలు ప్రకటించారు. ఆయన రచనఅంతా ఆ సంపుటాలలో ఒదగలేదు. ఆ పది సంపుటాలు ఆయన చేసిన మొత్తపు రచనలో పదోవంతు మాత్రమే. 1910 మొదలు 1920 దాకా ఆయన తన తొలి వయస్సులో వ్రాసివున్న పద్యాలే మూడు సంపుటాలు అవుతాయంటారు. పత్రికలకు ఆయన వ్రాసిన వ్యాసాలన్నీ కలిపివేస్తే పదిహేను సంపుటాలు నిండుతాయని అంచనా వేశారు. ఒక్క రెండో ప్రపంచయుద్ధకాలంలోనే ఆయన పత్రికలకు వ్రాసిన వ్యాసాలన్నీకలిపే మూడువేలకుపైగా వున్నాయి. ఆయన వ్రాసిన గ్రంథాల సంఖ్య వందకు మించివుంది. వానిలో ఆయన సృష్టించిన పాత్రలు అనేకం. ఆ పాత్రల సంఖ్య ఎంతఅంటే, ఒక్కమాదిరి పట్టణంలో జనాభా అంతవుంటుందని ఒక విమర్శకుడు అన్నాడు.

విమర్శకులు ఎహ్రెన్‌బర్గ్‌ను గురించి చెప్పిన దాన్నిబట్టిచూస్తే ఆయన పెద్దత్వరగల రచయిత కాదు. మరి ఇన్ని నవలలు, కథలు, పద్యాలు, వ్యాసాలు ఏట్లా వ్రాయగల్గాడుఅంటే, అతని జీవితకాలం

అంతా వ్రాస్తూనేవున్నాడు అని సమాధానం. ఆ జీవించినకాలంలో ఆయన కాగితంమీద కలంపెట్టి వ్రాయని క్షణం అన్నది లేదేమో!

ఒకసారి ఒక సహృదయుడు ఎహ్రెన్‌బర్గ్‌ను ఇట్లా ప్రశ్నించాడు: 'మీరు రచయితలు గదా? మిమ్మల్ని గురించి మీ అభిప్రాయం ఏమిటి?' అని.

'నేను వట్టి మధ్యరకం రచయితను' అని ఎహ్రెన్‌బర్గ్ సమాధానం ఇచ్చాడు.

ఇది నిజమా? ఆయన ఈ మాటను ప్రపంచం ఒప్పుకుంటుందా? ఇది ఎహ్రెన్‌బర్గ్ వినయం కావచ్చు. కాని అది కాదు. తనకుతాను నిజాయతీగా వుండాలి అనుకున్న ఆయన అనంతమైన గాఢశీలత్వం ఇది. అంతేగాక, తన రచనా శిల్పాన్ని గురించిన ఆర్జవం. ఎందుచేతనంటే ఇల్యా ఎహ్రెన్‌బర్గ్‌ను ప్రపంచంలో అన్నిదేశాలవారు ఉత్తమ రచయితగా గుర్తించారు. అందుకు ఆయన చేసిన రచనలే తార్కాణం. ఆయన సాహిత్యంపై వ్రాసిన విమర్శనా వ్యాసాలు గూడా ఉదాహరణం. ఆయన నవలలో 'లైఫ్ ఆఫ్ ది కమ్యూనార్డ్' 'లవ్ ఆఫ్ జీన్‌నె' 'నైన్త్‌వేవ్' 'స్టార్మ్' 'వితౌట్‌పాజింగ్ ఫర్ బ్రెత్' 'అవుట్ ఆఫ్ కేయాస్' 'ఫాల్ ఆఫ్ పారిస్' 'మెన్, ఇయర్స్ అండ్ లైఫ్' 'థా'—చాలా ముఖ్యమైనవి. 'థా' అనే నవల ఒక్కసారిగా జగత్ప్రసిద్ధిని వహించింది. ఎందుచేతనంటే, స్టాలినిజం తగ్గదన్నవాదం 'థా'లో సాహిత్యరూపంలో, ఉత్తమ సాహిత్య స్థాయిలో అభివ్యక్తం చేయబడింది. స్టాలిన్ అనంతరం రష్యాలో వీస్తూవచ్చిన స్వేచ్ఛావాయువులకు, నిర్బంధాల సడలింపునకు ఆ నవల నామధేయము ప్రతీకమై పోయింది. తుదకు అంతర్జాతీయ పరిభాషలో 'థా' అంటే, కఠిన నిర్బంధాల సడలింపు అన్న అర్థంలో ప్రచారంలోనికి కూడా వచ్చింది. మేధావులలోవున్న తిరుగుబాటుకు ఆ నవల రూపకల్పన చేసింది. రచయితను, శిల్పిని, కళాకారులను, ఒక్కమాటలో మేధావులను—వారి ప్రతిభను—బంధించడంలో, నిర్బంధాలలో పెట్టడంలో అర్థంలేదు. ప్రపంచంలోని అన్నిభాషలలోనికి ఆ గ్రంథం అనువదింపబడింది. మానవుని యొక్క లక్షణాలను గురించి గాఢమైన దృష్టితో వీక్షణచేసి మలచబడిన రచన ఇది. ఈ నవల ఎహ్రెన్‌బర్గ్ యొక్క స్వతంత్రతా వ్యక్తికి అభివ్యక్తి. అందులో ఆయన రష్యాలో పరిస్థితులను విమర్శించాడు. నిర్బంధాలను నిరసించాడు. ఎహ్రెన్‌బర్గ్ ఆదినుంచి గూడా నిర్బంధాలను నిరసించినవాడే. ఆయన రచనలలో ఈ విషయం విస్పష్టంగా కన్పిస్తుంది. అందుకు కారణం ఆయన జీవితమేమో ననిపిస్తుంది. 1891 లో ఆయన కీవ్‌లో పుట్టాడు. తల్లిదండ్రులు యూదులు. రష్యాలో యూదులుపడ్డ బాధలను గూర్చి చెప్పనవసరంలేదు. అందువల్లనేనేమో, 1906 నాటికల్లా ఎహ్రెన్‌బర్గ్‌లో విప్లవ భావాలు వ్యాపించాయి. ఆయన ఆ సంవత్సరంలోనే బోల్షివిక్కుపార్టీలో చేరాడు. 1908 లో ఆయన్ను అరెస్టు చేశారు. విచారణకు నిల్పుదామని అప్పటి పరిపాలకులు ముందు ఆలోచన చేశారుగాని, తర్వాత ఎందుచేతనో వదిలిపెట్టారు. ఎహ్రెన్‌బర్గ్ పారిస్‌కు వెళ్లిపోయాడు. ఆ రోజుల్లో బెనెడిక్టైన్ ఆర్డరులో చేరుదామన్న ఊహ గూడా ఆయనకు వచ్చింది. కాని చేరలేదు. 1909 మొదలు 1917 దాకా ఆయన నానా అవస్థలు పడ్డాడు. ఎహ్రెన్‌బర్గ్ జీవితంలో ఆ దినాలు చాలా కష్టమైన దినాలు అని అంటారు. కాని ఆయన ప్రతిభకు ఎటువంటి అవస్థ పట్టలేదు. ఆ రోజుల్లో వ్రాసిన పద్యాలతోనే ఆయనకు కవిగా పేరు వచ్చింది. 1917 లో ఆయన రష్యాకు తిరిగి వచ్చాడు. 1921—1924ల మధ్య ఆయన రష్యన్ పత్రికలకు పశ్చిమ యూరోపా దేశాలలో విలేఖరిగా పనిచేశాడు. అప్పుడు గూడా ఆయన నివాసం పారిస్సే. ఆ తర్వాతగూడా ఆయనకు రష్యాలో ఆట్టే వున్నది లేదు. 1924 నుంచి 1940 వరకు ఆయన విదేశాలలోనే జీవించాడు. మళ్ళీ మళ్ళీ రష్యాకు వచ్చిపోతూ వుండేవాడు.

ఈ రకమైన జీవితం మూలంగా ఆయనకు ఎక్కడ ఏమి జరుగుతున్నదీ స్వంతంగా చూచి, దర్శించే వీలు, ఆకళింపుచేసుకునే అవకాశం కల్గింది. ఆయనకు బయటిదేశాలలో అనంతంగా మిత్రులు వున్నారు. అంతా ప్రసిద్ధులు. ప్రసిద్ధులలో ప్రసిద్ధులు గూడా ఆయన

మిత్ర శ్రేణిలో వున్నారు. వారిలో పియాల్బో పికాసో పేరు చెప్పుకోతగినది. ఎహ్రెన్‌బర్గ్‌కు పికాసో కూర్చిన మిత్రుడు. మాస్కోలో ఆయన వుంటూ వచ్చిన ఇంటిలో డ్రాయింగు రూములో కొన్ని 'పికాసో'లు వున్నాయి. స్పానిష్ చిత్రకారుడు ఓర్టేగా, రష్యన్ చిత్రకారులు చాగాన్, లెంత్యులోవ్ – మాష్కోవ్, ఫ్లైష్లెర్‌ల బొమ్మలూ వున్నాయి. అయితే 'పికాసో' అంటే ఎహ్రెన్‌బర్గ్‌కు ప్రాణం. 'అతను ప్రాణ మిత్రుడు' అని ఆయన అంటూ వుండేవాడు. అది నిజం కూడాను. తన దగ్గర పికాసో వేసిన అసలు బొమ్మలు—ఒరిజినల్సు—ముప్పదిఅయిదుదాకా వున్నాయని ఎహ్రెన్‌బర్గ్ చెబుతూ వుండేవారు.

ఆయన మిత్రులు, ఆయన సంస్కారం అటువంటిది. మరి రష్యాలో జరుగుతూ వచ్చిన పనులను ఆయన ఎట్లా సహించగల్గుతాడు. తెగవేసి వున్నది వున్నట్లు చెప్పేవాడు. అది అధికారులకు ఆగ్రహం తెప్పించేది అయివుండవచ్చు. అది వేరే విషయం. స్టాలిన్ మరణం చెందిన అనంతరం కూడా అధికారులతో ఆయనకు వివాదాలు రాకపోలేదు. ముఖ్యంగా కృశ్చేవ్‌తోనే వచ్చింది. మేధావులకు స్వాతంత్ర్యాన్ని కల్పించిన అనంతరం, ఆ స్వాతంత్ర్యం అధికార 'శ్రేణి' అనుకున్న హద్దులను దాటిపోతూన్నదేమోనన్న అనుమానం కృశ్చేవ్‌కే కల్గింది. యెవ్‌తుషెంకోను మరలించడం మొదలైన సంఘటనలు, పాస్టర్నాక్ నోబుల్ బహుమతి ఉదంతం అన్నీ ఆ రోజుల్లోనే జరిగాయి. ఎహ్రెన్‌బర్గ్‌తో కృశ్చేవ్‌కు వచ్చిన తగాదా లక్షణం ఇటువంటిది కాదు. అది అసలుకు ఎసరులాగా వచ్చింది. స్టాలిన్ తన పరిపాలనలో అనేకమంది చంపివున్నాడు. వారంతా నిజంగా నేరాలు చేయగా స్టాలిన్ వారిని చంపాడా? కృశ్చేవ్ అభిప్రాయంలో ఆ హతులందరు నిజంగా నేరాలు చేసినవాళ్లే. ఎహ్రెన్‌బర్గ్ అట్లా కాదు అన్నాడు. ఈ విషయం తెలిసిగూడా కృశ్చేవ్ మెదలకుండా వూరుకున్నాడు అన్నాడు, ఇది కృశ్చేవ్‌కు కష్టాన్ని కల్గించింది. ఆయన్ను ఇబ్బందిలోను పెట్టింది. ఆయన ఎహ్రెన్‌బర్గ్‌ను తీవ్రంగా విమర్శించను గూడా విమర్శించాడు.

ఎహ్రెన్‌బర్గ్ అటువంటి రచయిత. నిర్భీకుడు. అందువల్లనే ఆయన రచనలలో ఏ పుట తిరుగవేసినా ఎడతెగని అన్వేషణ వ్యక్తం అవుతుంది. ప్రజల కష్టాలను, సుఖాలను ఆయన బాగా అవగతం చేసుకున్నాడు. ప్రజల జీవనం విరామంలేనిది. ప్రవాహం వంటిది. దాన్ని ఆయన దర్శించిన పద్ధతి ఆయన గ్రంథాలలో గోచరిస్తుంది. ఆయన మార్గం సుగమమైందికాదు. వివాదాస్పదమైంది. అందుచేతనే ఆయన వ్రాసిన పుస్తకం వెలువడినప్పుడల్లా, తీవ్రమైన చర్చలు తలఎత్తుతూ వుండేవి. ఆయన వ్రాసిన ప్రతి గ్రంథంలోను ఏదో వైలక్షణ్యం గోచరిస్తుంది. మహత్తర కళాకారునికి వుండే లక్షణం కొట్టవచ్చినట్లు వుంటుంది. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత ఎహ్రెన్‌బర్గ్‌లో విచిత్రమైన మార్పువచ్చింది. ఆయనలో పూర్వంకన్నా మానవీయతాభావం ఎక్కువగా మారాకు హత్తుకుంది. మానవీయమైనదేదీ నాకు విజాతీయమైంది కాదు అని ఆయన ఒకసారి అన్నాడు. మానవునిలో మంచి వుంది. చెడ్డ వుంది. దేనికీ కేవలస్థితి వుండదు. మిశ్రమమై వుంటుంది. అందువల్లనే మానవుడు జటిలుడు, అవగాహనకు అసాధ్యుడు అవుతున్నాడు. ప్రపంచంలో ఎంతమంది ఎన్నివిధాలుగా మానవుణ్ణిగురించి వ్రాయలేదు అయినా ఆ మానవుడు ఇప్పటికీ ప్రహేళికవతుగానే వున్నాడు. అతణ్ణి అట్లా గ్రహించవలసిందే. ఎహ్రెన్‌బర్గ్—మానవీయమైనదేదీ తనకు విజాతీయం కాదని అంటున్నపుడు—ఆ మాటను ఇంతటి విశాలమైన అర్థంతోను గ్రహించవలసివుంటుంది.

ఒకరు ఒకసారి ఎహ్రెన్‌బర్గ్‌ను –'మీకు నవలలు ఇష్టమా? జర్నలిజం సన్నిహిమా? లేక కవిత్వం అంటే ఎక్కువా?' అని ప్రశ్నించారు.

ఆ ప్రశ్నకు ఆయన ఇచ్చిన సమాధానం ఇది.

'నేను పట్టి మానవుణి . నేను ఏమన్నా మీరు క్షమిస్తారను కుంటాను. నేను అతిసామాన్యుణ్ణి. నా మాటలు వ్రాతలు సామాన్యాలే. అందుచేత మానవునికి సంబంధించినది, మానవీయమైనది, ఏదీ నాకు విజాతీయం కాదు.'

## ఇల్యా ఎహ్రెన్‌బర్గ్

నిజం చెప్పాలంటే ఎహ్రెన్‌బర్గ్ సామాన్యుడు కాదు. ఈ 'సామాన్యత' అన్న దానిని తాత్వికంగా అర్థం చేసుకోవలసి వుంటుంది. మన వేదాంత పరిభాషలో సామానాధికరణ్యము అన్నమాట ఒకటి వుంది. ఈ మాట అటువంటిది. సర్వమానవులలోను ఏది సాధారణ్యమై వుంటున్నదో, అది తన నైజలక్షణం అని, వినయదఘ్నంగా ఎహ్రెన్‌బర్గ్ అంటున్నాడు. ఆయన కమ్యూనిస్టు కావచ్చు. కాని ఆయన మనస్సు, హృదయమూ విశాలమైనవి. అవి ఎంతటి మహస్కము, విజ్ఞానసంయుతము అయినవో అంతటి అచ్చమైన పసితనపు లక్షణంగూడా ఆయనలో గోచరిస్తుంది. ఆయన ఒకసారి ఇట్లా వ్రాసుకొని వున్నాడు: 'సామాన్యమైన మానవ ప్రేమను వర్ణించే రచయిత ప్రపంచంలోవున్న మానవప్రేమికుల కందరికీ బాధ్యుడౌతాడు. ప్రపంచంలోవున్న పసిపాపల ఉయ్యాలలకూ, ఉద్యానవనాలకు బాధ్యుడౌతాడు. ప్రజలతో మాట్లాడే రచయిత ప్రపంచంలోని ప్రజలందరికీ బాధ్యుడౌతాడు. ఏనాడైనా ఏ రచయిత అయినా మాట్లాడకుండా, అకర్మకృతుడై కూర్చోగలడా? తన చుట్టూ గిరి గీసుకొని, తానుతప్ప ఇక ప్రపంచంలేదని కూర్చోగలడా? పసిపిల్లలకు, మానవ సౌఖ్యానికి, ప్రాచీన శిల్పాలకు ద్రోహం చేయగలడా?'

ఈ చివరి వాక్యం చాలా ముఖ్యమైంది. ఆ మాటలో ప్రపంచంఅంత అర్థం ఇమిడి వుంది. పసిపిల్లలు, మానవసౌఖ్యం, ప్రాచీన శిల్పాలు—వీటిని ఆయన ఒక్క వాక్యంలో, సమాధానంగా సంయోజనం చేయడం గమనించదగి వుంది. భూత భవిష్యత్ వర్తమానాల సంయోజనం అది. 'వయస్సు మళ్లిన, ఎముకలు కుళ్లిన ముసళ్లను' చచ్చిపొమ్మనే తత్వంకాదు అది. ఎహ్రెన్‌బర్గ్ డ్రాయింగు రూములో 'మోడరన్' శిల్పాలువున్నట్లే — బైజాంటియన్ శిల్పాలుగూడా వున్నాయి.

ఎహ్రెన్‌బర్గ్ కీర్తి కాముకుడా? అది కప్పించేదు. పదిమంది తన్నుగూర్చి చెప్పుకుంటూ వుండాలన్న దిలాసాగలవాడా? అదీ లేదు. చిన్నతనంలో వుండేదేమో తెలియదు. చివరి రోజులో ఒకరితో ఆయన ఇట్లా అన్నాడు. 'కీర్తి కాముకత్వం అధికంగా వుంటుంది. ఆ కీర్తి రావడం చూచుకొని యువకులు గర్విస్తూకూడా వుంటారు. కాని ఈ వయస్సులో ఆ కీర్తి ఒక బరువు. అది కాలాన్ని మింగేస్తుంది. అనేక రకాలయిన బాధలు తెచ్చిపెడుతుంది.'

ఎహ్రెన్‌బర్గ్ తన డెబ్బది ఆరవయేట—తన అనుభవాలు—జ్ఞాపకాల గురించిన ఏడో భాగం పుస్తకాన్ని రచిస్తూ వున్నారు ఆ గ్రంథానికి ఆయన— 'Men, years, Life' అని పేరు పెట్టారు. ఈ సంపుటాలు అసలు సోవియట్ సాహిత్య ప్రపంచ చరిత్రలోనే విశిష్టమైనవని అనేవాళ్లు వున్నారు. ఎప్పుడో విప్లవానికి పూర్వపుకాలంలో మొదలుపెట్టి, దాదాపుగా తన జీవితంలో అంతంవరకు జరుగుతూవున్న కాలం వరకు నడిచిన కాలాన్ని ఆయన ఈ "Men, Years, Life" లో పట్టారు. ఈ ఏడోభాగం 1954 మొదలు 1964 వరకు నడిచిన కాలానికి సంబంధించింది. ఆ వృద్ధాప్యంలో ఎహ్రెన్‌బర్గ్‌కు [illegible]ం అంటే, ప్రపంచంఅంటే, ఆశ్చర్యము, అద్భుతము వేసేవా? 1956 లో ఎహ్రెన్‌బర్గ్ భారతదేశం, జపాను, గ్రీసులను సందర్శించారు. ఆ సందర్భానానుభవాలను, అప్పుడు తనకు కలిగిన అభిప్రాయ ప్రపంచాన్ని ఒక పుస్తకంగా ప్రకటించారు. 'Indian Impressions' అన్నది అందులో ఒక భాగం. వృద్ధాప్యాన్ని గురించి అందులో ఆయన ఇట్లా వ్రాసి వున్నాడు. 'నేను ఢిల్లీకి చేరుకున్న రోజున నా అరువది ఐదవ పుట్టిన రోజు వచ్చింది. జనం అంటూ వుంటారు. పెద్దతనం వస్తూవున్న కొద్దీ చిన్నతనంలోకన్నా విషయాలు బాగా అర్థం అవుతాయి—అని. ఏమో చెప్పలేను. వృద్ధులయిన వాళ్లు ఏదో కొంత ప్రజ్ఞానాన్ని సముపార్జించుకోగల్గుతారే, అనుకుందాము. కాని మనుష్యునకు సహజంగా అబ్బివున్న ఒకానొక మహాశక్తి వారిలో రహితం అయిపోతుంది. అది ఆశ్చర్యపడటం—అనే శక్తి. ఇప్పుడు ఈ వయస్సులోవున్న నన్ను, ఆశ్చర్యపరచాలిలంటే, అది తేలిక విషయం కాదు.'

ఇంతటి జీవితంలో సంపాదన చేసిన అనుభవం వలన ఈ అదృష్టతంపడే లక్షణము; శక్తి ఆయనలో

భారతి

కొరవడిందనడానికి లేదు. ఆయన రచనలు పరిమాణం చేతను, గాంభీర్యంచేతనుగూడా అద్భుతావహంగానే ఉంటాయి. ఎహ్రెన్‌బర్గ్ ఎప్పుడో చిన్నతనంలో రచన ప్రారంభించాడు. ఈ పద్ధతిలో వ్రాశాడు, ఈ పద్ధతిలో వ్రాయలేదు అని లేదు. వ్రాసినదంతా బాగా వున్నదా అంటే, అది వేరే విషయం. కాని తల ఎత్తింది మొదలు చివరిసారిగా కన్నుమూసేవరకు ఆయన వ్రాస్తూనే వున్నాడు, ఆ వ్రాయడం అంటే కూచుని వ్రాయడం కాదు. ఆయన వ్రాసేది ఒక్కసారిగానే 'టైపు'చేసేవాడు. చిత్తు, సాపు అన్నవి ఆట్టే లేవు. ఎందుకు ఇట్లా చేసేవాడు అంటే—ఆయనే వ్రాసుకున్నాడు. 'నా దస్తూరి ఘోరంగా వుంటుంది. నేను వ్రాసింది నాకే ఒక్కపఠాన తెలియదు' అని. అందువల్ల 'టైపు' చేసుకొనేవాడు. ఆయనకు 'నోట్సు' వ్రాసుకునే అలవాటు వుంది. ఈ 'Men, years' గ్రంథ రచనలో అవి బాగా ఉపయోగపడ్డాయి. ఎహ్రెన్‌బర్గ్‌కు రాత్రి పూట మేలుకొని వ్రాత సాగించే అలవాటు లేదు. అది ఆయన పద్ధతి కాదు. 'నాకు రాత్రి పూట నిద్రపోవడమే ఇష్టం. పగలంతా పని చేయడం పని.' అని ఆయన ఒకరితో అన్నాడు.

ఈ రకమైన నిండు జీవితాన్ని, సంఘర్షణలతో, వివాదాలతో, తగాదాలలో నిండిన జీవితాన్ని ప్రతిభకు పండినక్షేత్రం అయిన జీవితాన్ని ఒక్కసారి అట్లా తేరిపారచూచుకుంటే ఎవరికైనా ఆశ్చర్యము వేస్తుంది; అద్భుతము అనిపిస్తుంది. అటువంటి సందర్భంలో ఎహ్రెన్‌బర్గ్‌కు ఆ జీవితాన్నిగూర్చి అట్లా అనిపించలేదని అనడం ఎట్లా? తన 76 వ ఏట—ఇదే ఆ జీవితంలో జరిపిన చివరి గోష్ఠులలో ఒకటి ఏవో—ఇవ్నా వాసిల్‌కోవాతో జరిపిన గోష్ఠిలో ఒక 'సంభాషణ' వుంది. ఎహ్రెన్‌బర్గ్ ఆరోగ్యాన్ని గురించిన పరామర్శతో ఈ సంభాషణ ప్రారంభం అవుతున్నది.

'మీకు ఎట్లా వుంది?' అన్నది ప్రశ్న.

దానికి ఎహ్రెన్‌బర్గ్ సమాధానం ఇది.

'డబ్బది ఆరు ఏళ్ల వయసువచ్చిన మనిషికి ఎట్లా వుండాలో అట్లా వుంది. ఒక పాల్లు అటుగాని, ఒక పాల్లు ఇటుగాని లేదు. నేను చెబుతున్నది నీకు అందదు. వయస్సు నా అంత లేదు నీకు. ఇంకా చాలా వెనక వున్నావు.'

ఈ మాటలలోవున్న అర్థం పైకి కన్పించేదే అనుకుంటే—ఎహ్రెన్‌బర్గ్‌ను—ఆయన ప్రతిభను కించపరచడమే అవుతుంది. పండిన వయస్సులోడి అగ్నమైన పండిన అనుభవంయొక్క గాఢత ఆ మాటలలో పువ్వులోని గంధమువలె గుబాళిస్తున్నది. అవి మననంచేసి అవగతం చేసుకోవలసిన మాటలు.

—పరిశీలక్



# భాషా సమస్య

ఆంగీరస్

హిందీకి రాష్ట్రభాష అని పేరుపెట్టిన నాటి నుంచి, ఈ రాష్ట్ర భాషా వ్యవహారాన్ని గురించి తగాదాలు నడుస్తూనే వున్నాయి. సర్వసాధారణంగా ఆ రోజుల్లో రాజకీయ 'చైతన్యం' అన్నది తమకు వున్నదని అనుకున్న వారంతా హిందీని రాష్ట్రభాషగా పరిగణిస్తూ వుండేవారు. ఆ విధంగా ప్రచారం చేస్తూ వుండేవారు. దేశం అంతటా హిందీ ప్రచార సభలు, రాష్ట్రభాషా ప్రచార సభలు ఏర్పడ్డాయి. కాని ఆ రోజుల్లో ఈ భాషను ఆ విధంగా అంగీకరించని వారు, అది అందుకు తగదని చెప్పినవారు లేకపోలేదు. కొంతమంది హిందీనిగూడా 'నానా దుష్టభాషల' జాబితాలోచేర్చి పద్యాలుగూడా వ్రాశారు. ఏమైనా దేశంలో అప్పుడు రాజకీయ చైతన్యం ఇంతటి వైవిధ్యాన్ని సంపాదించుకొని వుండలేదు గనుక, కాంగ్రెస్ చెప్పిందే వేదంగా జరుగుతూ వుండేది గనుక, హిందీయే రాష్ట్రభాషఅంటే, హిందీయే రాష్ట్రభాష అన్నారు.

ఆ రోజుల్లోనే ఈ హిందీని గురించి తగాదాలు బలిసిన సందర్భాలు వున్నాయి. హిందీ అంటే ఏమిటి? సంస్కృతశబ్ద జటిలమైనదా? లేక అరబ్బీ, పారశీశబ్ద జటిలమైనదా? అన్న సమస్య వచ్చింది. మహాత్మాగాంధి రాష్ట్రభాషను 'హిందూస్తానీ' అన్న పేరుతో వ్యవహరిస్తూ వచ్చారు. ఆ విధంగానే అది చలామణీ అవుతూ వచ్చింది. దేశంలో హిందీ మాట్లాడేవాళ్ళ అధికులు అన్నవాదం ఒకటి, బహు రాష్ట్రాలలో మాట్లాడబడేభాష అన్న గురుత్వం ఒకటి హిందీకి రాష్ట్రభాషాప్రతిపత్తిని కల్పించడానికి కారణం అయినాయి. దానికి తోడు అప్పుడు జరుగుతున్నది స్వాతంత్ర్యంకోసం సమరం గనుక, ఆ సమరానికి, ఆ సమరాన్ని సాగిస్తున్న జాతికి ఒక భాష అంటూవుండాలి గనుక, ఆ భాష హిందీఅని, హిందూస్తానీ అని, దానికి ఆ ప్రతిపత్తిని రాజకీయ స్థాయిలో కల్పించారు.

అప్పుడు దేశంలో చదువుసంధ్యల విషయంలో ఇంకా ఈ భాషయొక్క ప్రమేయం రాలేదు గనుక ఏ రకమైన ఘర్షణా లేకుండా జరిగిపోయింది. దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. రాజ్యాంగ నిర్మాణ పరిషత్తు ఏర్పాటుచేయబడింది. అప్పుడు రాష్ట్రభాషా వివాదం తలఎత్తింది. దేశంలో బహుభాషలు వున్నాయి. తెలుగు, తమిళము, కన్నడము, బెంగాలీ, మరాఠీ, అస్సామీ, ఒరియా, ఇట్లా. ఇవి అన్నిగూడా హిందీకన్నా ఎక్కువ జీవితము, ఎక్కువ సాహిత్యము కల్గినవి. రాజ్యాంగం ఈ భాషలను గుర్తించింది. పదునాల్గు భాషలను ప్రాంతీయభాషలుగా ఉదహరించింది. హిందీని రాష్ట్రభాషగా నిర్ణయించి, 1962 నాటికి ఆ భాషను, అనగా హిందీని ఆధికార భాషాప్రతిపత్తిలోనికి తీసుకొని రావాలి అంది.

## 2

1962 లో ఆ పని జరగలేదు. జరిగేందుకు సావకాశం లేకపోయింది. అందుకు ఏర్పడిన కారణాలను గురించి ఇక్కడ విచారణ అనవసరం. దేశంలో పరిస్థితులు మారాయి. కొత్తరకం రాజకీయ శక్తులు, కొత్తరకం సమాజ శక్తులు ప్రాబల్యంలోనికి వచ్చాయి. ఈ ఒక్కమాట చెప్పితే చాలు సరిపోతుంది.

ఈ విషయాన్ని రాజకీయవేత్తలలో అంతా గుర్తించపోకయినా కొందరు గుర్తించారు. వారు అట్లా గుర్తించవలసిన పరిసితులు దేశంలో వున్నాయి. అయితే ఆ పరిస్థితులు అట్లా వున్నాయని ఈ నాయకులు ముందుగానే గుర్తించి వుండవలసింది. కాని అది జరగలేదు. తత్ఫలితమే మద్రాసులో సాగిన ఆందోళన, ఆ ఆందోళన ఫలితంగా ఉద్భవించిన సూత్రాలు మొదలైనవి.

భాషా సమస్యను గురించి ఆలోచించేటప్పుడు అభిమానాలు దురభిమానాలు లేకుండా వ్యవహరించవలసి వుంటుంది. అంతేగాక మనదేశంలో భాషల చరిత్రను, దేశచరిత్రనుగూడా పరిశీలన చేయవలసి వుంటుంది. ఇచ్చట నిజం చెబితే నిష్ఠురంగా వుంటుంది. ప్రపంచంలో అనేక దేశాలలో ఏకీకరణకు భాష, కారణము అవుతూ వచ్చింది. కాని మన దేశంలో అందుకు తగిన భాష లేకపోయింది. ఒకప్పుడు సంస్కృతం సర్వదేశాన్ని కలిపే భాషగా వున్నప్పటికి, రానురాను – అనేకమైన కారణాలచేత – ఆ భాష ఆ స్థానంనుంచి చ్యుతిని పొందింది. ఆలోగా ఇంగ్లీషువారు ఈ దేశాన్ని ఆక్రమించుకున్నారు. దేశాన్ని అనటంగంటే, బహుదేశాల రూపంలోవున్న, బహురాజ్యాల సంకీర్ణంగావున్న- ఈ భరతఖండాన్ని ఆక్రమించుకున్నారు. ఈ విషయాన్ని అనగా — ఇంగ్లీషువారి రాకకు ముందు, ఈ దేశం ఎప్పుడూ ఒక్కటిగా లేదని, ఒకదానితో ఒకటికి సంబంధంలేని వేరువేరు రాజ్యాలుగావుంటూ, వానిలో ఏ రాజ్యానికి ఆ రాజ్యము తక్కిన రాజ్యాలను మ్రింగి సర్వంసహాధిపత్యస్థాపనకు యత్నంచేస్తూవుండేవని గ్రహించి, ఆలోచించని పక్షంలో, ఆ చరిత్రగాని, ఆ తర్వాత చరిత్రగాని అర్థంకావు. మరి యీ చరిత్ర ఇట్టిదని గ్రహించినప్పుడుగాని భాషలు, వానియొక్క పద్ధతి, చరిత్ర అవగతంకావు.

## 3

ఇంగ్లీషువారు ఈ దేశాన్ని ఒక్కసారిగా జయించలేదు. క్రమక్రమంగా, ఒక రాజ్యం తరువాత ఇంకో రాజ్యంగా జయించారు. జయించి, ఆ జయించినదాన్ని ఏకఖండంగా చక్కనొత్తారు. అదివరకు ఎప్పుడూ ఈ దేశంలో లేని రాజకీయమైన ఏకీకరణం బ్రిటిష్ వారి ఈ ఆక్రమణతో ఏర్పడింది. ఈ దేశంలో చిల్లర రాజ్యాల బెడదతగ్గి, దేశం అంతా అప్పుడు ఏకైక రాజకీయ అధికారం క్రిందకువచ్చి, అధునాతనమైన రాజకీయ పరిభాషలో 'రాజ్యం' అని చెప్పడానికి అర్హమైన స్థితిని పొందింది.

ఇచ్చట ఇంగ్లీషువారి పరిపాలన ఎటువంటిది? వారు ఎట్లా రాజ్యం చేశారు? అన్నది వేరే విషయం. ఇచ్చట విషయం ఒక్కటే. ఆది రాజకీయంగా ఈ దేశం ఒక్కటి కావడం, చిల్లర రాజ్యాలు, రాజ్యాధికారాలుపోయి, ఒక కేంద్రాధికారము, రాష్ట్రాలు, రాష్ట్రాధికారాలు అన్న విశద వివక్ష ఏర్పడి, నవయుగ రాజకీయ వాతావరణంలో భారతదేశం అడుగు పెట్టడం. ఇంగ్లీషువారి 'ఏలుబడి' మూలంగా ఇన్ని పనులు జరిగాయి.

అప్పుడు ఇంగ్లీషువారికి ఈ దేశంలో దేనిని రాజభాష చెయ్యాలి అన్న సమస్య వచ్చివుంటుంది. వారు ఈ దేశాన్ని ఆక్రమించుకొని ఏలుతున్నారు గనుక, వారిది ఇంగ్లీషు భాష గనుక, ఆ ఇంగ్లీషుని ఇచ్చట రాజభాషగా ప్రవేశపెట్టారు అన్నది చాలా తేలికగా చెప్పడానికి వీలైన సమాధానం. అయితే అప్పటి పరిస్థితులనుబట్టిచూస్తే, అంత తేలికగా ఇంగ్లీషు రాజభాషగా ప్రవేశపెట్టబడినట్లు తోచదు. ఆ ఇంగ్లీషును ప్రవేశపెట్టవలసిన అవసరంవుండి ప్రవేశపెట్టినట్లే తోస్తుంది. ఆ కాలంలో దేశంలో మేధావులుగా చెప్పదగినవారు ఇంగ్లీషును అభ్యసించారు. ఇంగ్లీషు అవసరాన్ని గుర్తించారు. అందుకు బహు కారణాలు వున్నాయి. పాశ్చాత్య ప్రపంచంలో అప్పుడు అనేక రకాలయిన మార్పులు వచ్చేస్తున్నాయి. పారిశ్రామిక విప్లవం ప్రారంభమై జగన్నాథరథం లాగా ముందుకు పోతోంది. విజ్ఞాన రంగంలో స్తబ్ధత తొలగి, చైతన్యం తుఫానులాగా విజృంభిస్తూ వుంది. ఇంగ్లీషు వారికి ఆ అన్నిరకాల మార్పులతోను సన్నిహిత సంబంధం వుంది. ఆర్థిక శాస్త్రంలో, విజ్ఞాన శాస్త్రరంగంలో, రాజకీయసంబంధమైనవిచారధారాప్రపంచంలో ఇంగ్లండులో మేధావులు జన్మఎత్తారు. నూతనవిచారధారాజగత్తులను సృష్టించారు. ఆ ఇంగ్లీషువారికి ఇంకో దేశాన్ని ఆక్రమించుకొని పరిపాలించాలన్నా, తాము తమ దేశం పరిస్థితులకు, ఐరోపాలో వస్తున్న మార్పులకు అనుగుణంగా ఇచ్చటఈ ఆక్రమించుకున్నదేశాలనుగూడాదిద్దవలసివచ్చింది. తమ పరిశ్రమలకు అవసరమైన వస్తువులను ఆక్రమించుకొన్న దేశాలలో ఉత్పత్తి చేయించి, తమ దేశంలో ఉత్పత్తిఅయిన సరుకులను యీ దేశాలలో అమ్మాలన్నా అందుకు అనుకూలమైన పరిస్థితులను ఈ దేశాలలో సృష్టి చేయవలసిన అవసరం కల్గింది. క్రొత్తవిద్యలను ప్రచారంలోనికి తీసుకొనిరావలసి అవసరం కల్గింది. క్రొత్తవృత్తులను, క్రొత్తనాగరిక

తనుతెచ్చిపెట్టవలసిన అవసరంకల్గింది.కారల్ మార్క్స్ ఈ విషయాన్ని కొంత ఒక తన్వగథంలో చాలా చక్కగా వివరించాడు. ఇంగ్లీషువారిపరిపాలన భారతదేశంలో అభివృద్ధి కరమా? అభివృద్ధి నిరోధకమా? అన్న ప్రశ్న వచ్చినప్పుడు మార్క్స్—ఆ పరిపాలన చారిత్రకంగా అభివృద్ధికరము అన్న అర్థం వచ్చేవిధంగా వివరించాడు. ఇంగ్లీషువారు భారతదేశంలో అడుగుపెట్టి, అచ్చట తమ పరిపాలన ప్రారంభించడముచేత బ్రహ్మాండమైన సామాజిక విప్లవాన్ని తెచ్చిపెట్టినట్లు మార్క్స్ పేర్కొన్నాడు. అందుకువారికి ఈ దేశపు భాషలు చాలలేదు. పైగా ఈ దేశం బహుభాషా సంకీర్ణం అయివుంది. సంస్కృతం అప్పటికే, షట్‌శాస్త్రాలలో బిగిసి పోయింది. పంచ కావ్యాలలో ఆగింది. ఆధునాతన భావసంపదను చెప్పగల శక్తిని దానియందు నివిష్టంచేయ గల దక్షులు లేక పోయినారు. ఇన్నిభాషలు వున్నప్పుడు,ఈ అన్నిభాషలను లగింపుచేసి, అనుసంధానపరచగల గురుస్థానం గల్గిన భాషలేనప్పుడు, అచ్చట వేరేభాషను ప్రవేశ పెట్టక తప్పని పరిస్థితి ఏర్పడిపోయింది ఆ భాష అందరికి క్రొత్తది, అందరు నేర్చవలసింది అయివుండాలి. శక్తిమంతమైనదై వుండాలి. ఇంగ్లీషు వారు ఇంగ్లీషును ప్రవేశపెట్టారు. అట్లా అని వారు దేశభాషలను నిరాదరించారా? ఈ దేశంలో ఏ భాష చరిత్ర చూచినా, ఆ భాషయొక్క అభివృద్ధి, అభ్యుదయాలలో ఇంగ్లీషువారి ప్రమేయం గాఢమై కన్పిస్తుంది. ఉదాహరణకు మన తెలుగు భాషను తీసుకుందాము. బ్రౌనుదొర ఈ భాషకు చేసినంతటి సేవను ఎవరైనా చేశారా? అట్లాగే ఈ దేశపు సర్వభాషలకు ఇంగ్లీషువారు చేసిన సేవ అనన్యమైపదని అంతా అంగీకరిస్తారు.

## 4

ఇట్లా ఈ దేశంలో ఇంగ్లీషు రాజభాషగా ప్రవేశించింది దానివలన ఈ దేశానికి ఇతర దేశాల విజ్ఞానంతో సంపర్కం ఏర్పడింది. దేశభాషలు, దేశంలో నాగరకత అభివృద్ధి చెందాయి. పాతభావాలు పోయి వాని స్థానంలో క్రొత్తభావాలు చోటు చేసుకొనడం మొదలుపెట్టాయి. పూర్వపు కరుడుకట్టిన సంప్రదాయం త్రాహిత్రాహి అయిపోయింది. కాని ఈ పరిస్థితిని మన రాజకీయవేత్తలు ఉపయోగించుకోవలసిన రీతిగా ఉపయోగించుకోలేదు. ఇచ్చట పృథక్‌భావాలు, వివిక్తలక్షణాలు తలఎత్తాయి. ఇందుకు రాజకీయ నాయకులు, వారులేగాక మేధావులుగూడా దోషం ఆచరించారు. ఈ దేశాన్ని ఏకంచేయగల శక్తిగల భాషను దేనిని వారు సమకూర్చుకోలేదు. పూర్వంలాగా ఈ భాష ఏదోఒకటిగావుంటే చాలదు. ఆ భాష శక్తివంతమైనదై, తక్కిన దేశభాషలకన్న శాస్త్రకట్టు కలదై, సర్వవిషయఅభివ్యక్తీకరణకు సమర్థమైనదై వుండాలి. ఇండొనీషియాలో డా॥ సుకర్ణో ఏమిచేసినా, ఏమి చేయకపోయినా, ఒక్కమహత్కార్యం చేసినట్లుఅంతా అంగీకరిస్తారు. అది ఆ దేశానికి—ఆయన— సర్వులకు అంగీకారయోగ్యమైన — రాష్ట్రభాషను సృష్టించి ఇవ్వడం. ఆ దేశంలో బహుభాషలు వున్నాయని, బహు రాష్ట్రాలు, బహుప్రజలు వున్నారని తెలిపి, ఆ భాష విషయం ఆలోచిస్తే, అది ఎంతటి సాధనో తెలుస్తుంది. డా॥ సుకర్ణో దేశంలో అత్యంతము అల్ప సంఖ్యాకులైనవారి భాషను ఒకదానిని తీసుకున్నారు. దానికి రాష్ట్రభాషా ప్రతిపత్తిని కల్పించారు. దానిని ఆ విధంగా అభివృద్ధి చెందించారు. ఇప్పుడు ఆ దేశంలో ఎన్ని తగాదాలువున్నా భాషనుగూర్చిన తగాదా అన్నది మాత్రం లేదు.

మనదేశంలో నాయకులు హిందీ—హిందీ— అన్నారేగాని, దానిని వారే సరిగ్గా ఉపయోగించలేదు. అది ఏ నాడూ మేధావుల భాష కాలేదు. కొంత వరకు వ్యాపార భాషగా ప్రచలితం అవుతున్నా, దానిని ఈ భాషల రగడలో ఈ నాయకులే పెరగనీయడం లేదు. ఇందులో మళ్లీ ఒక లక్ష తగాదాలు. అప్పడు తక్కిన భాషలవారు—ఒక విధంగా హిందీకన్న బాగా అభివృద్ధి చెందిన భాషలు కలవారు—దానిని శిరోధార్యమైన భాషగా గుర్తించడం అసాధ్యం అయిపోయింది. అందువల్లనే ఇచ్చట బలవంతపు పద్ధతులను, తత్సహోదరాలైన ఇతర పద్ధతులను అవలంబించవలసిన పరిస్థితి ఏర్పడిపోయింది. అందువల్లనే హిందీయా? ఇంగ్లీషా? అన్న తగాదా ఏర్పడింది.

## 5

ఇందులో, ఈ భాషా సమస్యలో, ఇంతకు మించిన ఇతర విషయాలుగూడా వున్నాయి ఇచ్చట రాజకీయాలు, ఉద్యోగావకాశాలు, ముసుగులు వేసుకొని కన్పిస్తున్నాయి. ఇప్పుడు హిందీని అధికార భాషగా

చేయాలంటున్నవారు వున్నారంటే, నిజానికి వారు ఆ భాష సర్వసమర్థమైనదనిన్నీ, తక్కిన దేశభాషలకంటే శ్రేష్ఠమైనదనిన్నీ అంటున్నారా? అయితే రాజ్యాంగంలో ఉదహరింపబడింది గనుక, దాన్ని అంతా అంగీకరించాలన్న వాదమే పుట్టదు. ఇటీవల ఒకానొక నాయకుడు—ఈ భాషా విషయం చర్చకు వచ్చినప్పుడు ఇంగ్లీషు గనుక ఇట్లాగే కొనసాగేట్లయితే, హిందీ రాష్ట్రాల వారికి ఉద్యోగాలు కరువైపోతాయి—అన్న ధోరణిని వ్యక్తం చేసివున్నాడు. ఆ నాయకుడు నిజాయితీ కలవాడు గనుక వున్నవిషయాన్ని వున్నట్లు చెప్పివేశాడు. తక్కిన వాళ్లు—దానికి ముసుగువేసి, చిలవలు పలవలు కడుతున్నారు. హిందీని అంగీకరించకపోతే దేశం ఏమో అయిపోతుందని, దేశం ప్రతిష్ఠ మొదలైనవి లేనిదై పోతుందని అనే పద్ధతిలో మాట్లాడుతున్నారు.

ఈ మాటలకు అర్థంలేదు. ఎందుచేతనంటే హిందీ ఈ దేశంలో బహుళసంఖ్యగల జనంచేత మాట్లాడబడుతూవున్న భాష కావచ్చు. కాని దేశంలో ఆ భాష మాట్లాడని ఇతరభాషలుగల జనం అంతకంటే అధికంగా వున్నారు. ఇంగ్లీషు పరాయిభాష అయినా, అది అందరికీ అభ్యాసం విషయంలో సమానమైనటువంటిది. ఆ భాష ఒకరికి వచ్చినది, ఒకరికి రానిది అని లేదు. అందరు నేర్వవలసింది.

మరియు ఈ ఇంగ్లీషు ఈ దేశంలో దాదాపు వందా, వందఏభై సంవత్సరాలుగా అధికారభాషగా వుంది. పరిపాలనలో, న్యాయస్థానాలలో, విద్యాసంస్థలలో ఆ ఇంగ్లీషు వాడుకభాష అయిపోయింది. ఇప్పుడు దానిని తొలగించి ప్రాంతీయభాషలను పెట్టాలన్నా, హిందీని పెట్టాలన్నా, ఆ ఇంగ్లీషులో వున్న పరిభాషనేగాక గ్రంథాలకు గ్రంథాలను తర్జుమా చేసుకోవలసిన అవసరం వుంది. ఇందుకు డబ్బు ఖర్చుకావడం సంగతి అట్లావుంచి, కాలము, తెలివి గూడా వృథా అయిపోతాయి.

ఈ రెండువందలు సంవత్సరాలుగా, ఇంగ్లీషు ఈ దేశభాషలలో దేశభాష అయిపోయింది. ఇంగ్లీషు ఎంతమందికి తెలుసు అన్నది ఇచ్చట ప్రశ్న కాదు. ఆ ఇంగ్లీషువలన ఈ దేశానికి కల్గిన ప్రయోజనం ఎంతటిది అన్నది ముఖ్యంగా ఆలోచించవలసిన సంగతి.

దేశంలో ఉన్నత విద్యలకు ఇంగ్లీషు ఆధారం అయిపోయింది. దేశంలో ఇంగ్లీషు, మేధావివర్గం భాష అయిపోయింది. ప్రపంచంతో సన్నిహితమైన సంబంధాన్ని ఆ భాష ఈ దేశానికి సమకూర్చిపెట్టింది. బహుదేశ విజ్ఞానాలను మనం తెలియడానికి, బహువిధ నూతన శాస్త్రాలను అభ్యసించడానికి అది ఆధారము, ఆస్కారము అయిపోయింది. భారతదేశాన్ని గురించి ఇతరులకు చెప్పడానికి గూడా ఆ భాష ఉపయోగపడింది; పడుతున్నది, ఇప్పుడు—ఇంగ్లీషు వద్దు, హిందీ కావాలి — అనేవారు గూడా ఆ మాటలను ఇంగ్లీషులోనే తదితర భాషలవారికి చెబుతున్నారు. అనగా దేశంలో సర్వమైన వ్యవహారము ఇంగ్లీషులోనే జరుగుతోంది. ఇంగ్లీషు ఈ దేశం యొక్క వ్యావహారికభాష అయిపోయింది. ఇప్పుడు దానినిగాక, దేశభాషలలో అధిక సంఖ్యాకులచేత మాట్లాడబడుతున్న దానిని, రాజ్యాంగం అధికారభాషగా గుర్తించిన దానిని, రాష్ట్రభాషగా, లేక 'లింకు' భాషగా దిద్దాలంటే దిద్దుకోవచ్చు. అందుకోసం ఇంగ్లీషును నామరూపాలు లేకుండా చేయవలసిన అవసరం ఏమి వచ్చింది? ఇందుకు దేశంమీద, దేశభాషలమీదా ప్రేమే కారణమా? కాక వేరే ఉద్దేశాలు ఏమన్నా వున్నాయా?

జనంతో సాన్నిహిత్యానికి దేశభాషలు ఆవశ్యకం అంటే, కాదని ఎవ్వరు అనరు. ఇప్పుడు వచ్చిన, వస్తున్న తగాదా అక్కడ కానేకాదు. ఇంతవరకు ఏ ప్రాంతంవారు ఆ ప్రాంతంభాషనే మాట్లాడుతున్నారు. పాఠశాలల్లో, పరిపాలనలో, క్రింది న్యాయస్థానాలలో చాలావరకు అంతా ప్రాంతీయభాషల్లోనే నడుస్తున్నది. అక్కడ చిక్కేలేదు. దేశంలో అన్ని రాష్ట్రాలు తమ భాషలను అధికారభాషలుగా చేస్తున్నాయి. అక్కడా చిక్కులేదు. వస్తున్న చిక్కల్లా హిందీదగ్గర వస్తున్నది. హిందీ, - ఇంగ్లీషు రెండూ 'లింకు'భాషలుగా వుండవచ్చునన్నా, ఇప్పుడు ఈ ఇబ్బంది కల్గేది కాదేమో! కొందరు ఆ విధంగా సూచించి వున్నారు కూడాను. తక్కిన భాషల వారి సంగతి ఎట్లా వున్నా హిందీభాషవారి సంగతి వేరుగా వుంది. వారు ఈదేశం అంతా హిందీ వ్యాపించాలని, అదే ఏకైక 'లింకు' భాష కావాలని అంటున్నారు. తమ రాష్ట్రాలలో దేశీయమైన ఇతర

భాషలనుగూడా వారిలో కొందరు సహించగల్గుతున్న ధోరణి కన్పించడం లేదు. వారిలో విచిత్ర దురభిమానం అధికం అయిపోతున్నట్లు తోస్తున్నది. ఉర్దూకు కూడా అధికారభాష హోదా ఇవ్వాలంటే, ఉత్తర ప్రదేశ్‌లో, బీహార్‌లో అల్లరులు బయలుదేరాయి. హిందీ భాషకు ఆటపట్టులైన రాష్ట్రాలలో ఇట్లా జరగడం దేశాన్ని సంభ్రమాశ్చర్యాలలోనేగాక, అనుమానంలోగూడా ముంచివేసింది. దీన్ని దురభిమానం అంటామా? వెర్రి అంటామా?

ఒక భాష మాట్లాడేవారు ఇట్లా వ్యవహరించి నప్పుడు తక్కిన భాషలు మాట్లాడేవారికి మాత్రం దురభిమానాలు, పట్టుదలలు పెరగవని ఎక్కడ వుంది! ఢిల్లీలో మద్రాసు మంత్రి శ్రీ మాధవన్‌కు, ఉపప్రధాని శ్రీ మొరార్జీదేశాయికి భాష విషయంలో ఘర్షణ జరిగిన అనంతరం మద్రాసులోవచ్చిన విచిత్రమైన మార్పును ఇచ్చట గమనించవలసిన ఆవశ్యకత వుంది. ఈ విషయాన్ని గురించి 'స్టేట్స్‌మన్'పత్రిక సెప్టెంబరు 9 వ తేదీనాడు వ్రాసిన సంపాదకీయంలో ఇట్లా వ్యాఖ్యానించి వుంది. 'ఆగస్టు 31 న మద్రాసు న్యాయశాఖామంత్రితో, శ్రీ మొరార్జీ దేశాయి అన్న మాటలు ఇంకా ఆ రాష్ట్రం మనస్సులో 'మెదులు' తూనే వున్నాయి. ఇప్పుడు మద్రాసు విద్యామంత్రి త్రిభాషాసూత్రాన్ని పూర్తిగా దెబ్బకొట్టివేశారు. మొన్న ఏప్రిల్‌లో రాష్ట్ర విద్యామంత్రుల సమావేశం జరిగినప్పుడు శ్రీ దేశాయ్ రాష్ట్రమంత్రులచేత దానిని ఎట్లాగో ఒప్పించారు. ఇప్పుడు దానికి మద్రాసులో పూర్తి భంగపాటు కల్గింది......అదివరకు అయితే హిందీని, ఇంగ్లీషును సమస్థాయిలో చూడడానికి అక్కడి వారు అంగీకరించేవారేమో! కాని ఇప్పుడు మద్రాసు విద్యామంత్రి శ్రీ నెడుంఛెజియన్ తమ రాష్ట్రంలో విద్యాబోధన అంతా రెండు భాషలలోనే జరుగుతుంది అంటున్నారు. అవి ఇంగ్లీషు, తమిళమే నంటున్నారు. ఈ నిర్ణయంలో ప్రాంతీయ దురభిమానపు వాసనలు వున్నాయని ప్రతివాదం వచ్చే వీలులేకుండా, ఇంగ్లీషుకు అధికప్రాధాన్యం ఇస్తామని ఆయన విశదం చేశారు.'

ఇట్లా ఈ భాషావివాదం ఇప్పుడు దేశంలో అనేకరకాలయిన భావసంఘర్షణలకు దారి తీస్తున్నది. భాషకు సంబంధించివున్న సమస్యలను పరిష్కరించవలసిందిపోయి జటిలం చేస్తున్నది. దీనినిబట్టి ఏమి విషయాలు వ్యక్తం అవుతున్నాయి? దేశం బహురకాల సమస్యలను, అతిజటిలమైనవానిని, ఎదుర్కొంటూవుండగా, ఇప్పుడే ఈ సమస్యను, పూర్వం కన్నా భిన్నమైన పద్ధతిలో ఎందుకు ప్రజ్వలింపచేయ వలసివచ్చింది?

## 6

ఇచ్చట ప్రజ్వలింప చేయడం అన్న మాట కొంచెం తీవ్రమైనదే కావచ్చు. కాని ఆ మాటను ప్రయోగించక తప్పడం లేదు. పూర్వం ఈ భాషా వివాదం వున్నదంటే, అది అధికార భాషగా ఇంగ్లీషునుగూడా గుర్తించాలా, అక్కరలేదా? ఇంగ్లీషుకు సహభాషా ప్రతిపత్తిని కల్పించాలా అక్కరలేదా? ఇంగ్లీషును సహభాషగా వుంచేపక్షంలో ఎంత కాలం దానిని అట్లా వుంచాలి? మొదలైన సమస్యలను గురించి సాగుతూ వచ్చింది. ఈ రకమైన ప్రశ్నలకు నెహ్రూహామీలు, లాల్‌బహదూర్‌శాస్త్రి హామీలు సమాధానాలుగా కన్పిస్తూ వచ్చాయి. ఆ హామీలను శాసనబద్ధం చేయడం ఒక్కటే తరువాయి అని అంతా అంటూ వచ్చారు. అంతలో ఎన్నికలు వచ్చాయి. ఆ ఎన్నికలతో దేశంలో అనేకమైన మార్పులు వచ్చాయి. కేంద్రంలో కాంగ్రెస్ అధికారంలోనికి వచ్చినా, చాలా రాష్ట్రంలో దెబ్బ తింది. గెలిచిన చోటగూడా బలంగా వున్నదని చెప్పడానికి వీలులేని పరిస్థితులు ఏర్పడ్డాయి. ఇందుకు ఉత్తరప్రదేశ్, హర్యానా మొదలైన రాష్ట్రాలను ఉదాహరణలుగా చూపించవచ్చు. అన్నింటికంటే పెద్ద ఉదాహరణ మధ్యప్రదేశ్. ఒక విచిత్రం ఏమంటే ఎన్నికలలోనేమి, ఆ అనంతరం ఏమి కాంగ్రెస్ దెబ్బ తిన్న రాష్ట్రాలు ప్రధానమైన హిందీ కేంద్రాలైన రాష్ట్రాలయి పోయినాయి. దీనితో భాషాసమస్య యొక్క పూర్వస్థితి మారిపోయింది. అది ఇప్పుడు పూర్తిగా రాజకీయసమస్య అయిపోయింది. ఈ పరిస్థితిలో కాంగ్రెస్ ఏమి చెయ్యాలి? హిందీని, ఇంగ్లీషును గురించి పూర్వపు వైఖరితోనే వుంటుందా? రాజకీయంగా ఇంకా దెబ్బతినవలసివస్తుందేమో? కొత్త వైఖరిని అవలంబిస్తుందా? హిందీభాషేతర రాష్ట్రాలలో ఏమవుతుందో? అందుకే కాంగ్రెస్ నాయకత్వంలో నేమి, కేంద్ర ప్రభుత్వ నాయకత్వంలోనేమి, 'ఒక్క

భాస' పోయి 'రెండు భాస'లు విన్పిస్తూ వచ్చాయి. ఒకరు త్రిభాషా సిద్ధాంతమే తమకు ఇష్టము, అదే అమలు జరగాలని తాము ఆశిస్తున్నాము అనిఅంటే, ఇంకొకరు మూడు భాషలను పిల్లలు నేర్వడం కష్టం; వారికి ఆ భాషలు బరువు అయిపోతాయి— అంటున్నారు. ఇంగ్లీషును ఫలానా కాలంలోపల తొలగించాలని ఎవ్వరూ అనడంలేదు అంటూనే, న్యాయ స్థానాలలో, ఉన్నత విద్యలలో ఇంగ్లీషును తొలగించి ప్రాంతీయ భాషలను తెచ్చిపెట్టాలని చూస్తున్నారు. ఇచ్చట ఇంగ్లీషు అధికార భాషగా వుండాలా, వుంటే ఎంత కాలంవుండాలి-అన్న వివాదం అడుగునపడి, ఏది బోధనా భాషగా వుండాలి అన్నది వివాదమై పైకి వస్తున్నది. ఈ మార్పును తెచ్చిపెట్టడంలో కేంద్రంలోని ఆలో చనాపరులు, ఆలోచన లేకుండా వ్యవహరించలేదని అనడం తప్పు. ఒకప్పుడు భాషా వివాదానికి 'తీవ్ర జ్వరం' వచ్చినంత పని అయినప్పుడు కాంగ్రెస్ పెద్దలే కేంద్ర సర్వీసు కమిషన్ పరీక్షలు రాజ్యాంగం ఆమోదించిన 14 భాషలలోను జరగాలి అన్నారు. ఈ అనడం ఏమిటి? ఇది భాషా సమస్యను పరిష్కరించే మార్గమా? దాన్ని ఇంకా అరణ్యంగా తయారుచేసే మార్గమా? రెండు భాషలతో మాత్రం నడుస్తూ వున్న వివాదం ఇప్పుడు బహుభాషల కలదిగా తయారై పోయింది. అయితే ఆ జరిగిన ఆలోచనలో—అనంతర విధానాలకు, లేక విధానప్రాణాలకు బీజావాపం జరిగింది. దానియొక్క పరమ పరిణామమే అధికార భాషా వివాదం, 'లింకు' భాషా వివాదంగాను, 'లింకు' భాషావివాదం 'బోధనాభాషా' వివాదంగాను రూపుకట్టింది. అంటే అదివరకు పరిమితక్షేత్రనిష్ఠమైవున్న భాషా వివాదం ఇప్పుడు అపరిమిత క్షేత్ర నిష్ఠమై సంకులమై, విపరీత ధీ విశేషంగా మారిపోయింది.

అంతా మామూలుగావుంటే, ఈ మార్పును దేశం ఎట్లా పరిగణించేదో ఇప్పుడు చెప్పలేము. ఎందుచేతనంటే, ఇప్పుడు ఈ పరిస్థితిలో కొత్త తుఫాను చెలరేగింది. కేంద్ర మంత్రిమండలిలో భాషాసమస్యపై ఏమి నిర్ణయాలు జరిగాయో, ఏమి జరగలేదో తెలియదు. కాని ఈ భాషా విధానంపై అభిప్రాయభేదాలు కారణంగా చెప్పి—ఒకప్పుడు విద్యామంత్రిగా వున్నవాడు, ఆ తర్వాత విదేశాంగ మంత్రిత్వశాఖను నిర్వహించినవాడు, శ్రీ చాగ్లా ఆ మంత్రిమండలినుంచి రాజీనామా ఇచ్చారు. సెప్టెంబరు 5న ఆయన ఈ పని చేశారు. ఆ సందర్భంలో ఆయన ప్రధానమంత్రికి వ్రాసిన ఉత్తరంలో కొన్ని విషయాలు పేర్కొన్నారు. అవి నిజంగా చరిత్రాత్మకమైనటువంటివి. ఎందుచేతనంటే, ఇంగ్లీషు స్థానాన్ని హిందీ ఆక్రమించరాదనేవారిలో ఆయన ఒక్కడు కాదు. కాని ప్రభుత్వం అనుసరిస్తున్న విద్యావిధానం, భాషా విధానం దేశం యొక్క ఐకమత్యానికి భంగపాటు తేగలదన్న అభిప్రాయం ఆయనకు కల్గింది. ఇచ్చట గ్రహించవలసిన విషయం ఇది. ఇంతవరకు అధికారభాషా వివాదంగా వుంటూవున్న వివాదం విద్యావిధానవివాదంగా మారిపోయింది. న్యాయస్థానాలలో ఉపయోగించవలసిన భాష ఏమిటన్న తగాదాక్రింద రూపుకట్టింది. అంటే వివాదక్షేత్రం పైన పేర్కొన్నట్లు విస్తృతం అయిపోయింది. సూటిగా జరగవలసిన పనులు, డొంకతిరుగుడు పద్ధతులలో పడ్డాయి. హిందీని 'లింకు'భాష చేయాలంటే, ప్రాంతీయభాషలను రెచ్చగొట్టాలి. ప్రాంతీయభాషలను రెచ్చగొట్టడంవలన ఏర్పడగల అవ్యవస్థలో హిందీని తెచ్చిపెట్టవచ్చు ఇదీ తెలిసిగాని, తెలియకగాని జరుగుతున్న ఆలోచన. దానిని శ్రీ చాగ్లా తమ రాజీనామాలో బట్టబయలు చేశారు. తాను విద్యామంత్రిగా వున్నప్పుడువున్న విధానాలకు, ఇప్పటి విధానం తల్లక్రిందులుగా వున్నదని గూడా ఆయన వాదించారు. ఆ 'తల్లక్రిందులు' కావడం సంగతి ఎట్లావున్నా, శ్రీ చాగ్లా రాజీనామా, ఆ రాజీనామా ఇస్తూ ఆయన వ్రాసిన ఉత్తరం దేశంలో భాషలకు సంబంధించిన అసలు సమస్యలను ప్రజలముందు— మేధావివర్గంముందు వుంచాయి.

ఇప్పుడు మేధావులంతా యీ భాషల విషయంలో ప్రభుత్వం చేస్తున్న ఆలోచనలను విమర్శిస్తున్నారు. ప్రకటనలమీద ప్రకటనలు జారీ చేస్తున్నారు. కాని ప్రభుత్వం యీ రకమైన విధానాన్ని గురించి కొంత కాలంగా ఆలోచిస్తూ వుంది. పార్లమెంటు సభ్యుల సంఘం సిఫార్సులు బయటికి వచ్చిన దగ్గరనుంచి గాలి ఏటు వీస్తున్నదీ తెలుస్తూనే వుంది. అప్పుడు వీరంతా ఏమి చేశారు? ఒక్కరైనా గట్టిగా మాట్లాడిన పాపాన పోలేదు. విద్యామంత్రుల సభ జరిగింది. విద్యామంత్రి ప్రభుత్వ విధానంయొక్క స్వరూపం ఇట్లా వుంటుందని పదే పదే వివరిస్తూ

వచ్చారు. ఆయన ప్రసంగాలలో ప్రాంతీయ భాషలు, హిందీయే ప్రాముఖ్యం వహిస్తూ వచ్చాయిగాని, ఇంగ్లీషును గురించి ప్రసక్తి పెద్దగా ప్రాముఖ్యం వహిస్తూ వచ్చిన ధోరణి గోచరం కాలేదు. ఆయన త్రిభాషా సూత్రాన్ని కాదన్నారు. ఇంగ్లీషును వట్టి 'లైబ్రరీ' భాష స్థాయికి నెట్టివేశారు. ముందు 'లింకు భాష' సంగతి ఏమో తేల్చకుండ, ఇట్లా ప్రాంతీయ భాషలను, హిందీని పైకెత్తి వ్యవహరించడంలో ప్రభుత్వం విధానంలో మార్పు వస్తున్నట్లు విశదం అయిపోతూ వచ్చింది. అయినా, మన మేధావులలో ఏ కొందరో తప్ప అందరూ ఈ విషయాన్ని తీసుకొని ఇది ఇట్లా అని దేశం ముందుగాని, దేశ ప్రజముందుగాని వుంచిన పుణ్యాన పోలేదు. సామాన్య ప్రజకు ఈ జరుగుతున్న పనిలోవున్న దోషమో, దోషముకానితనమో ఏది ఏమో అర్థం కాలేదు. ఇప్పుడు చాగ్లా రాజీనామాతో ఇన్ని విషయాలు బయటికి వచ్చాయి. మేధావులు మనస్సు విప్పి మాట్లాడుతున్నారు. ఇప్పుడు భాష విషయమై – విస్తృతమైన, నిజమైన చర్చ జరిగే సావకాశం ఏర్పడింది.

ఇప్పుడు దేశంముందు – ఈ భాషకు సంబంధించి వున్న సమస్యలు ఇవి : ఉన్నతవిద్యకు – అనగా విశ్వవిద్యాలయ స్థాయిలో విద్యలకు – బోధనాభాష ఏది? 'లింకు' భాషగా దేనిని గుర్తించాలి? ఇంగ్లీషు స్థానం ఏమిటి? ఇప్పుడు దేశంలోవున్న పరిస్థితులదృష్ట్యానేగాక, దేశం యొక్క శ్రేయస్సు, ప్రయోజనముదృష్ట్యా ఈ వ్యవహారంలో ఎట్లా నిర్ణయాలు చేసుకుంటే బాగుంటుంది? ఇవి వట్టి అషామాషీ ప్రశ్నలు, అషామాషీ సమస్యలు కావు. దేశంలో ప్రతిఒక్కరు ఆలోచించి ఒక అభిప్రాయానికి వచ్చి, మా అభిప్రాయం ఇది అని బల్లగుద్ది ఆ అభిప్రాయాన్ని వ్యక్తం చేయవలసి వుంది. కేంద్ర విద్యామంత్రి తాము, ఈ వ్యవహారంలో విద్యావిధానం విషయంలో ఎడ్యుకేషన్ కమిషన్ – నిక్షంచేసిన పద్ధతుల ప్రకారమే పోతున్నాము అంటున్నారు. అది నిజమే కావచ్చు. కాని ఆయన చెబుతున్న మాటలకు, ఇంకా అధికారంలోవున్న ఇతరులు చెబుతున్న మాటలకు 'ఎడ్యుకేషన్ కమిషన్' చెప్పిన మాటలకు కొంత తేడా కన్పిస్తున్నది. భాషావిధానం ఎట్లా వుండాలి? అన్న విషయాన్ని తీసుకొని ఆ కమిషన్‌వారు కొంత వ్రాశారు. సంఘంలోను, జాతిలోను గూడా ఐకమత్యాన్ని ప్రోదిచేసి, ఆ ఐకమత్యానికి, సాంఘికఏకీకరణకు, జాతి ఏకీకరణకు దోహదాన్ని చేకూర్చగల విధంగా అందుకు ఉచితమైన, అర్థమైన భాషా విధానాన్ని పెంపొందించుకోవలసిన అవసరం వున్నదని ఎడ్యుకేషన్ కమిషన్‌వారు తమ నివేదికలో స్పష్టంగా పేర్కొనివున్నారు. దేశంలో ఇంగ్లీషు అధికసంఖ్యాకులకు 'లింకు'భాషగా, లేక 'అనుసంధాన' భాషగా ఉపయోగపడదని అంగీకరిస్తూనే, 'పాఠశాల దశ నుంచీ ఇంగ్లీషు అభ్యాసాన్ని, అధ్యయనాన్ని ప్రోత్సహిస్తూనే వుండాలని' చెప్పారు. వారు వ్రాసిన వాక్యం ఇట్లా వుంది. 'The teaching and study of English must continue to be promoted right from the school stage'. ఇక్కడ వాడిన క్రియాపదం విధిని చెబుతున్నది. అంతేగాక 'English will serve as a link language in higher education for academic work and intellectual intercommunication' అని కూడా వారు చెప్పారు.

అదేవిధంగా బోధనాభాషనుగురించి చేసిన సిఫార్సుల సందర్భంలో ఎడ్యుకేషన్ కమిషన్‌వారు చెప్పిన మాటలను గమనించవలసివుంది. ఎడ్యుకేషన్ కమిషన్ నివేదికలో పదకొండవ అధ్యాయం ఉన్నతవిద్యకు సంబంధించివుంది. ఆ అధ్యాయంలో 65 వ పేరా మొదలు 78 వ పేరాదాకా బోధనాభాషను గురించి చెప్పబడి వుంది. ఆ పదునాల్గు పేరాలలోను తొమ్మిది పేరాలలో ఇంగ్లీషుయొక్క ఆవశ్యకతను గురించే ఆ కమిషన్ వారు ప్రస్తావించివున్నారు. మరి ఇప్పుడు ఆ భాషకు వట్టి 'లైబ్రరీ' భాషాస్థాయిమాత్రం ఇచ్చి, వ్యవహరింప చూడటంలో అర్థం ఏమిటి? ఎడ్యుకేషన్ కమిషన్ వారేమో ప్రాంతీయభాషలను బోధనాభాషలుగా చక్కనొత్తడానికి పది సంవత్సరాల గడువు విధించారు. పైగా తమ యీ సిఫార్సులను అమలుపరచడానికిగూడా ఈ కమిషన్‌వారు ఒక మార్గాన్ని, ఒక పద్ధతిని నిర్దేశించారు. 'The U. G. C. and the Universities should work out a programme for the adoption of these recommendations suitably for each University or group of Universities. The changeover should be completed within ten years' అన్నారు. అంతేగాక 'All

India Institutions should continue to use English as the medium of instruction, అని గూడా స్పష్టం చేశారు. ఇంకా ఇట్లా అన్నారు: 'The eventual adoption of Hindi should, however, be considered in due course, subject to certain safegaurds.'

## 8

ఇప్పుడు పనులు ఎడ్యుకేషన్ కమిషన్ చెప్పిన పద్ధతిలో సాగుతున్నాయా? వారు చెప్పిన 10 సంవత్స రాలు 5 సంవత్సరాలుగా మారిపోయే ప్రమాదం ఏర్పడుతున్నది. పైగా ఇక్కడ యు. జి. సి. కి గాని, విశ్వవిద్యాలయాలకుగాని ప్రాజాపత్యం ఏమీవున్నట్లు కన్పించడంలేదు. మేధావులతో, విద్యావేత్తలతో ఆలో చించడంలేదు. ముందు నిర్ణయాలు చేసుకొని, తర్వాత ఆలోచిద్దామనుకునే పద్ధతివల్ల లాభం వుండదు. ఇది రాజకీయాలకు, ఆ రాజకీయాలలోని 'హెచ్చుకుందు లకు' విషయంకాదగిన సంగతికాదు. ఇప్పటి ప్రజల సంగతేనేగాక, ముందు తరాలవారినిగూడా దృష్టిలో పెట్టుకొని వ్యవహరించవలసివుంది. ఈ వ్యవహ్రాతిలో మనము, మన భాషలు చెందివున్న అభివృద్ధి సంగతిని గూడా పరిశీలన చేసుకోవలసివుంది. ఇటీవల మద్రాసు విద్యార్థులు కొందరు ప్రధాన మంత్రిని కలుసుకొని ఒక ప్రశ్న వేశారు. 'మీకు హిందీ ముఖ్యమా? భారతదేశ ఐకమత్యం ముఖ్యమా' అని. ఈ ప్రశ్నలో ఒక్కమద్రాసు విద్యార్థుల అభిప్రాయమేగాక, విద్యా వంతులలో అధికసంఖ్యాకులైనవారి అభిప్రాయం వ్యక్తం అవుతున్నదని చెప్పవలసివుంది.

ఆ విద్యార్థుల యీ ప్రశ్నకు ప్రధాన మంత్రి ఇచ్చిన సమాధానాన్నిగూడా ఇచ్చట చూడవలసివుంది. ఆమె ఇట్లా అన్నారు: 'You can do whatever you like if you think the good of Tamilnad is seperate from the national outlook.' ఈ మాటలకు అర్థం ఏమో ప్రధానమంత్రే చెప్ప వలసివుంది. కాని దేశంలో భాషాసమస్య పరిష్కారానికి గాని, లేక ఆమెయే ఇంకో సందర్భంలో "The maintenance of the unity of the country in the midst of diversity is an essential ingredient of our policy' అని అన్న మాటకు గాని అనుగుణంగాలేదు.

హిందీని ఎవ్వరూ తెగడటంలేదు. ఇంగ్లీషును భూషించడములేదు. కాని ఇప్పుడు మన దేశంలోని భాషలు, హిందీతోసహా— ఇంగ్లీషు స్థానాన్ని ఆక్ర మించుకొని, ఆ భాష ఈ దేశానికి సాధించిపెడుతూ వున్న ప్రయోజనాన్ని సాధించపెట్టగల స్థితిలో వున్నాయా? ఇంగ్లీషు కూడా 'లింకు' భాషగా, బోధనాభాషగా వున్నందువల్ల దేశానికి వచ్చిన నష్టం ఏమిటి? వట్టివృథాదురభిమానంకాకపోతే ఇంగ్లీషును వద్దనడంలో అర్థం వున్నదా? ఆ భాషవలన మనదేశం యొక్కగాని, ప్రజలయొక్కగాని స్వప్రయోజ నాలు ఏమన్నా దెబ్బతిన్నాయా? పైగా ఇప్పుడు ప్రపంచంలో అనేక రాజ్యాలు ఇంగ్లీషును విధిగా విద్యార్థులచేత అభ్యసింప చేస్తున్నాయి. ఇందుకు కారణం ఏమిటో మన విధాన నిర్ణేతలు ఆలోచించారా? ఇప్పుడు ఇంగ్లీషును వదిలి పెట్టామే అనుకోండి, అప్పుడు విద్యాప్రమాణాలను సంరక్షించుకొనడం సాధ్యం అవుతుందా? ఇవి అన్నీ ఇప్పుడు ముఖ్యంగా ఆలోచించు కొనవలసిన ప్రశ్నలు. ఇచ్చట తాత్కాలికమైన రాజ కీయ ప్రయోజనాలు, ఉద్యోగావకాశాలు మొదలైన అల్పవిషయాలు దృష్ట్యాగాక భారతదేశం భవిష్యత్తును, విద్యారంగం భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని మరీ వ్యవహరించవలసి వుంటుంది. భాషాభేషజాలతో గాక నిరుద్రిక్తమైన మనస్సులతో ఆలోచించవలసి వుంటుంది.

---

## కలగూరగంప:

# తరువోజ పుట్టుక

మన ప్రాచీన సారస్వతములో జానపద సాహిత్యము గూడ కొంత ఉన్నది. దానిని గమనించినచో, మార్గ పద్ధతి రచన కొంచెము వేరూని నిల్ద్రొక్కుకొనుటకు ఆ జానపద సారస్వతముయొక్క ఉనికి గూడ కారణమై యుండునని ఊహించుట అపచారము గాదనుకొందును. తరువోజ పుట్టుకను గూర్చి అలాక్షణికముగాని పద్ధతిలో ఊహించగా ఏర్పడిన భావమును ఇచ్చుట మనవి చేయుదును. అనుగ్రహింతురు గాక!

ఈ క్రింది స్త్రీల పాట—జోలపాట—అనాదిగా వాడుకలో ఉన్నట్టిది:

'బూచివాడా! రార, బుట్టల్లుకొని
బుట్టలో అమ్మాయిని పెట్టేసుక పోర!
లొడలొడాలొట్టే తాటాకుల బుట్టే
మీ యత్త మెడ గట్టి ఊరెళ్లగొట్టే.
దోర దోరల పండు దొ రరటిపండు
పచ్చ దోరల పండు పాపాయి మాకు.
అందరి మామలూ చందమామల్లు;
అమ్మాయి మామల్లా రామలక్ష్మణులు!
చిలకల్లు చెలరేగి జీడి కొమ్మెక్క—
అమ్మాయి చెలరేగి మామ బుజ మెక్క!
మామ బుజ మెక్కుతూ మామ నే మడుగు?
పాల్దాగు గిన్నదుగు, పాడావు నడుగు!
హాయి! మా యమ్మాయి నీళ్లు దె బోతె,
నీళ్లారి కన్నెలూ తోడుందు రమ్మా!
హాయి, హాంబా, హాయి! ఆపదలు గాయి!
చిట్టి తల్లిని గాయి! శ్రీరంగశాయి!'

ఇది 'మంజరి' అనదగిన ఒక రకపు గేయము. 'మంజరి' అనగా 'పూగుత్తి' అని యర్థము. ఇది యొక పద్యము పేరు. కాని దీనిని పద్యమనుట కన్న, పాట అనుటయే సుఖము! ఇప్పటికిని ఎన్నో పాటలు దీని ఛాయలో నడచుట గమనింపవచ్చును. (cf. యెంకి పాటలు)...దీని కిని పాదములని నియమము లేదు; ఒక్కటి మొదలు ఎన్నియినను ఉండ వచ్చును!

ప్రాచీన కాలమున గేయముగానుండి, పద్యముల జాబితాలోనికి రాని కారణమున నేమో, ఆది లాక్షణికుడగు రేచన ఈ మంజరిని చెప్పినట్లు లేదు! విన్నకోట పెద్దన, లక్షణముమాత్రముచెప్పి వదిలినాడు. అనంతుడు, మంజరి అనగా ప్రాసములేని ద్విపద అని, పద్యపు ముద్రవేసి దానిమీద పండిత కవులచూపు నిలుచునట్లు చేసినాడు!

దీనికి ప్రాసయతి పనికి రాదనుట ఒక నియమము. యతియే ఉండవలెను; ప్రాసమక్కర లేదు! మనకు—తెలుగు వారికి—పెద్ద సమాస కల్పనములపై గల ప్రీతి, గొప్ప భావ కల్పనములపై లేదనుట—కాదుగాని, తక్కువ యనుట—సాహసము గాదు! అందువలన అట్టి సమాస కల్పనము ఒక్కపాదముకంటె మించరాదనియు, ఒక్క శబ్దమును కొంచెము పై పాదము చివర, కొరవ తరువాతి పాదము మొదట ఉంచరాదనియు రెండవ నియమము, అనంతుడు చేసినది! గానయోగ్యముగా నుండవలయు ననుట లక్షణసార సంగ్రహకర్త చేసిన సూచన! అంత్యప్రాసము పెట్టవలెనని అప్పకవి చెప్పినాడేగాని తా నసలు పాటించలేదు!

'ప్రాసంబు లేని ద్విపదయై చెలంగు
బ్రాసంబు తుదలందుఁ బదిలంబు చేసి'

(అప్ప. IV, 281.)

అప్పటమైన జానపదగేయమును ఇందరు లాక్షణికులు ఇన్ని తిరువీథు లూరేగించి పద్యమనిపించిరి!

అస లింతకంటెను ముఖ్యమైన మార్పొకటి జరిగినది. మాత్రాగణములను దీసివేసి సూర్యేంద్ర చంద్రగణములను నియమించుట—పాటలను పద్యములుగా జేయుటకు మన లాక్షణికులు చేసిన మొదటి చట్టము!

సూ ర్యేంద్ర చంద్రగణములు మాత్రాగణములకు సన్నిహితములే అయినను, మాత్రాగణము లన్నియు సూర్యేంద్ర చంద్రగణములుగావు. మాత్రా గణముల పుట్టుక నైసర్గికము; సూర్యేంద్ర చంద్ర గణములపుట్టుక లాక్షణికము!

వీని వివరము చూతము—

మాత్రా గణములు:—

(1) మూడు మాత్రల గణము, త్రిమాత్రాకము. ఇవి మూడు: గలము, లగము, నగణము.

(2) నాలుగు మాత్రల గణము, చతుర్మాత్రాకము. ఇవి ఐదు: గగము, నలము, భ-జ-స గణములును.

(3) ఐదు మాత్రల గణము, పంచమాత్రాకము. ఇవి ఎనిమిది:

భల-జల-సల-నగ-త-య-ర-నలల-ములు.

ఇవి ముఖ్యమైనవి. ఇట్లే షణ్మాత్రాకములు, సప్తమాత్రాకములును గలవు. వానిని ఇట్లే చూచుకొనవచ్చును. ఈ గణములతో ఏర్పడునవి రగడలు—వైతాళీయ భేదములు—అనగా గేయములు.

ఇంక, సూర్యేంద్ర చంద్రగణములు:—'రెండు, మూడు, నాలుగు ఛందములను ప్రస్తారముచేసి, ఆ ఛందముల తొలి మలి బంతులను వదలి, తరువాతి చాళ్లలోని వానికి—మొదట లఘువు గలవానికి మరల మొదట ఒక లఘువు చేర్చినచో, క్రమముగా ఆ మూడు ఛందములు, సూర్యేంద్ర చంద్ర గణము లగును.'

['ద్వి త్రి చతు ర్గురు భవములు
ధాత్రీధర! రెండు మడఁప దక్కిన గణముల్
మిత్రేంద్ర చంద్రు లనంజను
మాత్రాది గణంబు మొదల మాత్ర లిడంగన్.
—ఛందో. I, 18.]

రెండవ ఛందము—ప్రస్తారము:

{ U U
| U }
U |
| + | |

గలము, నగణము—ఇవి సూర్యగణములు. ఇవి రెండును త్రిమాత్రాకములే అయినవి. లగము ఇందులో చేరలేదు. (ఇది ఎదురు నడుచునది!)

మూడవ ఛందము—ప్రస్తారము:

{ U U U
| U U }
U | U
| + | | U
U U |
| + | U |
U | |
| + | | |

ర—నగ—త—సల—భ—నల — ఇవి ఆరును ఇంద్రగణములు. వీనిలో రెండు చతుర్మాత్రాకములు; నాలుగు పంచమాత్రాకములు! కాబట్టి గతిలో కొంత క్షతి యేర్పడును. అనగా సామ్యము దెబ్బతిన్నది!

ఈ కారణముచేతనే కొందరు కవులు, ప్రస్తుతమైన మంజరియందు, 'భ—నల'ముల స్థానములందు పంచమాత్రాకములగు 'భల—నలల'ములను గూడ ప్రయోగించి సరిపుచ్చిరి. అందువలన నడకలో హాయి కుదిరినది! చూడుడు—

(1) '...పండ్ల బరువులు వీపుపై మోచికొనుచు
... ... ... ...
అంతదనుకను నేను నఱికాళు లరగ...'
—కీ. శే. 'కవికోకిల' దువ్వూరి.

(2) '...చెట్టుకొన కొమ్మపై చివురు జొంపాల...'
—శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి.

ఈ విధముగా మధ్యాక్కరయందును నే నిట్టి ప్రయోగముచేసి దాని సోయగము గమనించియున్నాను:

(3) 'తోరముగఁ బుట్టించెదవు చ
తుర్ముఖమునఁ గోరికలను,
... ... ... ...
తిఱుతువు వానిని జివర...'
—'శ్రీ వేంకటేశ్వరము'నుండి.

కాబట్టి హాయి గూర్చు నడకకు సూర్యేంద్ర చంద్రగణముల ప్రయోగముకంటె మాత్రాగణముల కూర్పే మేల్తరమని తెలుచున్నది!

నాలుగవ ఛందము—ప్రస్తారము :

```
    U U U U }
    | U U U }
    U | U U
| + | | U U
    U U | U
| + | U | U
    U | | U
| + | | | U
    U U U
| + | U U
    U | U
| + | | U
    U U |
| + | U |
    U | |
| + | | |
```

రగ—నగగ—త్రగ—సలగ —భగురు—నలగ—మలఘు – సగల– రల – నగల–తల – సలల-భల-నలల-ములు, ఇవి పదునాలుగు చంద్రగణములు. వీనిలో పంచమాత్రాకములు రెండు మాత్రమే; షణ్మాత్రాకము లారు; సప్తమాత్రాకము లారు. ఇట్టి సాంకర్యమువలన పద్యములందు వీని వాడుక పోయినట్లున్నది; అనగా వీనివలన అసలాపద్యములు ప్రయోగ దూరము లైనవేమో అని అనుమానము కలుగుచున్నది! ఇట్టి విషమ గణ ప్రయోగమున ఆ పద్యముల నడక 'నచ్చు' అయి, ఎట్లు తచ్చాడ వలసి వచ్చునో కొన్ని అక్కరలు చూచిన తెలియగలదు. (చూ. నా వ్యాసము, 'అక్కరల నడకలు'—భారతి మే, 1965). అయిన నేమి? సూర్యేంద్ర చంద్రగణములనే చట్టము అంగీకరించినది!

పాదమునకు మూడు పంచమాత్రాకములు, ఒక త్రిమాత్రాకముగల జానపదగేయము (cf 'కర్ణాట చతుష్పద')ను సంస్కరించి, మూడు ఇంద్రగణములు, ఒక సూర్యగణముగా లెక్కించి, యతి అతుకు తప్పక ఉండవలెనని నియమముచేసి, దానికి 'మంజరి' అని పేరుపెట్టి పద్యముల జాబితాలోనికి లాగిరి! ఇది, ద్విపద తరువోజలకు మూలమైనది.

ఒక్కపాదము మొదలు ఎన్నిపాదముల వరకైనను దీనిని సాగదీయవచ్చు నౌనగానే, ఇదేమి పద్యమన్న సందేహము వచ్చినది! పద్యమునకు నాలుగుపాదములే ఉండవలెనన్నది లాక్షణికుల సామాన్యశాస్త్రము. దీనికి మినహాయింపన్నను, ఇదెక్కడి స్వేచ్ఛ? ఇంక; బుఱ్ఱకథలకును దీనికిని భేదమేమి?

అంతేగాక, పండితకవు లెవ్వరును దీనిని ప్రయోగింపరైరి. ప్రయోగించినను, పుస్తకమంతయు దీనినే వ్రాసి, చివర జంగం కథల వరుసలోనో, యక్షగానముల బంతిలోనో నిలిపిరి! స్త్రీల పాటల యీనడింపున కగ్గము చేసిరి! పద్యముల నడుమ పద్యముగా దీనిని వాడుట కెవరికిని—పల్నాటి వీరచరిత్ర రచించిన కవివీరునకు గూడ—గుండె చాలలేదు!

కాని, జానపదులుమాత్రము దీనిని వదలలేదు. పద్యమన్నను, పాట యన్నను—అనుట యెవరికి కావలె? వారికి చింతలేదు. లయాన్వితమైన నడక చెడనిక స్వేచ్ఛగా వాడుకొనిరి. నడక చెడుచోట వ్యాకరణము నైన తొలగించి సరిగా నడపిరి. యతి, పడినచోట పడును. ప్రాస యతియా? ప్రాసమా?—ఆ చర్చ లేదు! అది ఐచ్ఛికము. ఇంత అమాయిక మగు గేయమును పండితులు పట్టుకొని దానిని మంజరిని చేసిరి! ఐతే దీనికి తెంపుచేసి కొందరు కవులు—ఇటీవల వారు చాలమంది-ప్రాసయతినిగూడ చేర్చిరి.

దీనికే ప్రాసముపెట్టి—రెండు పాదములకొకటి—'ద్విపద' అనిరి. అప్పుడైనను 'ద్విపద కావ్యములు' వెలసినవేగాని పద్యముగా దీనిని వాడిన నాథుడు లేడు! మంజరికిగాని, ద్విపదకుగాని పద్యముగా గుర్తింపు రాలేదని కాబోలు దీని నింకను సంస్కరించవలెనని తలంచియుందురు. ఐతే దీనిని వదలుటకు మాత్రము ఇష్టపడరైరి! మరి ఇదేమి సామాన్యమైన ఒయ్యారము కలదా? దీని నడకతీరు చూచి మురిసిపోని తెలుగు కవి లేడనుట 'అతిశయోక్తి' కాదు. కాని యిది స్వైరవిహారిణి! ఎంతదూరము పోవునో తెలియదు. కాబట్టి కాలికి బందమువేసి గెంటించవలె; అప్పుడది పద్యము కాగలదు! అనగా, నాలుగవ పాదముతో నడక చాలించవలె. ఐతే ద్విపదను చతుష్పదను చేయుట బాగుండదు; పేరుమార్చి, అష్టదిగ్బంధనము చేయవలె! ఎట్లు? ఈ ప్రయత్న ఫలితమే 'తరువోజ!'

'తరువోజ' యెప్పుడు మరల వాడుకమండి

తొలగిపోయినది! ఐతే దీని వాడకము అప్పుడుగూడ నక్కృత్తే. నన్నయకాలములోను, అంతకుపూర్వమును దీనికి మంచి ప్రచార ముండియుండవచ్చును; అట్లని ఊహించుటకు తగిన అవకాశము లున్నవి. పూర్వము, స్త్రీలు దంపుడు పాటలుగా ఈ పద్యాలు పాడుచుండి రని విన్నకోట పెద్దన చెప్పుచున్నాడు :

'తలకొని తగఁ బ్రాలు దంపెడిచోటఁ
దరుణులచే సొంపుదనరుఁ దర్వోజ.'

(కావ్యాలం. అష్ట.)

ఈ సందర్భమున ఒక చిన్న దంపుడుపాట చూతము :

'తమల పాకుల మీాద వడ్లెండ బోసి
ఆ వడ్లు ఈ వడ్లు బస్తారి కెత్తి
అత్త దంచిన వడ్లు అధిక సన్నాలు
మామ దంచిన వడ్లు మల్లె సూదుల్లు.'

ఈ గేయమును శాస్త్రదృష్టితో చూచినప్పుడు అన్వయక్లేశమేగాక, వ్యాకరణ దోషములు, యతి ప్రాసల అతుకులు లేకుండుట గోచరించును. గేయము లందు యతిప్రాసలు ఐచ్ఛికములు; అలంకారిక ములును! చక్కని లయ—నడక, గేయములో ముఖ్యము. ఈ పాట, ప్రకృతిసిద్ధమైన సెలయేటి నీరైనను తీర్థము కాకపోయినది! అందువలన గణ నిర్ణయము, యతిప్రాసల నియతి మొదలుగా అష్ట దిగ్బంధనముచేసి పద్య మనిపించవలసివచ్చినది! గేయ ముగా స్వేచ్ఛావిహారము వదలి, వినమ్రభారావనత వదనమై పెండ్లి నడకతో తచ్చాడవలసిన 'గతి' తరువోజకు పట్టినది!

సూ ర్యేంద్ర చంద్రగణములలో చెప్పవలె; యతి యుండవలె; ప్రాసయతి పనికిరాదన్న శ్రేష్ఠము; ప్రాసము తప్పదు; నాలుగు పాదములే యుండవలె — అప్పుడది పద్య మగును! ఇన్ని సంస్కారములుచేసి మంజ రిని, తరువోజను చేసినారు మనవారు.

రెండు మంజరి పాదము లొక తరువోజ పాదము. 1, 3, 5, 7 గణారంభములందు ఒకే యతి; ప్రాసయతి పనికిరాదు. ప్రాస నియమము గలదు. నాలుగు పాదములు. ఇదీ తరువోజ స్వరూపము :

ఉదాహరణము :

'సురరాడ్గణిత్రయి—సూర్యుతోఁ గూడి
జోడయ్యు యతు లిరు—చోటుల నిటులు
గరిమతో రెండేసి—గణముల మీాదఁ
గలయ నొక్కొక యంఘ్రి గా నమరించి
చరణముల్ నాలుగు-సమకొనఁ జేసి
సత్కవిచంద్రులు—సరసు లొనరఁగ
మరుదీశ సుతుఁడైన-మరుదాత్మభవుని
మహిమ నెన్నుదురు నె—మ్మదినిఁ దర్వోజ.'

(ల. సా. సం., II.)

తమ పద్యముల నడుమ దీనిని వాడుకొని మంజరి తోడి పొందు లభించినట్లు తృప్తిపడినారు మనప్రాచీన కవులు!

'ఈ విల్లు మోపెట్టి-యేను బాణముల
నీ యంత్ర మత్స్యంబు—నేసిన వాఁడ
భావజప్రతిముఁ డి—బ్బాలకుఁ దగిన
పతి యిది మునిశక్తిఁ-బడసిన విద్య
గావున నీా రిప్డు—గావింపుఁ డిదియ
ఘనతర కార్ముక-కౌశలోన్నతియు
లావును గలవార-లకు నవసరము
లలిత యశంబుఁ గ-ల్యాణంబుఁ బడయ.'

(భార. ఆది. VII, 170.)

పై పద్యములందు, ఇంద్రగణస్థానములందు చతుర్మాత్రాకములుపడినప్పుడు నడకలోగల కుదింపు గమనింపవచ్చును. వానిని పంచమాత్రాకములు చేసు కొని చదివినప్పుడు ఏర్పడు హాయియు పరిశీలింప వచ్చును :

ఈ విధముగా ఈ పద్యమును గూర్చి ఆలోచించి నప్పుడు దీని నామకరణముం గూర్చిన జిజ్ఞాస యొకటి తలయెత్తును. 'తరువోజ' అనగా అర్థ మేమి? దీని కీ పేరెట్లు సార్థకము?

'తరువోజ' అని, 'తర్వోజ' అనియు రెండు రూపములు గలవు.

[చూ. 'తర్వోజ'—కవిజ. జాత్య.,
కావ్యాలం. అష్ట.,
ఛందో. III.,
ల. సా. సం. II.,
'తరువోజ'—అప్ప IV, 274; 260.

పద్యములందుగాక విడిగాను, శీర్షికలందు పేర్కొను నపుడును 'తరువోజ' అనియే లాక్షణికు లందరును చెప్పిరి. అప్పకవి, పద్యములందును 'తరువోజ' అని పేర్కొనెను.]

'తరువు' అనగా, సంస్కృతమైనచో, 'చెట్టు' అని యర్థముగదా! తెనుగునందు, 'ఇయ్యవలసిన ధనాదికము నిమ్మనిచేయు నిర్బంధము.' (చూ. శబ్ద రత్నాకరము). తెనుగర్థము ఇక్కడ సరిపడదు.

[తరు=చెట్టు. ప్రథమా విభక్తి (ప్రత్యయ) లోపము. 'తరుపై'; 'తరుపండులు' శ. ర. అను బంధము—పుటలు 25; 51.]

'ఓజము-'జ్యోతిశ్శాస్త్రమునందు—'బేసి' అని యర్థము. (శ. ర). దీనికిని ఇచ్చట ప్రసక్తి కుదురదు.

'ఓజస్సు'-తేజము; బలము; ఉత్సాహము; వెలుఁగు; ఎండ. (శ. ర)

తరు+ఓజ-అని రెండును సంస్కృత పదములై సిద్ధసమాసముగా ఏర్పడినప్పుడు 'తర్వోజ' అను యణాదేశ సంధిరూపమే సిద్ధింపవలెను. సాధ్యసమాసమైనచో (తరువు+ఓజ), నుగాగమమువచ్చి 'తరువునోజ' అనియో, నుగాగమము రాకుండిన 'తరువోజ' అనియో అగును. వ్యవహార సిద్ధము 'తరువోజ'యే గాని, 'తరువునోజ' లేదు. (తరు+ఓజ=తరునోజ—యును లేదు.)

'ఓజస్సు'నకు వికృతి-'ఓజ్జ' (దంత్యజకారము) ఉన్నది. ఉత్సాహము; భయము దీని కర్థములు. 'ఓజ్జ' అనునది 'ఒజ్జ' (ఉపాధ్యాయుడు యొక్క రూపాంతరము గూడ నైయున్నది. (శ. ర) ఇదియు మనకక్కర లేదు.

'ఓజ్జ (దంత్యము) అని తెలుగు (దేశ్య) పదమొకటి యున్నది. క్రమము; విధము; స్వభావము; అజ్ఞ-అనునవి దీని కర్థములు. (శ. ర.)

'ఓజ' అనునది సంస్కృత పదమై సమసించెననుటకంటె, తెనుగుపదమై కూడెననుట యుక్తమని నా తలంపు. అనగా 'తరువోజ'లోని జకారము దంత్యమని నా యుద్దేశము 'ఓజ్జ' తెనుగుపదమైనప్పుడు'తరువు'తో'సమసించుటకునుసమర్థమగుచున్నది. మిగిలిన వానికంటెను ఇదే మేల్తరముగా తోచుచున్నది. క్రమము, విధము, స్వభావము అను నర్థములు తరువుతో కలియదగినంత (సమర్థములు)గా తక్కినవి గలియునట్లు స్ఫురించుటలేదు. కనుక 'ఓజ'—తెనుగనుట కొంత సుఖము!

తరువోజము, తర్వోజము—మొదలగు రూపములు మృగ్యములైనందునగూడ ఇది తాలవ్యజకారమని భావించుటకు వలనుపడకున్నది.

అంతేగాక, 'తరువోద' (చూ. కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 'తెలుఁగు మెఱుఁగులు'—'తెలుఁగు కవితలోని దేశితనము' అను వ్యాసము – పు. 36-B.) అను రూపాంతరముగూడ దీని కున్నట్లు పండితులు చెప్పుచున్నారు. 'జాదాదుల దాకు జకారంబు విభాషనగు.' (బాల. ప్రకీర్ణ. 21.) అని శాస్త్రము గనుక, 'తరువోద'యే మొదటిదై దానికి రూపాంతరముగ 'తరువోజ్జ' ఏర్పడినదేమో? ఓద్దె, ఓదియ (దేశ్యపదములు)—ఓదము (వికృతిపదము) అనునవి గలవుగాని వీనితో ఇచ్చట పొసగదు.

తరువుయొక్క ఓజ్జ (—క్రమము, విధము, స్వభావము) కలది తరువోజ, లేక తర్వోజ-అగునని నా యూహ. ఈ పద్యము తరువువలె కొంత విస్తృతి గలిగి రసజ్ఞులకు హాయిగూర్చునుగాన, దీని కిట్టి అర్థము చెప్పుట అసంగతము కాదనుకొందును. పెద్దలు దీనింగూర్చి విమర్శింతురని ఆశింతును.

'తర్వోజ' అనునది, 'తరువోజ'యొక్క రూపాంతరమేగాని, యణాదేశముచే ఏర్పడిన రూపముగాదు. ఇది ఆచ్ఛికము గాకపోయినను, మిశ్రసమాసమే అయినను, రేఫముమీది ఉత్వమునకు లోపము విభాషనైనది.

'విద్యారత్న' శ్రీ నిడుదవోలు వెంకటరావు, ఎమ్. ఏ. గారు వావిళ్లగారి కుమారసంభవమునకు పీఠిక వ్రాయుచు అందు 'తరువద' అనుపద్యములను నన్నెచోడుడు ఐదుచోట్ల వాడినట్లు పట్టిక యిచ్చి యున్నారు. దానికిముందు పంక్తిలోనే 'తరువోజ' అనుపద్యములు మూడుచోట్ల వాడబడినట్లు చెప్పి యున్నారు. పరిశీలింపగా, పై ఎనిమిది పద్యములును తరువోజలే! కాగా, ఆ నాటి వాడుక చొప్పున వ్రాయసకాండ్రు తరువోజను, తరువోదలనియో, తరువద అనియో వ్రాసుకొనియుందురు. అది అచ్చులో తరువదయేగాక, 'తరుపద' గూడ నైనది! లేక ద్విపద, త్రిపద, చౌపద, షట్పద అన్నట్లు దీనికి తరుపద అని వాడుకఉండెనా? 'తరువుయొక్క (వేళ్ల (లేక కొమ్మల)వలె విస్తృతమైన పాదములు గలది'-తరుపద-అయ్యేనేమో? అది విచారణీయము! తరుపదయే, తరువద (గసడదవాదేశము) అయ్యినుండ వచ్చునుగదా? దీనినిగూర్చి భాషాభిజ్ఞులు వివరించవలసియున్నది.

# లేఖలు

## "మనసులో మారుమూలలు"

ఆర్యా,

జూన్ భారతిలో బుచ్చిబాబుగారి 'మనసులో మారుమూలలు' అన్న వ్యాసం చదివాను.

కలలగురించి పలువురు విభిన్నాభిప్రాయాలు వ్యక్తపరుస్తారు. చాలాకాలం క్రితం రాజోలులో హైస్కూలులో చదువుకునే రోజుల్లో ఒక పీడకల వచ్చింది. ఒక రాక్షసుడు—చీకటి—పొగ. ఏదేదో చాలా రోజులవరకూ ఆ ముద్ర మనసుని వొదిలిందికాదు. ఈ క్రింది శ్లోకం చెప్పి—గరిక నెత్తిన పెట్టుకుని 108 మార్లు మననంచేస్తే ఆ పీడపోతుందని చెప్పారు.

శ్లో. సహస్ర పరమాదేవీ శతమూలా శతాంకురా
సర్వగ్ం హరతు మే పాపం దూర్వా దుస్వప్న నాశినీ.

చెప్పినరీతిగా మననంచేయగా పోయిందనలేను గాని, తరవాత తరవాత మర్చిపోయాను. తర్డుఫారం చదివే రోజుల్లో ఒక కల వచ్చింది. జ్ఞాపకంలేదు. తెల్లవారి మా అమ్మతో చెబితే మంచిదని చెప్పింది.

గోదావరి వరదలు వచ్చినట్టూ, రైలుమీదో, బస్సుమీదో ప్రయాణంచేస్తున్నట్టు, పాములు చుటు ముట్టినట్టూ — ఎన్నోసార్లు కలలు వొచ్చాయి. ఎక్కడ చదివినదీ జ్ఞాపకంలేదుగాని మనం పడుకున్న పరిస్థితులమీద కూడా—కలలు ఆధారపడి వుంటా యన్నది మరో విషయం. నేలమీద పడుకున్నామా—పరుపుమీదా—ఎట్నించెటు—కల వొచ్చే సమయానికి వాతావరణం ఎట్లా వుంది—ఏవేళ—అన్న విషయా లకు కూడా ప్రాబల్యం. ప్రాతఃకాలంలో వొచ్చిన కలలు తప్పక ఫలిస్తాయన్న నమ్మకం చాలామందికి వున్నదే. ఒక మనస్తత్వవేత్తముక్కు ఒకపక్క పనిచెయ్యడం మానేసిందట. ఏమిటా అని చూస్తే ఆ పక్క అతనికి యిష్టంలేని కొన్నివస్తువులు వున్నాయట. అవి తొల గించగానే ముక్కులు రెండు పుటాలూ యథాపూర్వంగా పనిచేయడం ఆరంభించాయి! ఈ రెండో విషయం అనుభవం లేదు నాకు. వినాలేదు.

మనసులో రెండు పొరలుంటాయి. (అచిత్తు, చిత్తు). పై పొరలోవుండే ఊహలు మనకు స్పష్టంగా తెలుస్తాయి. రెండవ పొరలోని అంశాలు మనకు తెలీవు. పై పొరలోవున్న ఊహలూ, రెండవ పొరలోని ఊహలూ సమానంగా కలల్లో ప్రతిఫలిస్తాయి. పై పొరలో ఊహలే కలలుగా వొచ్చినప్పుడు—మనకు తెలుస్తుంది. లోపలి పొరలోని ఊహలు కలల్లో కనిపించినప్పుడు మనకు సుతరామూ తెలీదు. మరో చిత్రమూ వుంది. కల జరుగుతున్నంతసేపూ యిదికల అని తెలు స్తుంది. అట్లాగే కలలు పునరావృతం కావడమూ—లేక కలలోని విషయాలు పునరావృతం కావడమూ కద్దు. లేదా జరగబోయే ఒక సంఘటన, లేక భావం లేక స్థితి (situation) ముందుగానే మనకు కల లోనే కనిపిస్తుంది. తిరిగి ఆ స్థితి వచ్చినప్పుడు యిట్లా టిది ఎప్పుడో జరిగిందే అనిపిస్తుంది. స్పష్టంగా వివ రించడం కష్టమే. సంఘమూ—వ్యక్తియొక్క స్థితి (status) ఆచారాలూ—వీటికి అతీతంగావున్న కోర్కెలు అణచబడతాయి. అవే కలల్లో పైకివచ్చే ప్రయత్నం జరుగుతుంది. Edipus complexity గురించి చెబితే ఎందరు వొప్పుకుంటారన్నది పెద్దప్రశ్నే. అలాటిదే Sadism. Sadism అంటే జ్ఞాపకం వచ్చింది. చిన్నపిల్లల్లో యిట్లాటి తత్త్వం ఎక్కువగావుంటుంది. కుక్కపిల్ల కాలువిరిచీ, ఈగల్నీ బొద్దింకల్నీ చంపి ఆనందిస్తారు. నాశకాండలో ఎందుకో ఆనందం వుండివుంటుంది. గ్లాసు నేలకేసికొట్టి పగలకొడితే హాయిగా వుంటుంది. కామానుభవమూ ఒక నాశకాండ కాదూ ఆలోచిస్తే?

నాకు కాస్త పడిసెమూ, జ్వరమూ వచ్చి నప్పుడల్లా ప్రాణాపాయం వస్తుందేమోనన్న భయం కలుగుతుంది. ఎవరికయినా జబ్బుచేసినా కొంపముంచి చచ్చిపోతాడుగావును అన్న భయమూ వుంటుంది కారణం తెలీదు.

కుక్కపిల్లకోసం, మంటలంటే వల్లమాలిన భయంగల ఒక అమ్మాయి మంటల్లోకి వెళ్ళిందన్న సంఘటన ఉదహరించారు బుచ్చిబాబుగారు.. బావుంది

ఆధునిక మనస్తత్వవేత్త లేకాక ప్రాచీనకాలంలోవి కవులూ యిటువంటి విషయాన్ని సూచించారు. Paradise Lost, Book —I లో John Milton వ్రాసిన—"Mind is its own Place" అన్న వాక్యం ఉదహరించవచ్చును. మనసునుబట్టి పనులు జరుగుతా యని చెప్పేటందుకు మనకు 'యద్భావం తద్భవతి' అన్న వాక్యము ఉండనే వున్నది. సంఘటనకంటె— ఆ సంఘటనయెడ వ్యక్తి దృక్పథాలు ముఖ్యమన్నది విదితం.

మనసు తీవ్రమయింది. నిద్రలోకూడా మనసు ఏదో ఆలోచిస్తుంటుంది అని గట్టిగా నమ్మేవాళ్లల్లో ఒకణ్ణి. నాకు కొన్ని అర్థం కనిపించని ఆలోచన లున్నాయి. అవి ఏర్పడటానికి కారణా లున్నాయి. ఏదో వొక విషాదసంఘటన జరుగుతుంది. మనసు పాడయి పోతుంది. ఆ సమయంలో తొడుక్కున్న చొక్కా జ్ఞాపకం వస్తుంది. ఇదే కారణం అనిపిస్తుంది, తిరిగి రెండుమూడుసార్లు ఆ చొక్కా తొడుక్కున్నప్పుడు, అలాటి సంఘటనే జరగనూ జరిగింది. మరి ఆ చొక్కా తొడగను. ఆ సంఘటనకీ చొక్కాకీ వున్న సంబంధం యేమిటి?

ప్రతి రచయితకీ మనసయిన కొన్ని సంఘటన లుంటాయి. కథలు వాటిచుట్టూ పరిభ్రమిస్తాయి ఒక్క అందమయిన వాక్యం తట్టి — అది ఉపయోగించడం కోసం — దానిచుట్టూ కథల్లిన సందర్భా లుంటాయి. మనసులోవున్న ఊహల బలానికి తట్టుకోలేక — కథో, కవితో వ్రాయడం, బొమ్మలు వేయడం — కూడా ఒక బలహీనతేమో?

ఇటీవల బెర్ట్రండ్ రసెల్ భావప్రపంచం వ్రాసినట్టే 'ఫ్రాయిడ్ భావప్రపంచం' అన్న వ్యాసం కూడా వ్రాస్తే — ఎన్నో కొత్త కుతూహలకరమైన విషయాలు తెలుస్తాయి. శ్రీ బుచ్చిబాబుగారికి ఈ విజ్ఞాపన చేస్తున్నాను.

—మావేపల్లి సత్యనారాయణ.

## అలివేణి మంగశబ్ద నిష్పత్తి

ఆర్యా,

"శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము"ను గూర్చి 67 జూన్ భారతి సమీక్షలో "అలివేణిమంగ" శబ్దము తమిళభాషా సమాసమనియు ఆ పదమునకు లక్ష్మి యని అర్థమనియు తెల్పినందులకు నేను సంతోషించు టయేగాక సమీక్షకులకు నా కృతజ్ఞతను తెల్పుకొను చుంటిని.

మన హైందవ దేవతల నామము లన్నియు సంస్కృతభాషలో కనపడుటయు, వానికి వ్యుత్పత్త్యర్థము లుండుటయును మనకు తెలిసిన విషయమే— 'స్థేశ, భాస, పిసకసోవరచ్' అను పాణినీయ వ్యాకరణ సూత్రముచే 'ఈశ్' అను పదమునకు 'వర' అను ప్రత్యయము చేరి 'ఈశ్వరః' అని ఏర్పడినది. 'ప్రభువు' అని ఈ పదమునకు అర్థము — వేం, కటతీతి వేంకటః = పాపమును పోగొట్టు వాడు. వేంకటశ్చాసౌ ఈశ్వరశ్చ, వేంకటేశ్వరః అను సంస్కృత సమాసమునకు పాపమును పోగొట్టునట్టి ప్రభువు అని అర్థము. పురుషదేవతను బోధించు నట్టి పదము సంస్కృతభాషలో నున్నప్పుడు, (భార్య) స్త్రీ దేవతను బోధించునట్టి పదముకూడ సంస్కృత భాషలో నుండుట అవశ్యకము గదా! లోకమున స్వామిని పూజించునప్పుడు నేటికికూడ 'శ్రీ అలివేణి మంగా సహిత వేంకటేశ్వరస్వామినే నమః' అని పురోహి తులు పూజ చేయించుటను గమనించి పై సమాస మందలి మొదటి పదము తమిళభాషా పదముగను, రెండవ పదము సంస్కృతభాషా పదముగను గ్రహిం చుటకంటె, అలివేణి యను పదము సంస్కృతమున స్త్రీ వాచక పదములకు విశేషణముగ వ్యవహరింప బడుటచేతను, దానితో కలిపి ఉచ్చరింపబడుచున్నట్టి 'మంగ' అను పదము మొదట 'మాంగనా' తప్పక అయి యుండుననియు, ఆ పదమే (మాంగనా) వర్ణలోప, వర్ణాగమ, వర్ణవిపర్యయములచే 'మంగమ'గా మారి యుండుననుటలో ఏవిధమగు దోషము కానరాదనియు, ఈ విషయమును పండిత ప్రకాండు లంగీకరించుటలో ఆక్షేపణ యుండదని నా నిశ్చయమును మనవి చేసి కొనుచున్నాను.

—చిలుకూరి రామభద్రశాస్త్రి

## అలర్ మేల్ మంగై

[శాస్త్రిగారి గ్రంథముపై సమీక్ష చేసినవారి సమాధానం.]

అలమేలు మంగశబ్ద వ్యుత్పత్తికి 'పురోహితులు పూజచేయించుటను' శ్రీ శాస్త్రిగారు ప్రమాణీకరించడం ఆశ్చర్యంగానే వుంది. శాబ్దికులనో, నైఘంటికులనో ఉదాహరిస్తే బాగుండేది. పురోహితులు పొరపాటుతో అలర్ మేల్ మంగను 'అళివేణిమంగ' అని ఉచ్చరిస్తే మనమేమి చేయగలం? శబ్దస్వరూప ప్రామాణికతకు శాబ్దికులు, నైఘంటికులు ముఖ్యంకాని, స్వామి పుష్కరిణీతీరంలో తొందర తొందరగా సంకల్పం చెప్పే పురోహితులు కారు. అందువల్ల మరొకమారు శ్రీ శాస్త్రిగారికి ఈ పదం పూర్వాపదాలు తెలుపడం అవసరమనుకుంటాను.

శ్రీ శాస్త్రిగారు భ్రాంతిపడినట్లు 'అలమేలు మంగ' సమాసంలో మొదటిది సంస్కృతపదము, రెండవది తమిళపదమూ కాదు. రెండూ తమిళ పదాలే. సంస్కృతవాసనే పదాలలో లేదు. (పద్మాసనాసీన అనే అర్థంలో వుండవచ్చు.) అలర్ + మేల్ + మంగై = అలర్ మేల్ మంగై. ఇది వ్యవహారంలో అలమేల్ మంగ అయింది. అంటే పూవుమీద కూర్చున్న స్త్రీ. అర్థాత్ పద్మాసనాసీన ఐయిన లక్ష్మి. అంతేకాని శ్రీ శాస్త్రిగారు భ్రమపడినట్లు అళివేణి=తుమ్మెదలవంటి వేణిగల మంగ కాదు.

మంగశబ్దం మంగై అనే దాని హ్రస్వీకరణమే కాని, మాంగనా రూపం మార్పుకాదు. మాంగనానుండి ఇది మార్పు చెందినదనడానికి శ్రీ శాస్త్రిగారు ప్రయోగాలు, పరిణామపద్ధతి చూపితే బాగుండేది.

## ఆంధ్రశబ్ద నిర్వచనము

ఆర్యా,

ఆంధ్రశబ్దమున కనేకులు అనేక నిర్వచనము లిచ్చియున్నారు. ఆ నిర్వచనముల తడవుట ప్రస్తుతోద్దేశముకాదు. నాదొక మాట: భరతభూమిలో నే రాష్ట్రమునకు దేవతాపరముగా వ్యవహారములేదు. ఒక్క, ఈ గడ్డకే 'త్రిలింగ దేశమ'నుట కలదని సుప్రసిద్ధము. ఆంధ్రవిష్ణువు కథ సువిదితమేకదా!

'అంధస్' శబ్దమునకు భక్షింపఁబడునది అని వ్యుత్పత్తి. 'అద్యత ఇత్యంధః, అద భక్షణే' అని అమరము. అన్నమునకు పర్యాయవాచి. ఈ శబ్దమునకు సోమలత, సోమరసమని ఋగ్వేదమున కలదని (Rv. i, 28, 7; iii, 48, 1; iv. 16. 1 etc) మేక్డొనెల్, కీత్ రచించిన 'Vedic Index of Names and Subjects' అను గ్రంథమున కలదు. మోనియర్ విలియమ్సు నిఘంటువునకూడ కలదు. అంధః=సోమరసమును, రాతి=దదాతి=అంధ్రః సోమరసమును ఇచ్చువాఁడు ఆంధ్రుడు. సోమరసము దేవతాహారము.

సోమరసమునకు — యజ్ఞమునకు — దేవతలకు — సంబంధము కలదు కదా!

> 'కృష్ణసారస్తు చరతి మృగో యత్ర స్వభావతః
> స జ్ఞేయో యజ్ఞియో దేశో మ్లేచ్ఛదేశస్తతఃపరః.'
>
> —(2—23)

అని మనుస్మృతి చెప్పినటుల సహజముగా ఈ రాష్ట్రమున (గోదావరి లంకలు ఇత్యాది) కృష్ణసార మృగము సంచరించుచున్నది. ఇప్పటికి యజనయాజనాదులు ఈ గడ్డలో నిలిచియున్నవి.

కనుక ఆంధ్రశబ్దము 'అంధస్'నుండి వచ్చినదని యూహ! సోమమును నివేదనచేసి అన్నమును బొంది, మరల అంధస్=అన్నమును, రాతి=(ఇతరులకు) ఇచ్చుచున్నాడు. ఇప్పటికి ఆంధ్రరాష్ట్రము అన్నపూర్ణయే!

—దేవరకొండ శేషగిరిరావు.

# గ్రంథ విమర్శలు

## రాగవైశాఖి : శృంగారలేఖాకావ్యం

[కర్త:—బోయి భీమన్న, ప్రాప్తిస్థానము:— పోతుకూచి ఏజన్సీస్, 208, న్యూ బోయిగూడ, సికింద్రాబాదు; వెల: పదిరూపాయలు.]

కావ్యవస్తువు రమ్యము గావచ్చు. జుగుప్సాకరము గావచ్చు. ఉదారమయిన నేమి ? నీచమయిన నేమి ? ప్రసన్నముగా నుండవచ్చు. ఉగ్రముగా నుండవచ్చు. అది యెట్టిదయినప్పటికిని కవి ప్రతిభచే కావ్యము రసవంతమగును. భావకుల హృదయమును రంజింప జేయును. శాశ్వతముగా నిలుచునని ధనంజయుడు ప్రవచించెను. ప్రతిభామూర్తియగు కవికి వస్తుస్వీకారముపట్ల విధినిషేధములు లేవు. గ్రహించిన యితివృత్తము నందేవైన ననౌచిత్యములున్నచో కవి వానిని దప్పక పరిహరించును. నాటినుండి నేటివఱకు కవులీత్రోవను ద్రొక్కుచునే యున్నారు.

కవి సర్వతంత్రస్వతంత్ర ప్రవృత్తిగలవాడు. అతని సాహితీవ్యవసాయ మీరీతిగనే యుండవలయునని శాసించునధికారము లోకమున నెవ్వరికిని లేదనుమాట నిజము. కవి సృష్టియందలి గుణాగుణములను పరామర్శించుట సహృదయులయిన పాఠకుల విధి. సాహితీప్రపంచమున స్థితిగతి చింతనమునకు తావు గలదు. పురస్సిద్ధాంతములకు చోటులేదు. స్వాభిరుచినిబట్టి, స్వానుభవమునుబట్టి, ఆత్మప్రకృతిని బట్టి కవి సృష్టియొనర్చును.

కవి స్వతంత్రుడుగావున, కావ్యసృష్టి తద్వివక్షాధీనమగుచున్నది. ఆతడేరసము నయినను అంగిరసముగా వర్ణింపవచ్చును. ఆతని కథావస్తు వేదియయినను గావచ్చును. నాయకుడెట్టి వాడయినను గావచ్చును. ఏ ప్రక్రియయైన లెస్సగా నుండును ? కావ్యము ఛందోబద్ధముగా నుండవలయునా ? కేవల గద్యమయముగా నుండవలయునా ? చంపూపద్ధతి అవలంబింపవలెనా ? ఈ చర్చలు చేయవలసినది కవి. విమర్శకునకుగాని, పాఠకునకుగాని వానితో పనిలేదు. ఇదియొక ప్రధాన సత్యము.

రసము లెనిమిదిగావచ్చు. తొమ్మిదిగావచ్చు. లేక యనంతములు గావచ్చు. వాని సంఖ్యమాట యటుండనిండు. మనుష్య తత్త్వమునుబట్టి చూచినచో శృంగార వీర కరుణ రసములు ముఖ్యరసములుగా భాసించును. ప్రాచీనులేమో శృంగారమే రసరాజమను తీర్పునిచ్చిరి. భవభూతి కరుణమే ప్రధానరసమని యొకానొక సందర్భమున వక్కాణించెను. బోయి భీమన్నగారు 'శృంగారమే రసం. రసమే శృంగారం' అని భావించిరి— ప్రాచీనాలంకారికులవలె. ఈ కావ్యము మొగమున 'శృంగార లేఖా కావ్యం' అని వ్రాయబడి యున్నది. శృంగార లేఖలతో కూడిన కావ్యమని దాని యర్థము. అట్టి శృంగారలేఖలు నూటయిరువదియైదీకావ్యమున నున్నవి.

నాయికానాయకులు పరస్పరము వ్రాసికొన్న లేఖ లివి. ఈ లేఖలు సాధారణ లేఖలు గావు. జీవన యాత్రలో నాయకుడు నిరాశాహతుడై, ఆయాసముతో, అశాంతితో క్రుంగిపోయినప్పుడు, చూచినంతటనే యాతని ప్రాణముల కూఱట కల్పించు అమృతకలశము లీ లేఖలు (పుట. 95). ఇవి 'ఎన్నో ఎన్నో లజ్జాకజ్జల మనోజ్ఞ భావాలు — ఆనంద స్పర్శలు—నిక్షిప్తాలైన మధుకలశాలు.' ఈ లేఖాగత విషయములు నాయికానాయకుల దైనందినానుభవము లయినను వాస్తవములయినను, 'సార్వకాలిక విశ్వజనీన మాధుర్యాలు' అని యనుకొనుటయు సొసగినది. ఇక నాయికానాయకు లెట్టివారు? నాయకుడు రసబ్రహ్మ. అతడు వాస్తవ సౌందర్య దర్శనమును కోరును. అతని 'సెర్చిలైటు ప్రసరణ అయోమయంలోకి కాదు. వాస్తవసౌందర్యం మీదికి.' నాయిక నాయకుని పాలిటి 'అపరోక్షరాగబ్రహ్మ.' అతని మనోవాక్కాయములలో నేదో యొకటి నాయికను అనుభవించుచునేయుండును. నాయకుని 'ఒక్కచిఱునవ్వు, ఒక్కమత్తుచూపు, ఒక్కఎఱ్ఱముద్దు' వీనిలో నేదియైన నొకటి లభించి

నచో ప్రపంచమునే జయించికొనిరాగలనను ప్రగాఢ విశ్వాసము నాయికకు గలదు.

నాయిక యాకాశవాణి పచ్చికబయలులో తొలి సారిగా నాయకునకు కానంబడినది. అదియే సుముహూ ర్తమోకాని, తద్బలమున నాయికానాయకులు ఏక మనస్కులయిరి. అప్పటికే నాయకుడు నిగమశర్మయై యుండెను. అతడెంతమందినో చూచియుండెను. వారితో స్నేహము చేసియుండెను. 'ఆయా రిరంసువుం హంసోత్త రీయాల మకరధ్వజాల 'మధురచ్ఛాయల్లో' మధువులు గ్రోలెను. మైమఱచెను. 'స్నేహము, ప్రేమ, రాగము, వశీకృతి, పూజ—సమస్తమాధురుల్ మోహినులైన కామినుల ముద్దులతో కడుధన్యమైన దీ దేహము నాది...' యని నాయకుడనును. ఇంతచేసినను అతని యన్వేషణ మీ నాయికకొఱకే. అకారణముగా, బాహ్యా కర్షణము లేకపోయినను రెండు ఆత్మలు ఏకమై, హృదయములు ద్రవించి, శరీరము లొకటిగా నగుట కొలదిమంది విషయములో మాత్రమే సంభవించు ననియు, ఆ కొలదిమందిలో మనము గలమనియు నాయకుడు నాయికతో నొక లేఖలో స్పష్టముగా ననును. ఈ నాయికయే లభించియుండకపోయినచో, ఆమెను వెదకునపుడెందరో స్త్రీలు మజిలీ అయ్యేడి వారే. ఆ రీతిగా మజిలీ కాగలిగిన మదిరాక్షులలో 'సీరి' యను నామె యొకతె. కాని పూర్వపుణ్యవశమున ఈ నాయిక ప్రాప్తించినది. నాయకుని కామవిద్విలాసము నకు స్వస్తిచెప్పబడినది లోకము శాంతికి నిలయ మయినది. నాయిక కీ 'కళింగబ్రాహ్మణుని' కామవిశ్వ రూపము తెలియును. అయినప్పటికి 'ఎన్నెన్ని ఆత్మ వస్తువులు ఇలా పూర్ణార్పణ చేసుకోకపోతే—ఉదయ భానుడై వెలుగగలరు, లోకాన్ని వెలిగించగలరు అహ రహం మీరు?' అనుచు నుదారదృష్టిని జూపినది. నాయకునకు జీవితకృషివల్ల విడుమరలేదు. ఏకాంచెము తీరిక దొరకినను నాయికను గూర్చియే తపస్సు చేయును.

నాయికపేరు వైశాఖి. ఆమెకు కుసుమో పాయనము సమర్పించుటాదిగా నాయకుని యనుభూతి యీ లేఖల కెక్కినది. నాయిక పంపిన ప్రత్యుత్తర ములు కలవని మున్నే విన్నవించితిని. నాయికను జూచి నప్పటినుండియు నాయకున కామె యొకతెయే పరమ తత్త్వముగా ప్రకృతిచ్ఛాయగా రూపుకట్టినది. సత శ్వును పదములుగాని, ప్రకృతియును పదముగాని వేదాంత మందలి పారిభాషిక పదములు గావు. కావనుటకు ఈ కావ్యమంతయు సాక్షియే. 'సెక్సు లేకుండా ప్రేమ ఫలింపదు శృంగారంగా' అను సిద్ధాంతమును చేపట్టిన వాడు గావున నాయకుశ్రీ లేఖలలో-నాయకుడే యన నేల? నాయికయు—నగ్నకామపిలసనమును పుష్కల ముగా పొందువఱచెను. అటనట వాడిన వేదాంత పద ములు కేవలము కామాచ్ఛాదనము కొఱకే. దేనిని జూచినచో లోకములో మఱిదేనిని జూడనక్కఱలేదో యా పరమసౌందర్యమే నీవనియు, సత్యశివసుందర ములు నిజస్వరూపముతో నిన్ను జూచినప్పటినుండియు దర్శన మిచ్చుచున్నవనియు నాయకుడు వెల్లడించిన మాట నిజమే. ఇట్టి మాటలు శుష్కపదములై, గ్రంథ మందంతట దట్టముగా నలముకొన్న తుచ్ఛ కామ వర్ణనములతో పోలుపొందికలు లేకయున్నవి.

నాయికాదర్శనము ప్రాప్తింపగనే నాయకునకు రాధాకృష్ణ భావన మొదలయినది. కాముకులకు నాటి నుండి నేటిదనుక రాధాకృష్ణులు పరమాప్తులైరి గదా! 'తొలిసారిగా అల్లంతదూరంలో పరస్పరం చూచుకోగానే, చిరకాలంగా విరహంతో కాలిపోతున్న వాళ్లంవలె, ఒరిగిపోయాం ఒకరి ఒడిలో ఒకరం ఆత్మికంగా.' ఇది నాయికానాయకుల ప్రథమాను భవము. ఎంతోమంది నాయకుని జూచిరి. ఆయన కడకు వచ్చిరి. కూర్చుండిరి. ఆయన హృదయవీణను మీటిరి. కాని యంతకుముందెన్నడును ఎవ్వరును ఆ హృదయవీణను 'రాగలలితంగా, లలితమధురంగా, మధురమోహనంగా' ఈ నాయికవలె మీటినవారు గారు. నాయకుడు పాటలు వ్రాయును. ఆ పాట లనిన నాయిక కెంతయో ప్రీతి యుదయించును. 'మీ గురించి వినిఉన్నాను నేను. మీ పద్యాలు, పాటలు, ఎన్నో పాడిఉన్నాను నేను. అవి నాకు చక్కిలిగింతలు పెడుతూఉండేవి. ఎవరో అజ్ఞాతప్రియ తముడు నాకోసం, నన్ను గురించి వ్రాసినట్టుండేవి. మీ దర్శనభాగ్యంకోసం ఉవ్విళ్లూరిస్తూనే ఉండేవి అవి.' అని యామె యనును. ఈ లేఖలలో పలు చోట్ల నాయికానాయకుల, యాదిమదినములనాటి భావములు ప్రపంచితము లయినవి. క్షణకాల వియో గము సహింపలేని చిత్తగతి, నిర్వేదాది వ్యభిచారి భావములు, విరహతాపములు, అభిసరణములు, రహః కేళులు, సంభోగచర్వణములు, తత్కాలానుభవ

జ్ఞాపనములు మొదలగునవన్నియు సమృద్ధిగా వర్ణింపబడినవి. సరస సల్లాపములతోడి సన్నివేశముల కథనము సైతము కలదు. ఒకసారి నాయిక పూర్వ పద్యమునే పాడుడని నాయకుని కోరును. ఆ పద్యము వ్రాసిన కాగితమేది ? యని నాయకు డడుగును. నాయిక యాకాగితమును చన్నులనడిమి చోటున దాచును. దానికొఱకు పెనుగులాట మొదలగును. ఏమయిననేమి ? తుదకు నాయకుడా పద్యమును వచనమువలె చదువును. చిత్రకళా ప్రదర్శనము చూచు ఘట్టము ఇంకొకడు కలదు. నాయిక శ్రీశైలయాత్ర చేయు రంగము మఱొండు కలదు. నాయికా నాయకుల తిరుపతి యాత్రావర్ణనము కావ్యాంతమున కలదు. వేంకటేశ్వరస్వామిని జూడగా వీరిరువురును వరుసలో నిలబడుదురు. ఒకకోతివచ్చి నాయకుని చేతిని గుంజును. ఆతని చేతియందలి నివేదన పొట్లము చినుగును. పటికబెల్లపు ముక్కలు మొదలయిన వానిని కోతి యెత్తుకొని పోయినది. అమ్మోయనుచు నాయిక నాయకుని యక్కున వ్రాలును. వరుసయందలివారు పకొాలున నవ్వుదురు. నాయకు డేమనెనో వింటిరా ? 'మన ఈ అనుకోని ఆలింగన సుఖం చూచి ఏడ్చుకొన్న వాళ్ళూ ఉన్నారు ఆ క్యూలో. భగవంతుని ఇచ్ఛకు ఎవరేడ్చి ఏం చెయ్యగలరు ?' ఈ లేఖలలో కొన్ని విలక్షణము లయినట్టివి. అభిసరణము చేయగా భీరువయిన నాయికకు, కారణాంతరముల వలన రాజాలని నాయికకు, భంగ్యంతరముగా నాయకుడు ధైర్యము కల్గింప యత్నించుచున్నాడా ? అను శంకలను పాఠకుల మనస్సులలో జనింపజేయుటయే యాలేఖల విలక్షణత.

కోడెవయస్సు పింపిళ్ళగూయు స్త్రీపురుషులు ప్రణయ సుధాపాన గోష్ఠిలో పారవశ్యము చెందుచున్న పుడు లోకము చూచుచు మిన్నకుండదు. కులభేదము లతో, ఆచారనిష్ఠలతో, అసూయాద్వేషములతో మాగి కుళ్ళిపోవు లోకము ప్రణయైక జీవులనుజూచి కన్నులలో నిప్పులు పోసికొనును. మన నాయికా నాయకులును లోక విష వీక్షణములకు గుఱియైరి. ఆక్రోశించిరి. ఆత్మీయులుగా నటించువారు నిందలు వేసిరి. నాయకుడు 'తస్మాత్ జాగ్రత' యని నాయికను హెచ్చరించును. వీరికనేకులు నెయ్యురు కలరు. సీరి, శివరంజని, నీలోత్పల, మణిశిల, దూర్వాలక్ష్మి తులసి, విద్యావతమ్మ, వర్ష, రాంబాబు, మన్మథ మూర్తి, దేవేంద్రయ్య మున్నగు వారందఱు నట్టివారే వీరి యంతరంగములను, జీవన విధానమును నాయకుడు బట్టబయలు చేయును. ఈ శృంగార లేఖావళిలో కొవలసినంత సమకాలిక విమర్శ కలదు. 'సనాతనమైన ఆర్షధర్మాన్ని తెలుసుకోకుండా, అపజ్ఞాన దూషిత మైన పాశ్చాత్యుల పాపసిద్ధాంతానికే దాసోహం చేస్తున్నారింకా మనవాళ్ళు' అని నాయకు డొకచోట నుడ్వాటించును. ఉపపత్తులు చూడకుండ వ్రాసిన యిట్టిపలుకులు ఊకదంపుడు కోవకు చెందును. 'అశక్తుల, అజ్ఞానుల దుర్జనత్వం తప్ప మరేమీ కా దీనాడు కళారంగం' అని యనుచు నాయకుడు నాటక రచయితలపై, నాటకప్రయోక్తలపై, నాటక విమర్శకులపై తీవ్రముగా అభిశంసనము చేయును. వారికి 'నాటకం ఒక సంపూర్ణ కళా సమామ్నాయం అన్న జ్ఞానం లేదు.' శాస్త్రప్రకారము చెప్పవలయు నన్నచో (నాయకునకు సనాతనమయిన ఆర్షధర్మము పట్ల మక్కువ యున్నదిగదా !) Drama అను ఆంగ్ల పదమునకు సమానార్థముగల పదము రూపకము. నాటకమని అనగూడదు. రూపకము సామాన్య సంజ్ఞ. నాటకము ప్రత్యేక సంజ్ఞ. దశ రూపకములలో నాటకమొకటి. రూపక నాటక తారతమ్య జ్ఞానము నాయకునకు బొత్తిగా లేనట్లున్నది. రూపకములో ఆదర్శవాదము ప్రధాన మనియు, అందువలననే కన్యాశుల్కము 'నాటకం' కాలేకపోయినదనియు, వసంతసేన (మృచ్ఛకటిక) 'నాటకం' కాగల్గినదనియు నాయకుని సిద్ధాంతము. ఆంధ్ర దృశ్య కావ్యరంగమున గల యనాచారముల నన్నిటిని ఆతడు వెల్లడించును. కళ కళాస్రష్టకొఱకేగాని, యితరుల కొఱకుగాదు. అనగా కళ కళకొఱకునుగాదు. లోకము కొఱకును గాదు. పత్రికల వెఱ్ఱిమొటములను, మతముల కశ్మల మును, భక్తుల ధూర్తత్వమును, సాహిత్యపరుల రాగ ద్వేషములను నాయకుడు చాటును. ఎంకి పాట వ్రాసిన నండూరి సుబ్బారావునకు నమోవాకము లర్పించును.

ఈ నాలుగువందల నలువది పేజీల గ్రంథములో బోయి భీమన్నగారు ప్రబోధించిన జీవనతత్త్వమేమి ? యనునది యొక ప్రశ్న. వారొక్కచోట ఈ జీవన తత్త్వమును ప్రకాశింపజేసినవారు గారు. ఆయా

లేఖలలో సిద్ధాంత ప్రాయములయిన వాక్యము లొకొక్కొన్నిగలవు. అవి కేవలము నాయికా నాయకుల సందర్భవశముననే చెప్పినవి గావు. మఱి జగత్సత్యములుగా ప్రతిపాదింపబడినవి. వాని నన్నిటిని ఒకచో గుదిగ్రుచ్చి చూచినచో ఈ కావ్యము ప్రతిపాదించు పరమార్థము తేటతెల్లమగును. ఆ పరమార్థ స్వరూప మిట్లుండును.

స్త్రీ పూర్ణపురుషుని, పూర్ణపురుషుడు పూర్ణస్త్రీని నిరంతరము అన్వేషించుచుందురు. ఈ యన్వేషణమునకు వివాహవ్యవస్థకు సంబంధము లేదు. అనగా స్త్రీ పురుషులు పరిపూర్ణ జీవులగుటకు వివాహము సాధనము కానక్కఱలేదు. ఇతడు పూర్ణ పురుషుడని స్త్రీ విశ్వసించినప్పుడు, ఈమె పూర్ణ స్త్రీయని పురుషుడు నమ్మినప్పుడు వారిరువురు వివాహబంధము లేకయే జీవింపవచ్చునని యీ గ్రంథకర్త యభిప్రాయము. వివాహ వ్యవస్థయను దానియొక్క భద్రస్వరూప మీ రచయిత కంతుపట్టలేదు. ఈ శృంగార లేఖావళికి ఆ వ్యవస్థ ఎదురుచుక్క. అదిసరి. మఱి స్త్రీ పురుషులు ఒకరి పరిపూర్ణ తత్త్వమును మఱొకరు గ్రహించు టెట్లు? వివాహము సాధనము గాదాయె. పరస్పర సంబంధము వల్లనే స్త్రీ పురుషులు ఒకరి పరిపూర్ణ తత్త్వమును మఱొకరు గ్రహించుచున్నారు. ఆ సంబంధముయొక్క లక్షణ మేమి? అది స్నేహమా? కాదు. స్నేహమువల్ల స్త్రీ పురుషులు ఒకరినొకరు చక్కగా నర్థము చేసికొనగలరను సిద్ధాంత మీ కావ్యమున కానరాదు. ఈ కావ్యమునందలి కథానాయకుని పోకడను కనిపెట్టినచో, స్త్రీ పురుషుల పరస్పరసంబంధముయొక్క మూల తత్త్వ మేమిటో తెలియును. ఈ కావ్యనాయకునకు పలువురు పడుచులతో పొత్తుగలదు. ఆ స్త్రీ లందఱు ఆయన యన్వేషణములో మజిలీలు. వారెవ్వఱు పూర్ణ స్త్రీలు గారు. వారు కేవలము ఇతని పాలిటికి భోగాంగనలు. తుదకు ఆకాశవాణి ప్రాంగణమున నాయిక సాక్షాత్కరించినది. ఆమె పూర్ణస్త్రీయని నాయకుడు భావించెను. ఈ భావనకు హేతు వేమి? చెప్పలేదు. పూర్వజన్మ బంధమా? జననాంతర సౌహృదమా? అవి గావు. మఱియేమి? కేవల కామము. నాయకుడు నాయికను జూచి కామవశుడై ఆమెను పూర్ణస్త్రీగా తలంచెను. కాముకుల తత్త్వమే యిది. ఇది నిజముగానిచో ఈ శృంగారలేఖావళి యందలి క్షుద్రకామ వర్ణనములకు అవకాశమే లేదు. నాయిక దివ్యసౌందర్యము గలది. ఆరోగ్యవంతమైన యౌవనమే అందమనియు, 'దర్శన, స్పర్శన, ఆస్వాదన, ఆరాధన యోగ్యమైన అందమే అందం నిజంగా' అనియు ఆతని సిద్ధాంతము. అందుచేత కామమే స్త్రీ పురుషులకు పరస్పర పూర్ణ గుణ గ్రహణమునకు సాధనము. స్త్రీకి పరిపూర్ణకామసుఖ మిచ్చినవాడే ఆమె పాలిటి పూర్ణపురుషుడు. పురుషునకు సంపూర్ణకామసుఖ మిచ్చు స్త్రీయే, ఆతని పాలిటి పూర్ణస్త్రీ. కామమే ప్రధాన పురుషార్థమనువారి సిద్ధాంతము లివి. జీవిత యాత్రలో స్త్రీ పురుషులు తారసిల్లినవారిలో కామసుఖము ననుభవించుచు దినములు గడుపుచున్నచో, ఎప్పుడో యొకప్పుడు స్త్రీకి పూర్ణపురుషుడు, పూర్ణ స్త్రీకి పూర్ణపురుషుడు లభింపక మానరని తాత్పర్యము. ఈ కావ్యమునందలి నాయికా నాయకుల ప్రవృత్తియే యీ తాత్పర్యమునకు సాక్షి. వివాహ వ్యవస్థ కేమాత్రము ఇట చోటు లేదన్నమాట మఱవరాదు.

మఱియొక సిద్ధాంత మీ కావ్యమున ప్రపంచింపబడినది. ఈ నాయకునకు అమలిన శృంగార (Platonic love) మనినచో అసహ్యము. 'అమలిన శృంగారభావం శారీరకబలహీనతలుకల కేవలభావుకులది. తాచెడ్డ కోతులువాళ్ళు' అని నాయకుడు తలంచును. ఈ లేఖలయందలి శృంగారము దివ్యలోకములకు, భావవాదమునకు (Idealism) సంబంధించినదిగాదు. అది యీ లోకమునకు, ఈ సంఘమునకు సంబంధించినదే. అందుచేత ఈ కావ్యములో శృంగారస సంబంధమయిన వాస్తవిక చర్చలు గలవు. ఆ చర్చల తీరుతెన్నులీ రీతిగా నుండును.

పురుషునిలోగల తత్త్వములు రెండు. మొదటిది ప్రేమ. రెండవది కామము. స్త్రీయందుమాత్రమొక తత్త్వమే కలదు. అదియే ప్రేమ. ఆత్మకు కవిత యాహ్లాదమును కల్గించినట్లుగా, శరీరమునకు 'సెక్సు' సుఖము నిచ్చును. 'సెక్సు'. అనునది యొక కోరిక. అది శరీర నిష్ఠమయినట్టిది. 'సెక్సు'కంటె ఉదాత్తమయిన మఱియొక తత్త్వ

మున్నది. అదియే ప్రేమ. ఆ ప్రేమయే స్త్రీ తత్త్వము గదా! ప్రేమ యనునది యొక్క యను భూతి. అది ఆత్మనిష్ఠమయినట్టిది. స్త్రీకి సంబంధించినంతవఱకు ఆత్మ యనగా నేది? స్త్రీకి మనస్సనినను, హృదయమనినను, ఆత్మయనినను ఒక్కశరీరమే. స్త్రీకి ప్రత్యేకముగా ఆత్మయనునది లేదు. సమస్తమును ఆమె శరీరమే.ఇదియొక దోష భూయిష్ఠమయిన సిద్ధాంతము. పురుషునకు కామము, ప్రేమ యను రెండు తత్త్వములు గలవన్న భీమన్నగారు, స్త్రీకి ప్రేమయను ఒక తత్త్వమునే యంటగట్టిరి. ఆ ప్రేమ ఆత్మనిష్ఠమనిరి. మఱి స్త్రీ యొక్క ప్రేమ స్వరూప మెట్లుండును?

కామక్రీడ వ్యభిచారముగాదు. అది సుఖమునకు మార్గము. ఆనందబ్రహ్మమందిరమునకు ద్వారము. కామశక్తియే ప్రేమశక్తి. ప్రేమశక్తియే ఆత్మశక్తి. ఈ యాత్మశక్తి ఏ రంగమునందయినను దిగ్విజయమును సాధింపగలదు. శరీర సంయోగము ఆత్మసంయోగములో పర్యవసించుటయే పరమసుఖము. దీనివలన తేలిన సారాంశమిది. ప్రేమయనునది స్త్రీ తత్త్వమయినను, అది యాత్మనిష్ఠమయినను, ఆ ప్రేమశక్తి కామశక్తియొక్క లీలయే. కామము ప్రేమగా పరిణమించి, తుదకు ఆత్మశక్తియైనది. స్త్రీ తత్త్వమగు ప్రేమసైతము కామముయొక్క రూపాంతరమే. అనగా పురుషునకు కామము, ప్రేమయను తత్త్వములుండగా స్త్రీకి కేవలము కామమే తత్త్వముగానున్నది. ఆమె పురుషుని కామతృష్ణను దీర్చు భోగవస్తువు. పురుషుని కామవాంఛలను నెఱవేర్చుటయే స్త్రీ సాధింపదగిన పురుషార్థము. అంతకంటె స్త్రీకి వేఱొకపని లేదు. పురుషుడే యామె పాలిటికి పరమాత్మ. భీమన్నగారి సిద్ధాంతము నీ క్రింది విధముగా ప్రతిపాదించిరి.

శరీర సంయోగము లేక, కేవల మానసిక ప్రేమతో ఆత్మ తృప్తిపడదు. శరీర స్పర్శయే ఆత్మ స్పర్శ. శరీర తృప్తియే ఆత్మానందము. ఆ యాత్మానందమును ప్రసాదించిన పురుషుడే స్త్రీకి పరమాత్మ. ఆమె పరమాత్మయగు పురుషునియందే శాశ్వతముగా నైక్యమగును. తనను ప్రేమించు నొకపురుషునికి ఆత్మార్పణము చేసికొన్న స్త్రీయే ధన్యురాలు. అట్టి స్త్రీయే యానందనిలయ. జీవన్ముక్త. ఈ కావ్యనాయిక 'ఆత్మతోపాటు శరీరాన్నికూడ' నాయకునిలో 'కరగించి వేసుకొన్న' 'పరాత్పరతర.'

స్త్రీని ఆనందనిలయగా చేయుటకు పురుషుడు తప్పక నిత్యమైథున క్రియాధర్మి కావలయును. నిత్యమైథున క్రియాధర్మియగు పురుషుడు మహాశివునితో సమానుడు. 'మైథునమువలన మహాయోగియైనవాడు వాతో సమానుడగును. ఇందు సంశయములేదు' అని పరమశివుడే సిద్ధాంతీకరించెను. అదియునుగాక శృంగార లీలా సంగ్రామములో విజయుడయిన పురుషునికంటె పరాజితయయిన స్త్రీయే యధికురాలు; స్త్రీ పురుషుని చేతిలో 'ఎంత చిత్తుగా ఓడిపోతే అంత ఆనందాధి దేవత అవుతుంది.'

ప్రేమ, పరబ్రహ్మ మొదలగు పెద్ద పెద్ద మాట లున్నప్పటికి మానవ జీవితములో ప్రధాన పురుషార్థము కామమనియు, కామోపభోగమువలననే వారు జీవన్ముక్తి సాధింపగలరనియు ఈ కావ్యమున ప్రతిపాదింపబడినది. 'స్త్రీని పురుషుడు, పురుషుణ్ణి స్త్రీ—ఆనందసుందరంగా అనుభవించడం ఒక కళ! అదే పరమకళ! ఈ కళాదర్శనమే భగవద్దర్శనం! ఈ పరమసుందర దర్శనయాత్రే జీవితం—మనవంటి పూర్ణజీవజీవనీ శివసరస్వతులకు!'. ఈ ప్రతిపాదనయే ద్వితీయ సిద్ధాంతము. ప్రేమ కామమునకు పర్యాయపదమే. సందేహములేదు. 'ఈ కామము సంపూర్ణముగా శారీరకము. ప్రేమతో కూడినప్పుడు అది యమృతమగును. ఆ యమృతమే శృంగారము. శృంగారము మలినముగాదు అమలినముగాదు. అదియొక ఆనందరసానుభూతి. ద్వంద్వాతీత పరమస్థితి.' ఈ విధ

ముగా నాయకు డేమేమో చెప్పికొనిపోవును. ఈ మాటలు బూటకములు. ప్రేమ యనునది కామమునకు మాఱుపేరుగా నున్నపుడు కామము ప్రేమతో కూడుట యేమి? కామము పురుషునిది. ప్రేమ స్త్రీకి చెందును. ఆ స్త్రీ సంబంధమయిన ప్రేమయు కామము తప్ప మఱొండు కాదని ఋజువుచేసితిమి. పురుషుని కామము స్త్రీ కామముతో కూడినప్పుడు అమృతప్రాయమయిన శృంగారమగునని పైన చెప్పబడినది. స్త్రీ పురుషుల కామకేళీ విలాసము—శాస్త్రమునుబట్టిగాని, లోకమునుబట్టిగాని—శృంగారరసముగాదు. అది కేవలము జాంతవప్రవృత్తి. ఆ ప్రవృత్తియే ఈ కావ్యమునందంతట దటముగా వ్యాపించినది. శృంగార రస మన నేమియో తరువాత వివరింతును.

ఈ రెండు సిద్ధాంతములనుండి మఱియొక సిద్ధాంతము పుట్టినది. ఈ తృతీయ సిద్ధాంతమును కూలంకషముగా తఱచి చూచినగాని యీ కావ్యము లందలి గుట్టుమట్టులు బయటపడవు. ఇందలి స్వవచనవ్యాఘాతములు వెల్లడికావు. శారీరక సంయోగమునకు ప్రేమకు సంబంధము లేదట! ఇదియొక కల్లమాట. ప్రేమకు శారీరక సంయోగమునకు సంబంధము లేనిచో ఈ గ్రంథమందేల విపులముగా శారీరక సంయోగవర్ణనములు చేయబడినవి? కావ్యార్థమేదయి యుండును? 'పరస్పరం ప్రేమించుకొని, కామించుకొని, విరహతప్తులయిన స్త్రీ పురుషుల శరీర సంయోగమే సుఖం' అని యనవలసిన యక్కఱ యేమి గల్గినది? ఈ శారీరక సంయోగమే యాత్మ సంయోగములో పర్యవసించునని చెప్పుట యెందులకు? స్వచ్ఛమైన ప్రేమకు శరీరముతో పనిలేదనియు, స్వేచ్ఛగా ఎవ్వరినైనను ఎంతమందినైనను ప్రేమింపవచ్చుననియు ననుట లోకవంచనము మాత్రమే. అసలు అంతరార్థము వేఱు. ఆ యంతరార్థమేమి?

ఈ కావ్యనాయకుడు 'అపర శ్రీకృష్ణ పరమాత్మ'. అతడు ప్రవచించు వాక్యములు కామమయములు. స్త్రీ పూర్ణపురుషుని, పూర్ణ స్త్రీ పూర్ణపురుషుని అన్వేషించునుగదా! 'ఈ సహజాన్వేషణకూ, వివాహవ్యవస్థకూ సంబంధం లేదుగదా! 'ప్రేమించిన వాళ్లను పేళ్ళా సిద్ధాంతం కదా నాది?' యని యొకచో నాయకుడభిభాషించును. పురుషుడు నిజ జీవనయాత్రలో ఎదురుపడిన స్త్రీలతో ఎంతమందితోనైన కామాచారము నిర్వర్తింపవచ్చును. ఒకవేళ పురుషునకు వివాహితయగు స్త్రీ యెదురుపడినచో నేమగును? 'జాత్యహంకారాలు, కుటుంబగౌరవాలు, ఆస్తిహక్కులు, శారీరక నిర్బంధాలు, వైవాహిక విధినిషేధాలు—ఇవన్నీ కేవల లౌకికాలు. పెళ్లిపేరుతో శరీరం ఒక మగవాడి ఆధీనంలోఉన్నా, ఆమె ఆత్మ నిరంతరం ఎవడిలో రమిస్తూ ఉన్నదో—అతడే ఆమె భర్త! అతడే ఆమెకు గురువూ, భగవంతుడూ, మోక్షస్థానము, ఆనందనిధి.' పాణిగ్రహీతి పాణిగృహీత(పాణిగృహీతా౽న్యా యని భట్టోజీ దీక్షితులు) యగుట దోషముగాదు. పెండ్లి చేసికొని, ఒక పురుషునకు భార్యయైన స్త్రీ తన మనస్సునకు నచ్చిన పరపురుషునితో కామకేళి చేయవచ్చును. ఆత్మ పరపురుషునిపై వ్రాలినప్పుడు, శరీరమును మాత్రమాతనికి అర్పింపకుండనేల? కావుననే 'ఆత్మను ఇచ్చుకొన్న చోటనే శరీరాన్నికూడ ఇచ్చుకోనిచ్చే ధర్మజ్యోతి ఇంకా ఎంత దూరంలో ఉన్నదో' యని యనుట సంభవించినది. ఈ విధముగా మగవాలు సామాన్యవలె నగుటలో విడ్డూరమేమియు లేదు.

ఇల్లాలు ఈ రీతిగా జారిణియగుట సాధ్యమగును. ఏలయనగా ప్రేమకు ప్రేమ లభించితీరును. అది నొన్నటికి తీరని కోరికకాదు. స్త్రీకి ప్రేమించినవస్తువు లభింపక పోవుట యనునదిలేదు. 'మనం ప్రేమించిన వస్తువు తిరిగి మనల్ని ప్రేమించగల్గితే—అది మనకు లభించినట్టే.' ఒక పురుషుని పలువురు స్త్రీలు వలచినచో అది యా పురుషుని విశ్వప్రణయమునకు తార్కాణము. 'చాలమంది స్త్రీలు ఒకే పురుషుణ్ణి ప్రేమించినప్పుడు, అందరూ పొందగలుగుతారతణ్ణి' యని నాయకుని యభయప్రదానము. 'అందరూ ఏకకాలంలో భార్యలుగా ఎందుకు బ్రతకగూడదో—తాము కోరుకొన్న అతడితో?' యని నాయిక ప్రశ్న. ఇది పెండ్లియయిన స్త్రీ వలపు.

ఇక వివాహితుడగు పురుషుడు పరస్త్రీ బాంధవ్యము కోరవచ్చునా? పెండ్లిచేసికొనినవాని భార్య, తన భర్త పరస్త్రీతో పొత్తు పెట్టుకొనుట కిచ్చగింపదు. దానికి కారణము కామముగాదు. ప్రేమ

గాదు. తన భర్త సంపాదించిన యాస్తిలో మఱొక మదవతికి భాగధేయముండుట కామె కిష్టముగాదు. ఆస్తి సర్వము తనకే చెందెడి వీలున్నచో భార్య భర్తనేవిధముగను ప్రతిరోధింపదు. అందుచేత వివాహితుడగు పురుషుని యాస్తిలో వాటా కోరకుండ, స్వతంత్రముగా జీవించుచు, నతనితో నే స్త్రీ యయిన పొతు పెట్టుకోవచ్చును.

స్త్రీ పురుషులు సమాజములో బ్రతుకుచున్నారు. సమాజమునకు కొన్నికట్టుబాటులు గలవు. స్త్రీ పురుషుల స్వేచ్ఛాకామాచారమునకు తగినట్లుగా సమాజము సంస్కరింపబడవలయునుగాని, నైతిక సూత్రములు, ధర్మసిద్ధాంతములు ప్రమాణములనుకొనుచు బ్రతుకుట యనుచితము. నీతిపేరుతో, ధర్మముపేరుతో ప్రవక్తలు మున్నగువారు సంఘము పతనమగునట్లు చేసిరి.

'రాగవైశాఖి' కావ్యార్థమును, లేఖాగతాంశములనాధారముగా చేసికొని, పై రీతిగా వివరింపవచ్చును. పురుషుడు ఎంతమంది స్త్రీలతోనైన రమింపవచ్చును. స్త్రీయు ఎంతమంది పురుషులతోనైన బజారింపవచ్చును. అట్లు చేయుటయే జీవన్ముక్తి. వివాహవ్యవస్థ యొక కృత్రిమ నియమము. సంఘమునకు స్త్రీ పురుషుల యిచ్ఛలను నిరోధించు నధికారము లేదు. ఇది యీ కావ్యార్థముయొక్క సారాంశము. ఈ సారాంశము బుద్ధివైభవమువలన జంతువులకంటె భిన్నుడగు మానవుడు మరల జంతు ప్రవృత్తితో వ్యవహరించుట యుత్తమధర్మమని చాటుచున్నది. ఆ ధర్మము నంగీకరింపని సజాతీయులను, సంఘమును దూషించుచున్నది. సంఘ నియమములు వ్యక్తి సుఖమునకు ప్రతిబంధకములనుచు ఇంత పెద్దగ్రంథమును వ్రాసిన భీమన్నగారు మఱొక విషయమును మఱచిరి. వ్యక్తి, సంఘము పరస్పరము సామరస్యముతో నున్నపుడే శాంతి యుదయించును. వ్యష్టి శ్రేయస్సు సమష్టి శ్రేయస్సునకు భిన్నముగాదు. వ్యక్తియు సంఘముపట్ల బాధ్యతతో నడుచుకొనవలెను. సంఘ నియమములు తనకు పనికిరావన్న వ్యక్తి, తన రాగద్వేషములనుబట్టి సంఘమును శాసించు నధికారము పొందుట కర్హుడుగాడు. వ్యక్తి తన యిష్టము వచ్చినట్లు తాను నడుచుకొనవచ్చు. ఆ నడవడిక సంఘములో అశాంతిని రెచ్చగొట్టినప్పుడు అతనిని సంఘమేమియు ననరాదు. ఇది యెక్కడి సిద్ధాంతము? వ్యక్తి చేయుచున్న పని సాంఘిక ధర్మమునకు వ్యతిరేకముగా నున్నచో, సంఘమతనిని శాసించును. శాసించునపుడు వివేకశూన్యుడగు వ్యక్తిలో ఆక్రోశముదయించును. అతడు పైశాచిక తాండవము చేయును. ఆ పైశాచిక తాండవముచేయు వ్యక్తి మనస్తత్త్వము ప్రతిబింబించిన రచనము ఈ 'రాగవైశాఖి'.

మనుష్య జీవనములో కామము ప్రబలతత్త్వము. ఆ కామ ప్రకోపమును హద్దులలో నుంచుకొనవలయునని మనుష్యుడనాదిగా ప్రయత్నించుచున్నాడు. ఆ ప్రయత్నముల చిహ్నములే కట్టుబాటులు. ఈ కట్టుబాటులు నాగరిక జీవనము లక్షణములు. శివంకరములు. అట్టి కట్టుబాటులలో వివాహవ్యవస్థ ప్రధానము. వివాహము పవిత్రమయిన వ్యభిచారమని యుపాసడించిన వారు లేకపోలేదు. అట్టిమాటలు చమత్కారజనకముగనే యుండును. ఆ వివాహవ్యవస్థను శిథిలముజేసి, తత్స్థానమున దేనిని నిల్పవలెను? స్వేచ్ఛాకామాచారమునే గాదా? ఆ యాచారము ఆదిమమానవు లవలంబించినట్టిది. వివేకము పెరిగిన కొలది, దేశముపట్ల సంఘముపట్ల బాధ్యతకల మానవుడు తదాచారమునకు తిలోదకము లిచ్చెను. వివాహ వ్యవస్థను దీర్చిదిద్దెను. ఆ వ్యవస్థలో కాలక్రమమున దోషములు పేరుకొన్నచో, వానిని తొలగింపవచ్చును. అట్లుగాకుండ ఆ వ్యవస్థనే విచ్ఛిన్నము చేయవలయుననుట యేల? దానిని గాదనుట యేల? అశాంతిదాయకమయిన స్త్రీ పురుషుల వ్యభిచారమునకు స్వేచ్ఛాపవిత్రత అను రంగులనుపూసి, దానినొక దివ్యపీఠమున నిలిపి చిలుకపలుకులను వల్లెవేయుచు ఈ కావ్యమును రచించుట తటస్థించినది. ఇది స్వచ్ఛమయిన సాహిత్య వ్యభిచారము.

ఈ కావ్యము శృంగారలేఖా కావ్యమట! భీమన్నగారికి శృంగార రసమనగా నేమియో తెలియదు. కుచమర్దనములు, రాక్షస రతులు, చుంబన చపేటములు వర్ణించినంతమాత్రాన శృంగార రసము జాలువాఱదు. అవి కామవర్ధనాంగములు మాత్రమే. శృంగార రసమన నేమియో పరిశీలింతము.

లోకములో మనష్యునకు ప్రాణులయెడ సహజముగా అనురాగము కలుగుచుండును. ఇష్టము ఏర్పడుచుండును. ప్రేమ పుట్టును. స్నేహమావిర్భవించును. సౌహార్దము జనించును. ఆ యనురాగమునకే, ఆ యిష్టమునకే, ఆ ప్రేమకే, ఆ స్నేహమునకే, ఆ సౌహార్దమునకే ప్రీతి యనిపేరు. ప్రీతికి పర్యాయపదమే ప్రణయము. వ్యక్తుల నడుమనున్న సంబంధముయొక్క గాఢత్వమునుబట్టి ఆ ప్రీతి వివిధనామములు పొందుచుండును. తల్లిదండ్రులకు బిడ్డలయెడ ప్రబల ప్రీతియున్నచో అది 'వాత్సల్య'మగును. మానవునకు భగవంతుని పట్ల దృఢప్రీతియున్నచో అది 'భక్తి'యగును. యువతీయువకులకు పరస్పరము తీక్ష్ణప్రీతియున్నచో అది 'రతి'యను పేరు పొందును. ఉపాధివశమున పేరు లేవయినప్పటికి, అత్యధికమయిన ప్రీతిగల వ్యక్తులు, మానసికముగనేకాక శారీరకముగాకూడ నైక్యమును భజింపగోరుదురు. వారి మనసులేకాదు శరీరములుకూడ వియోగమును సహింపవు. అందు చేతనే మిత్రులు, మాతాశిశువులు కౌగిలించికొందురు. ప్రీతి యనునది భార్యాభర్తలలో మాదిరిగా తక్కిన జీవులయందు సంపూర్ణశారీరక సంయోగమును కలిగించునంతదూరముపోలేదు. ప్రీతి లేక ప్రేమ యిటు వంటిది కావుననే శాస్త్రకారులు రతిని 'నాయికానాయకుల సంయోగేచ్ఛ' యని నిర్వచించిరి. సంయోగమనగా కామసంతృప్తిగాదు. ఐక్యార్థ మాత్మలు అనుభవించు దుర్భరతాపము. శృంగార రసమునకు ఇట్టి రీతియే స్థాయిభావము. స్థాయిభావమనగా నేమి?

శ్రవ్యకావ్యమునందుగాని, దృశ్యకావ్యమునందుగాని నాయికానాయకులుందురుగదా! వారి చేష్టలను విన్నప్పుడు, కన్నప్పుడు శ్రోతయొక్క హృదయమున, ద్రష్టయొక్క హృదయమున నొకవిధమైన వికారము లేక విక్రియ (Reaction) కలుగును. ఈ వికారమునకే ఈ విక్రియకే స్థాయిభావమనిపేరు. మనుష్య చైతన్యమున ఉత్తమ ప్రకృతి, అధమప్రకృతి యనునవి గలవు. ఆ వికారము మనుష్యుని యధమ ప్రకృతిలో జనించి, క్రమక్రమముగా ఉత్తమప్రకృతికి పయనించును. ఆ ప్రకృతియలదా విక్రియ బహుసూక్ష్మావస్థలను ధరించును. ఆత్మతో నైక్యమగును. పరమానంద మొసగును. పరమానందమిచ్చునప్పటి ఆ భావరూపమునకే రసము అని పేరు. అధమ ప్రకృతిలో జనించిన వికారము లౌకికవాసనలతో కూడియుండును. 'రతి'యను స్థాయికి సంబంధించినంతవఱకు కామము లౌకికవాసన యగును. ఈ కామము క్షాళితమయినగాని అచ్చమయిన రసమావిర్భవింపదు. ఈ మాటలను శృంగార రసోత్పత్తి కన్వయించికొందము.

శృంగార రస విషయమున, శ్రోతల ద్రష్టల యంతరంగమున కలుగు వికారము రతి గదా! అది కామవాసనతో కూడియుండును గదా! ఆ వాసన క్షుద్రముగదా! కవిరసపోషణశక్తివల్ల ఆ కామ మాలిన్యము క్రమక్రమముగా క్షాళితమగును. కించిన్మాలిన్యము పోవుసరికి రతియను స్థాయిభావము మానవుని యుత్తమప్రకృతి సమీపమునకు వెళ్లును. బహురూపభేదములను పొందును. రసపరిణామోన్ముఖమగును. ఆ బహురూపభేదములకే శాస్త్రములో వ్యభిచారిభావములనిపేరు. స్థాయిభావము సముద్రము. ఈ వ్యభిచారి భావములు తరంగములు. ఈ వ్యభిచారి భావములయందు సైతము రజోమాలిన్య మొకకొంత యుండును. అదికూడ పోయినగాని స్థాయిభావమునకు శుద్ధసాత్త్వికత రాదు. ఆ సాత్త్వికదశలో అది యవధరించు నానావిధరూపములే సాత్త్వికభావములు. ఒక నవీనవిమర్శకు డన్నట్లుగా నీరు క్రాగునపుడు పుట్టు బుడగలవంటివి వ్యభిచారి భావములు. నీరు క్రాగిన పిదప ఆవిరియగుటవంటిది సాత్త్వికభావము. ఈ సాత్త్వికభావ స్థితియందును రసములేదు. సాత్త్వికభావములు సైతము సమసిపోయి మానవుని చైతన్యమంతట కేవలభావమే యావరించినపుడు రసానందము కల్గును.

ఈ యంతర్మథనము జరుగుచున్నట్లు మనకు తెలియదు. లోకోత్తరవర్ణనా నిపుణుడగు కవి వ్రాసిన మొదటి పద్యమే మనలను పరమానందసముద్రమున నోలలాడించును. ఏ నైపుణ్యమును లేని కవులు భావమును వ్యభిచారితాస్థితికి కొనిపోయి, శ్రోతల ద్రష్టల మనసులను అల్లకల్లోల మొనర్తురు.

'రాగవైశాఖి' శృంగారకావ్యముగదా! కవి పాఠకులను రసపర్యంతము తీసికొనిపోయెనా? లేదు.

దానికి కారణమిది. అథమ ప్రకృతియందు కామ వాసనలతో జనించిన చిత్తవికారములే యీ కావ్యమున పుష్కలముగా వర్ణింపబడినవి. అట్టి చిత్తవికారములే పాఠకులలో స్థైర్యముద్బుద్ధమగును. అవి యుత్తమప్రకృతివరులకు పోలేవు. కేవలము, స్థాయి భావమును వ్యభిచారిభావస్థితివరలకు తీసికొనిపోయి పాఠకుల మనస్సులను అల్లకల్లోలపఱుచునదే యీ కావ్యము. ఇంక రసస్థితి యెక్కడిది?

ఇందలి క్షుద్రకామవర్ణనముల నొకకొన్ని చూపుదును. ఈ నాయికానాయకులు నిత్యము సంభోగమును గూర్చియే యాలోచింతురు. లేక సంభోగాను భవములను జ్ఞప్తికి తెచ్చుకొందురు. 'నా రెండు చేతులలో రెండు పీయూషభాండాలు! నా పెదవులలో మఱొక సుధాకలశం! నా చుట్టూ మృగశిరమబ్బులు! నా నిండా విశాఖమెరుపులు! మేరుశిఖరాలను నొక్కితే పాల్కడలి మథనమై అమృతం ఉప్పొంగాలి నాకోసం' ఇది నాయకుని భావన.. 'మీ సువర్ణగిరుల మధ్య లోయలో వస్తున్నది నొప్పి!'' ఇది నాయికమాట. ఇట పీయూషభాండలు, మేరుపర్వతాలు, సువర్ణగిరులు స్తనముల కుపమానములు. ఉపమేయములు చెప్పకుండ భీమన్నగారు తప్పించుకొందురు. కాని ప్రకరణమునుబట్టి సర్వము నవగతము కాగలదు. స్వప్నప్రాయమయిన స్థితిని వర్ణించుచు నాయిక యీరీతిగాననును. 'ఒళ్లంతా నొప్పులు, నొక్కులు; ఎర్రబడ్డ బుగ్గలు, నెత్తురు చిందుతున్న పెదవులు, మంటలు, జుర్రిన లేతముంజలవలె, అబ్బా—ఇవన్నీ ఇంత ప్రత్యక్షంగా, ఇంతమధురంగా బాధపెడుతూ ఉంటే ఇదంతా వట్టికల అని ఎలా అనుకోను!' నాయిక రాక్షస రతిని గోరు హస్తినీ జాతి స్త్రీ. నలువది రెండవ లేఖ కామప్రకోపముతో నిండియున్నది. 'శిఖరస్థాయిలో అబ్బా అనుకొని, ఇక ఎప్పటికీ వద్దు అనుకొని, జీవితం మొత్తానికి ఈ సుఖం ఒక్కటే చాలు అనుకొని, ఆనందంనుంచి తేరుకొని, అభినందనలు చెప్పకొని, ఆలింగనం చేసుకొని, అదుముకొని విడిపోయి—మరుక్షణంలోనే మళ్ళీ అదంతా కావాలని ఆరాటపడటం!' ఇది యీ లేఖలోని యొకభాగము. నాయిక యొక సినిమాకు వెళ్లును. ఆ సినిమా చూచుచున్నపుడు నాయకుడు చేసిన చేష్ట గుర్తునకు వచ్చును. ఆ చేష్ట యిట్లుండును. 'నిన్న మీరు చేసిన పని—ద్రాక్షరసం బ్లౌజు పై ఒలకడం—వృథాగా పోతున్నదని మీరు దానికి పెదవులు చేర్చడం—పెదవులమధ్య హేమగిరి శిఖరాల మొనలు చిక్కుకోవడం—పొంగిన ఉత్సాహ సంరంభంలో గాజుపగిలి నెత్తురు చిందడం—అప్పటి క్రీడలో నేను రాగజ్యోతినే కావడం—అన్నీ కనిపిస్తున్నై నాకు తెరమీద!' హేమగిరి శిఖరాల మొనలనగా చనుమొనలు. 'ఎంత నిండుగా ఉన్నై నవనీత కలశాలు! ఎంత తియ్యగా ఉంది ద్రాక్షారసాస్వాదన! చాలు చాలు పగిలిపోతై కలశాలు! ఓహో! పాలనముద్రానివి నీవు!' కలశము లనగా స్తనములే. నూటారవ లేఖలో నాయిక చన్నును ఆమె స్నేహితురాలు పట్టుకొని యదిమి 'లేత ముంజలుకదే'యని యనును. ఆ స్నేహితురాలు నాయకుడు చేసిన 'శృంగార చేష్టలకు ఆనవాళ్లని తాననుకొనే గుర్తులు ఎక్కడ కనిపిస్తే అక్కడ—తాకి చూస్తుంది నాకి చూస్తుంది. ఉమ్ముతుంది తూ తూ అంటూ!' ఆమెయు ఈ నాయకుని సంభోగమునే కోరుచున్నది. నాయిక 'పోనీ, ఆమె కోర్కె ఏదో తీర్చి పారెయ్యకూడదా మీరు? మిమ్మల్ని యింత పిచ్చిగా కోరుతున్న స్త్రీ. కోర్కె తీరకుండానే చచ్చిపోతే పిశాచమై పీడిస్తుందో ఏమో ఆ తర్వాత' అని యనును. ఈ విధముగా ఏ కావ్యనాయిక వ్యభిచారపు సిఫారసు చేయును? ఇవి యీ లేఖలలోని భావములకు మచ్చుతునకలు. నాయికా నాయికలు వ్రాసికొన్న యీ లేఖలు వారి స్నేహితులుగూడ చదువుదురు. 'ఇంత పచ్చిగానా వ్రాసుకొంటారు లేఖలు?' అని వర్ష యను నామె యనును.

సురత వర్ణనము, కామభావ ప్రకటనము నిషిద్ధములుగావు. కాళిదాసు ఉమా సురత వర్ణనము చేసెను. క్షేత్రయ్య మున్నగువారు శృంగార మయమయిన పదములు వ్రాసిరి. మఱి యవి జుగుప్సను కలిగింపవేల? ఇట్టి ప్రశ్నల కానందవర్ధనుడు సమాధానమిచ్చెను. ఆ వర్ణనములు చదువునపుడు పాఠకుల బుద్ధికి స్థలాంతర ప్రచారము లేదు. అది రస పారవశ్యము ననుభవించుచున్నది. అనగా వర్ణనములు చదువునపుడు పాఠకుడు వానితో తాదాత్మ్యము చెందును. లీనమయిన వానిబుద్ధి మఱొక చోటికి పోదు. అతఁడు బాహ్య ప్రపంచమును మఱచును,

ఈ మఱుకువ వల్ల అతని బుద్ధికి జుగుప్స కలుగదు. అసలా భావమే రాదు. కారణ మా కవు లా వర్ణనము లను తమ ప్రతిభాశక్తితో నుదాత్తముగా చేయుట. ఈ 'రాగవైశాఖి' చదువునప్పుడట్టి పారవశ్యము గలుగదు. భావము లుదాత్తములు గావు. మఱి నీచములు. ఫలము జుగుప్స కలుగుట. భీమన్నగారు ఏ మహా కావ్యార్థమును లక్ష్యముగాగొని మేరమీఱిన యీ కుచ మర్దనములను, రాక్షస రతులను, సంభోగ సమృతులను వర్ణించిరి? స్త్రీ పురుషులు సంభోగసుఖము ననుభవించుచున్నారు. సంభోగము లోకమునకు తెలిసినదే. అట్లని, యే మగవాడును తన ప్రియురాలితో నడిబజారులో సంభోగము చేయుటలేదు. సభ్యత యనున దొకటున్నది. లౌకికమయిన సభ్యత కావ్యప్రపంచమున ఔచిత్యముగా అవతరించును.

ఈ రీతిగా ఈ కావ్యము ప్రతిపాదించు జీవన విధానము మానవ సభ్యతా విరుద్ధమయినట్టిది. కవియగు భీమన్నగారు శృంగారరసపోషణము చేయలేక పోయిరి. మహాకావ్యార్థమును సూచింపజాలని సాధారణ కామవర్ణనము లిందు గలవు. కామమును శృంగారరస పర్యాయపదముగా సంభావించుటచే ఈ దుర్గతి పట్టినది. అక్కడక్కడ తత్త్వశాస్త్రపదజాల మున్నంత మాత్రాన, ఆధ్యాత్మికానుభూతి వర్ణించినమాత్రాన ఏదో మహార్థ మిం దిమిడియున్నదను భావము కలుగదు. చివరకు కావ్యకళనుండి దూరమై, చిత్తచైకల్యమును, చపలచిత్తతను ప్రతిబింబించు రచనగా 'రాగవైశాఖి' మిగిలినది.

ఇందు ఎక్కువ లేఖలకు మొదట, చివర పద్యమో పాటయో యుండును. కవిగా నొకచో నిట్లని నాయకునిచే ననిపించిరి. 'నా రచన లెల్ల బంగరుచీరలే నీకు, పద్యాలె లంగాలు, పాటలే వోణీలు, భావాలె చోళీలు, ధ్వనులె యౌవనశ్రీలు, నా సాహితీదేవతా సుందరివె నీవు.' ఆ నాయకుని మాట లెట్లున్నను ఈ లేఖలు లంగాలకు చోళీలకు దగ్గఱ మన్నవాని తత్త్వమును ప్రకటించుచున్నవి. 'మానవు లలో తానొక్కడే గొప్పవాడి ననుకొనేవాడు పరమ అల్పుడు వట్టిమృగం' అని నాయకుని సూక్తి. కాని అతడు మృగదశను దాటినవాడుగాడు. 'ప్రేమ అనేది కామవాంఛకు పర్యాయపదంగా వినబడుతున్నది నేడు. అందుకే దానిపట్లనున్న గౌరవంపోగా, అసహ్యం ఏర్పడింది నాకు' అని నాయిక పలుకును. కాని పాఠకుడు సైత మామెను గౌరవింపలేడు. ఆమెపట్ల ఏవగింపు పెంచుకొనును. నాయిక మాటలు 'ఒజ్జం పుచ్చకాయ' లోకోక్తిని తలపించును.

ఒకానొకప్పుడు అక్కిరాజు ఉమాకాంతముగారు నవీన కవిత్వమునందలి 'పులముడు'ను లెస్సగా వెలువరించిరి. అట్టి పులుముడు 'రాగవైశాఖి'లో అధికముగా నున్నది. భావస్పష్టతలేని పులుముడు సమాసములలో, సిద్ధాంత ప్రాయములయిన వాక్యములలో, వర్ణనములలో గోచరించును. చూడుడు 'పలు భాషలలోని రమణీయ పదజాలాన్నంతా శృంగార రసంతో ముద్దచేసిన ముద్దగులాబివి నీవు'. 'నీవు సనాతన జీవన ధర్మధారవు నాలో! నా చుట్టూగల ఈ సౌందర్య విలసనం అంతా—నీధారాపాత వినిర్గత సుధా తుషార లీలా వికసనమే.' 'ఏ ఇచ్ఛా చాలిత నాద స్వర కల్పనలమో మనం—ఈ విశ్వవీణపై' 'రసం రసాన్ని పొందినప్పుడే ఆనందం' 'శృంగారస్పర్శ లేనిదే రసంకాదు'. ఈవిధముగా పెన్ని యుదాహరణములనైన చూపింప వచ్చును. 'శ్లేషలు, సర్కసుఫీట్లు, సమాసాలు, శబ్దబంధాలు, నీతిబోధలు, నినాదాలు ఆడంబరంగా ప్రదర్శిస్తూ – కేవలం పాండిత్య ప్రకర్షకోసం ఉద్గ్రంథాలు వ్రాసే రింగుమాస్టర్ల' జాబితాలో చేరకుండ తప్పించుకోలేకపోయిరి భీమన్నగారు. పులుముడుగల పైవాక్యముల కర్థమేమి? శృంగారవీర కరుణములను గూర్చి భీమన్నగారు 155 పుటలో చెప్పినదానినే మరల 305 పుటలో చెప్పిరి.

Andre Maurois అనురచయిత 'To the Fair unknown' అను గ్రంథమును రచించెను. అదియు లేఖా గుచ్ఛమే. ఆ రచనా ప్రణాళిక 'రాగవైశాఖి' లో కలదు. అందు జీవితమును చక్కదిద్దు కొనుటకు వలసిన వివేకము సోదాహరణముగా వర్ణింపబడినది. భీమన్నగారి కావ్యము జీవనభ్రష్టతను చూపుచున్నది. 'అంతరాత్మ హెచ్చరికను కూడ వినక దూకుతారు బురదలోకి' కొందరు. 'ఇదంతా నా బలహీనత! కామప్రాబల్యం! ప్రేమ స్థాయికి పెరగలేదు నేను' అని నాయకుడొకచోట ననును. ఆ లక్షణములు నాయకునివా?

—నాగళ్ళ గురుప్రసాదరావు.

# పృథ్వీ భాగవతము

[పృథ్వీభాగవతము (పృథ్వీరాజ ప్రబంధము); రచయిత: విద్వాన్ బీర్నీడి ప్రసన్న, ప్రతులకు: బి. కృపావరదాన కవి; వినుకొండ: గుంటూరుజిల్లా; 143 పేజీలు వెల: రూ 2–50.]

ప్రబంధ రచన అంతరించిపోయిం దనటానికి వీల్లేకుండ, ఆధునికకాలంలోనూ ఒకటీ, అలా ప్రబంధములు వెలువడి పూర్వప్రబంధాలకు దీటుగా నిలచి, అజరామరమైన కీర్తిని పొందుతున్నాయి. పూర్వకావ్యాలలోని ఇతివృత్తాన్ని స్వీకరించాలనే పూర్వకవుల భావాన్ని గౌరవించి, అష్టాదశ వర్ణనలతో పెంపొందించి, నవరసాలనూ నిర్వహించి సర్వాంగసుందరమైన ప్రబంధాన్ని రచించాలనే తలంపుతో నేటి కవులు ప్రబంధ నిర్మాణానికి పూనుకుంటున్నారు. ప్రతిభాశాలురైన మధునాపంతుల, గడియారం, దుర్భాక ప్రభృతులు ఆంధ్రపురాణము; శివభారతము; రాణాప్రతాపసింహచరిత్ర వంటి ప్రథమశ్రేణి ప్రబంధాలను రచించి కీర్తిని గడించారు. వసుచరిత్ర యెన్ని పిల్లల్ని పెట్టినా ఆధునిక కవులు వ్యామోహంతో మరికొన్ని వసుచరిత్రలు రచించకుండా స్వీయమైన ప్రతిభతో చారిత్రిక, సామాజికేతివృత్తాలను పైతం గైకొని ప్రబంధరచనను కొనసాగిస్తున్నారు. చారిత్రకేతి వృత్తానికి తగుమాత్రమైన మార్పులుచేస్తూ, సంప్రదాయాన్ని శిరసావహించి విద్వాన్ బీర్నీడి ప్రసన్నగారు రాజ చరిత్రకు, భాగవతేతిహాసంతో సామ్యాన్ని కల్పించి పృథ్వీభాగవతాన్ని వెలయించారు.

పృథ్వీభాగవతం షష్ఠస్కంధాల విశిష్ట ప్రబంధం. పూర్వకవుల కవిసమయాలను శిరసావహిస్తూనే, అలంకారాలతో ప్రబంధాన్ని అలంకరిస్తూనే, వీలైనంత వ్యాకరణ సమ్మతంగా రచన కొనసాగించి, కథాగతిని కుంటువడనీయకుండ, వర్ణనల వ్యామోహంలో కథను విస్మరించకుండ, ప్రబంధకవుల అతివేలమైన శృంగారాన్ని మోతాదులోనే గ్రహించి, కొన్ని నూత్నకల్పనలతో ప్రబంధకన్యకు మరొక నూతనాభరణాన్ని చేకూర్చారు. ప్రబంధకన్య కిప్పుడున్న నగలే బరువని నూతనమైన సొగసులు దిద్ది తీరుస్తున్న కవుల మార్గం యీ కవికి రుచించదు.

ఈ కవి సత్సంప్రదాయాలను పాటించటంలో నిష్ఠ గలవాడు. తన కృతిలో ప్రతి ఆశ్వాసాంతంలోనూ షష్ఠ్యంత రచనగూడ కొనసాగించినవాడు. అన్నింటికన్న విశిష్టమైన అంశం 'కవిసమ్రాట్' కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారికి యీ కృతిని అంకితమివ్వటం. సుదీర్ఘమైన కృతిస్కంధంలో కవి శ్రీ బీర్నీడి ప్రసన్న విశ్వనాథ వంశ వృక్షాన్ని, విశ్వనాథవారి కవితా వైశిష్ట్యాన్ని వేనోళ్ల కొనియాడారు. విశ్వనాథ పితృపాదులు కీ. శే. శోభనాద్రిగారి దాతృత్వాన్ని చక్కని సీసంలో ప్రస్తుతించారు. దాతృత్వ ఫలితంగా శ్రీ విశ్వనాథ వంశము 'అకులద్యుజియించి మోడయిన గొప్పమహీరుహ మట్టు లెంతయో యలరెను సద్యః కిసలయంబు చిగుర్చ వినూత్న శోభలన్' అని వర్ణించుట వినూత్నము; అర్థవంతము; ఆహ్లాదకరము. చలితో వణకే దరిద్రునికి తనమీదనున్న వస్త్రం దానంగా ఇచ్చిన సుకృతాత్ముడు శ్రీ శోభనాద్రి.

శ్రీ విశ్వనాథవారి కవితా వైశిష్ట్యాన్ని కొనియాడుతూ శ్రీ ప్రసన్నకవి,

'పదపదమ్మున సాహితీ పథములందు
నన్నయా? తిక్కనా? పోతనా? యటనెడి
విభ్రమమున దర్శనమిచ్చు విశ్వనాథ
సత్యనారాయణ సుకవి చక్రవర్తి'.

యని వర్ణించారు. కాని యీ ఊహ సరియైనది కాదు. శ్రీ విశ్వనాథవారి పదములు నన్నయ తిక్కన పోతనలను తలపింపవు అట్లు తలపించుటకాయన అభినవ నన్నయ, అభినవతిక్కన, అభినవపోతన కాదు. వీరందరి కంటె విలక్షణమైనశైలి శ్రీ విశ్వనాథవారిది. ముమ్ముందు అభినవ విశ్వనాథకవులే వెలయవచ్చునేమొ! శ్రీ విశ్వనాథవారికి ఏమతమునకు చెందిన కవియైనా ఏకులానికి చెందిన కవియైనా సమానమైన యాదరమే కలదని పేర్కొన్నారు. అట్లుండుట ముదావహమే. కాని 'ఒకపంచమకవి కృతికుపశ్రుతి వెలార్చో దెలుఁగున వీరియింత తొలకరింప'యని పలికినపద్యంలో కవి వినయాన్ని ప్రకటించినట్లు గాక తనను తాను కించపరచుకొని మరికొందరు కవులను కించపరచినట్లైనది. కులాలమతాల కుమ్ములాటలకు అప్రస్తుత సమయంలో చోటిచ్చి విశ్వనాథవారిని 'బ్రాహ్మణ

గణి'గా స్తుతించటం సహించదగినదిగా లేదు. శ్రీ విశ్వనాథవారి కృతులను పేరుపేరునా వివరిస్తూ, వైశిష్ట్యాన్ని వెల్లడించిన ప్రతిపద్యమూ వాక ఆణిముత్యమే.

కృతిస్కంధంలో పాఠకహృదయాన్ని చూఱ గొనే మరొక అంశం: అకాలమృత్యువు వాతబడి, కవిగా పేర్గాంచకముందే రాలిపోయిన తన సోదరుడు విజయదత్తుకై విలపించిన తీరు. హృదయవిదారకంగా

'ఎవడురా యా మెదడులేని సృష్టికర్త
మన కుటుంబానఁ గయితలమనంగ మలఁచి
తెనుఁగుగడ్డను సిరియింత గలుగనీక
జీవితమ్ముల వ్యథలకుఁ జేసినాడు?' అని ఆక్రో

శించటం పాఠకులందరికీ కన్నీళ్లు తెప్పిస్తుంది. విజయదత్తు భౌతికదేహం పంచభూతాలలో ఐక్యం కావటాన్ని కవి సీసపద్యంలో మనోజ్ఞంగా వర్ణించారు. కావ్యంలో రసవద్ఘట్టాలన్నీ ఒకయెత్తు కాగా, కృతి స్కంధంలోని యీ ఘట్టమొక యెత్తు.

కావ్యసౌందర్యాన్ని విశదీకరిస్తూ శ్రీ దివాకర్ల, శ్రీ మద్దులపల్లిగారల పీఠికలు ముంజేతి కంకణాల వలె మెఱుగు లీనుతున్నాయి. కావ్యంలోని అందచందా లను, పలువిధాలుగా వివరించి ఉదహరించి సద్విమర్శను వెలయించారు శ్రీ మద్దులపల్లి సత్యనారాయణశాస్త్రి.

పృథ్వీరాజ చరిత్రకు భాగవతంతో సామ్యాని సమకూర్చటం సాహసంతో కూడుకొన్నపని. రుక్మిణీ దేవికి సంయుక్తకు పోలిక లుండటం సహజంకావి, శ్రీకృష్ణుని ప్రవృత్తికీ, పృథ్వీరాజు మనస్తత్వానికీ పోలిక లున్నాయనటం సరికాదు. ప్రణయ సంబంధ మైన విషయాలలో మరీ వ్యత్యాసం కన్పిస్తుంది. పైగా యీ కావ్యనాయకుడైన పృథ్వీరాజు.

'ఏకపత్నీవ్రతుఁడు రాఘవేశ్వరుండు
మా ప్రవర్తనా ప్రథితకు మార్గదర్శి
వలదువలదన్న బ్రేఁబడవాంఛసేయు
కామినికి భామ! నాసికాఖండనంబు.'

అని పలికి, సంయుక్త చెలికత్తె తనను పరీక్షించే టందుకువచ్చి, మోహాన్ని నటించగా త్రోసిపుచ్చు తాడు. చారిత్రక సత్యమిందుకు భిన్నంగా 'పృథ్వీరాజ రాసో'వంటి హిందీ గ్రంథాలవలన పృథ్వీరాజుకు ముప్పురు భార్య లున్నట్లు తెలుస్తున్నది. చారిత్రక ప్రబంధాలను రచిస్తున్నప్పుడు కల్పనలుచేసినా, వాస్త వాన్ని మభ్యపుచ్చటం మంచిదికాదు. పృథ్వీరాజు ఏకపత్నీ వ్రతుడని కవిగారి మతాన్ని అంగీకరిస్తే శ్రీకృష్ణుని ప్రవృత్తితో పృథ్వీరాజును పోల్చటం మరీ అసమంజ సంగా ఉంటుంది. భాగవత కథతో జోడించటానికి వీలుగాఉండే పద్యంచూస్తే సంబంధ మెంతమాత్రమో బోధపడుతుంది, ఆ పద్యమిది.

'నీ దేహంబునఁబుట్టి నీకు వ్యథగా
నీ దాయ నర్చించు ప్రహ్లాదన్నన్నుక్షమించి
మద్విభవ సౌఖ్యాకాంక్షివై
తొంటినీ యౌదాసీన్యము
నీ హిరణ్యకశిపు వ్యాపారముల్ మాని స
మ్మోదాంతంబగు నూత్నభాగవతమున్
బోల్పించి బుల్పించుమా'

పై పద్యంలో కవికి భాగవతకవితపై గల మిక్కుట మైన అభిమానం, పృథ్వీరాజు చరిత్రకు భాగవతాన్ని ముడిపెట్టినట్లుగా తోస్తుంది. కావ్యంలో ఔచిత్య నిర్వాహణపట్ల తగినంత శ్రద్ధ కన్పించదు. ఉదాహర ణకు మునివేషంలోవచ్చిన చెలికత్తెను గుర్తింపలేక, పృథ్వీరాజును గూర్చి ప్రశ్నిస్తున్న సంయుక్తమౌనుల మాహాత్మ్యాన్ని ఉగ్గడిస్తూ, తన జేనిపై వలపు వౌని వర్ణ్యనకు తెలియనిది కాదుగదా! యనిచెప్పి 'గుడిని మింగెడువారి కప్పడ మదెంత?' అని యంటుంది. పై వాక్యం మునిని హేళన చేస్తున్నట్లుంటుందే గాని గౌరవించిన విధంగా ఉండదు. మునివేషాన్ని తొలగిం చిన తరువాతగదా సంయుక్తకు ముని తన చెలికత్తెయే నని తెలియుట. ఇట్టివి దోషలేశాలే కావచ్చు. కాని ఔచిత్య నిర్వహణలో తగు జాగరూకత అవుసరం.

చక్కని తెలుగు పదాలను సంస్కృతీకరించి వాటికి గొప్పదనాన్ని ఆపాదించ బూనుకోవటం అప సవ్యమైన విషయం. కాకపోతే 'రామాయణ కల్ప వృక్షము' అనే మాటను 'రామాయణ సురభూమీ రుహము' అనటమూ, 'వేయిపడగలు' అనే గ్రంథాన్ని 'సహస్రఫణిగా' సంస్కృతీకరించటమూ ఏమి సబబు? ఈ వ్యామోహం ఎన్నో అనర్థాలను తెచ్చిపెడుతుంది. ఉదాహరణకు 'కళ్లు కాయలు కాచినవి' అనే మాటల లోని 'అర్థస్ఫూర్తి' 'నేత్రముల్లు ఫలముల్కాచినవి'

అంటే రాదుగదా! శ్రీ ప్రసన్నకవి సంస్కృతీకరించిన పదాలు పై జెప్పినంత ప్రమాదాన్ని కలుగజేయక పోయినా, వాటి నసలు సంస్కృతీకరించివలసిన అవసరమే ముంది? ఈవిధమైన పెడమార్గాన్ని కవి అనుసరించ రాద నే సహృదయుల విన్నపం.

పృథ్వీరాజు ఘోరీని వధించిన దృశ్యం రసో త్పత్తిని కలిగించి పాఠకుల హృదయాల్ని ఆకట్టు కొంటుంది. 'చంపదగినయట్టి శత్రువు తనచేత, జిక్కినపుడు పొసగమేలుచేసి పొమ్మనుటె చాలు'నసే సూక్తి అవశ్యమూ ఆచరించదగినదే. కాని కుటిలాత్ము డైన ఘోరీ పెక్కుమారులు తనచేతఁ జిక్కినా చంపక వదలివేయటం మానవునిగా పృథ్వీరాజు విలు వను పెంచుతుందేగాని, రాజనీతిజ్ఞునిగా పృథ్వీరాజుకు మచ్చనే కొనితెస్తుంది. ఈ విషయంలో కవిగారికి స్పష్టమైన అభిప్రాయం యీ కావ్యంలో కన్పించదు. పృథ్వీరాజు ఘోరీని విడిచిపుచ్చటమే ఉత్తమమైన రాజనీతిగా కవిగారు భావిస్తున్నారేమో తెలియదు. పృథ్వీరాజునకు కవిమిత్రుడైన చాంద్‌భట్టు సహాయం మరువలేనిది. అతడి పాత్రకు కవిగారు న్యాయం చేకూర్చినా రనిపిస్తున్నది. పృథ్వీరాజు, సంయుక్తల విరహంలో కవి ప్రబంధోచితమైన శైలినే అనుస రించారు. జాతీయాలు, నానుడులు, సామెతలలోనే గాని భావుకత్వంలో నూతనత్వంలేదు. నూతనత్వాన్ని వా రభిలషించారనీ తోచదు.

'కృతజ్ఞత'లను తెలియజేస్తూ 'వినుకొండపురీమ తల్లి శిఖలోని హారమందు ధవళముగావిచ్చి పెల్లుగ గుమాళించు జీవపు బొండుమల్లియలు'గా పలువురు కవులను పేర్కొని, వినుకొండకేచెందిన 'నవయుగ కవి చక్రవర్తి' జాషువా కవిని వదలివేయటం విస్మ యాన్ని కలిగిస్తుంది. మఱచిపోయారో కావాలనే వదలివేశారోగాని 'వినుకొండ'కు చెందిన కవులను గుఱించి చెప్పే సమయంలో జాషువాకవిని పేర్కొ నటం న్యాయం.

## కాంతిరేఖలు

[కాంతిరేఖలు (కవితలు). కవి: జగత్‌నాథ్: ప్రచురణ: సమతా ప్రచురణలు, విశాఖపట్నము. 68 పేజీలు: మూల్యం: రూ 1—50. ప్రతులకు: ఎ. జగన్నాథరావ్ C/o ఎ. యస్. రావునాయుడు, లోపేడు లక్ష్మీపురము; భామూరుపోస్టు (via) పాల కొండ; శ్రీకాకుళముజిల్లా.]

ఛందస్సు సంకెళ్లుగా మారిందని, ఆ సంకెళ్లను విదల్చి స్వేచ్ఛాపథంలో కవితల్ని నడిపిస్తున్నవారు గూడ ఏదో ఒక రీతికో, శైయికో కట్టుబడి, వాళ్లకు తోచిన క్రమాన్ని యెన్నుకుంటున్నారు. విశృంఖలంగా కవితల్ని వెలువరించిగూడ గుండెకు పట్టేవిధంగా, 'కానరాకే కదలిపోయేవిధంగా' కవిత్వం చెప్పగలిగినవాళ్ళూ ఉన్నారు. ప్రతిభావంతులైన ఆధునిక కవులు పెక్కురు, బంధాలని అనుకొని కావ్యసౌందర్యాన్ని యినుమడింపజేసే యెన్నో అలంకారాలను త్రోసిరాజని, క్షుద్రమైనవీ, అల్పమైనవీ జుగుప్స కలిగించేవీ అయిన ఉపమానా లెన్నింటినో తమ భావనా బలానికి అలంబ నంగా తెచ్చుకొంటున్నారు. ఏమయినా పాఠకుని అభి రుచిమాత్రం గీతి మాధుర్యాన్ని అందించే కవితను స్వీకరించినంత ఆసక్తితో, తద్విరుద్ధమైన కవితల్ని ఆదరించటంలేదు. ఆవిధంగానే విశృంఖలంగానే వచ నమూ, గీతమూ కాని పద్ధతిలో వ్రాసినా ఆదరాన్ని పొందిన కవులున్నారంటే వారు మిక్కిలి ప్రతిభా వంతులు. శాసించటమనికాదుగాని వారుకూడ వారి వారి కవితలొదిగేరీతినే గీతాన్ని యెంచుకుంటే మరింత బాగుంటుందేమో! ఏమి చెప్పటమన్న దేతం ముఖ్యమో ఎలా చెప్పటమన్నదిగూడ అంత ముఖ్యం గదా!

కవిత్వం వెలువడటానికి భావనాసమాధి అత్యవ సరమని అన్నికాలాలలోనూ అంగీకరింపబడుతున్న సత్యం. ప్రతిచిన్నసమస్యా కవిని కదలించవచ్చు. అంత మాత్రంచేత కవి కావ్యరచనకు పూనుకోడు. ఋషి యైన కవి భావనా సమాధిలోనే కవిత్వం చెప్పగలడు. మఱి నేడుండి రేపుపోయే సమస్యలు, కేవలం వార్తల ప్రాముఖ్యం మాత్రమే ఉన్న సమస్యలపైగూడ కవి తల్ని వెలయిస్తున్నారు కొందరు. వీళ్లను 'జర్నలిస్టు కవులు' అనాలేమో! వారి నలా వ్రాయకూడదని సమాజ మెప్పుడూ శాసించలేదు, శాసించదుకూడ. కాలమే వాటికి జవాబు చెపుతుంది. ప్రతిభ ఉంటే అతిచిన్నసమస్యే విశ్వరూపం దాల్చి, విశ్వజనీనమై, ఎల్లకాలాలకూ నిలుస్తుంది. ప్రతిభలేని రచనలు

పిత వార్తాపత్రికల విలువనే పొందుతాయి.

ఈ కవితాఖండికలలో గీతి మాధుర్యంలేని గీతాలిన్నే ఉన్నాయి. ప్రతిభావంతంగా రాజకీయ సమస్యలలో తీర్పు చెప్పగలిగిన మేటి ఈ కవి అని కొన్ని కవితలు చాటి చెప్పగలవు.

'మంచిచెడ్డలు', 'పారిపోతున్న దేవుడు' అన్న రెండు రచన లీ కావ్యంలో విశిష్టమైనవి. 'మంచి చెడ్డలు' అనే రచనలో

'జన్మతః యే మానవుడు
దుర్మార్గుడు కానేకాడు
జాతివలన యే మనిషైనా
నీతిపరుడు కావగబోడు' అని మానవ నైజ

స్వరూపాన్ని దర్శింపజేసి

'మంచివాడు మానవుడైతే
మారణాయుధాలు యెందుకు?
చెడ్డవాడు మానవుడైతే
శాంతికొరకు యాతనెందుకు? అని ప్రశ్నిస్తారు.

'పారిపోతున్న దేవుడు' అనే గీతంలో లోకంలో అన్యాయపరులు దేవునిపేరిట మోసాలుచేస్తూ దేవుణ్ణే గర్భ గుడిలో బంధించామనుకోగా 'పారిపోతున్న దేవుడు' లోకనైజాన్ని ఏ కరువు పెడతాడు. మూఢభక్తులు భ్రుకుటి ముడిచినా చివరంటా చదివాక కవి చిత్తశుద్ధిని మెచ్చుకోకపోరు. 'తియ్యనిరేపు'; 'సర్వజ్ఞుడు'; 'తీరికలేనివాడు' అనే గేయాలు పాఠకులు తీరికుంటే చదవదగినవి. ఏమంటే గేయమంతా సామాన్యంగానే నడిచి చివర్న చురుక్కుమంటూ సూక్తి వెలువడి విస్మయాన్ని కలిగిస్తుంది యీ గీతాలలో. 'సందేశము' అనే గేయం 'దేశచరిత్రలు' అనే శ్రీ శ్రీ గేయానికి అనుకరణ. అనుకరణ శైలిలోగాని భావంలో కాదు; కాదు గనుగనే

'ఏ పార్టీ రాజ్యమేలినా
యేమున్నది గర్వకారణం' అనగలిగారు. అథార్టీ, మెజార్టీ అంటూ కొన్ని ఇంగ్లీషు పదా లుపయోగించారు. తప్పనిసరయినచోటతప్ప తూగుకోసం ఆ పదాలను వాడటం వెగటు పుట్టిస్తుంది. 'కర్తవ్యము' అనే గీతంలో కవి కర్తవ్యాన్ని నిర్దేశిస్తూ

'రచయితగా సమాజానికి
వచించవలసింది వ్రాయాలి' అన్నారు — పౌరబాటు. కవితావేశాన్ని పొందిన కవి భావనా సమాధి మగ్నుడై కావ్యాన్ని వెలువరిస్తాడు. కవిక్రాంతదర్శి. సమాజం తరువాతెప్పుడో కవి ఊహల్లో సంచరిస్తుంది, అందుకు "Poets are the Unacknowledged legislators of the world" అని పేరు పొందారు.

పేలవమైనవీ, ఏమాత్రమూ కవితావాసన సోకనివీ రాజకీయోపన్యాసా లనదగినవీ కొన్ని గేయాలిందులో చేర్చబడ్డాయి. ముందుగానే యీ సమీక్షలో మనవిచేసినట్లు అవి వార్తాపత్రికలలోని వార్తల గౌరవాన్నే పొందుతాయి. ఉదాహరణకు 'యువకుడా'; 'సత్యాసత్యాలు'; 'ప్రజాస్వామ్యము'; 'ఏది గొప్పదేశము'; 'ప్రజాస్వామ్యములో' మొదలైన గేయాలు పేలమైనవి.

రాజకీయసమస్యలే అధికంగా యీ కవిని భావోద్రేకానికి గురిచేసినట్లు తోస్తున్నది. శ్రీ సి. నా. రె చెప్పినట్లు, మహాకవి వాక్యమైన 'మంచియన్నది పెంచుమన్నా' అన్నది యీ కవి యీ కవితలలో చెప్పిన విషయమైతే అవశ్యం యీ కావ్యానికి స్వాగత మీయవలసిందే!

—రామమోహనరాయ్.

## స్వప్న వాసం

[కథలు. రచన: ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి, ప్రచురణ: నవ్యభారతి, 3—6—760 హిమాయత్‌నగర్, హైదరాబాద్ — 29. పుటలు: 156 వెల: రు. 4—00]

ఇందులో పదిహేను కథలున్నాయి. అన్నీ ప్రచురణార్హం కావు. వారపత్రికల పుటలు నింపేందుకు తప్పనిసరిగా ఆయాసంపాదకులు ఒకమోస్తరు రచనల్ని ప్రచురణకు అంగీకరించవలసి వస్తున్నది. ఆ శ్రేణికి చెందినవి యిందులోని కథలు. 'స్వప్న వాసం' అనే కథలో ఆడవాళ్లపట్ల 'హీరో' వెకిలితనం వ్యక్తమైంది కాని రచయిత అనుకున్నట్టు 'జాలీ', 'ప్రేమా' కాదు! 'అనుభవాతి' అనే కథలో మగవాళ్ల స్వార్థాన్ని గురించీ, భార్యలకు కాస్త స్వాతంత్ర్యం కూడా యివ్వలేని వారి సంకుచితత్వాన్ని గురించీ వ్రాస్తూ కథంతా 'ఏదో', 'ఏవో' అనే మాటలతో

నింపివేయడం జరిగింది — 'సస్పెన్స్' సాధించాలని తాపత్రయం కాబోలు! మగవాళ్ల సంకుచితత్వాన్ని గురించి రవి చేసిన రిసెర్చి, అతణ్ణి ఉద్ధరించాలను కొన్న స్నేహితుడు మధు మళ్లీ ఆ రిసెర్చిమీదే ప్రయాణం కావటంతో ముగిసింది! చెయ్యి తలవెనుకగా తిప్పి ముక్కు పట్టుకున్నంత Silly గా ఉంది ఈకథ. 'గొడుగు దొంగ': గొడుగుపోయె, గొడుగువచ్చె ఢోల్ ఢోల్ ఢోల్ అనే కథ. 'కొత్త అమ్మ' అనే కథ ముగింపు: పిల్లలకి (తనకూ) ఆడదిక్కులేదని మళ్లీ పెళ్లి తలపెట్టిన తండ్రితో "ఇంకో అమ్మ వద్దు... గౌరే (వంటలక్క) మాకు అన్నం వండిపెడుతుంది" అంటారు పిల్లలు. తండ్రికి గౌరితో సంబంధం వుందని తెలిసి దాన్ని బయటికి గెంటెయ్యాలని మొదట్లో ప్రయత్నించి, చివరకి వాళ్లు అలా అంగీకరించి అనటంలో, రచయిత పరిష్కారాన్ని స్పష్టం చెయ్యలేదు. తెలిసిన మనిషికాబట్టి గౌరినే పెళ్లి చేసుకొమ్మని వాళ్ల సలహానా? లేక, పోనీ దానితో రంకు సాగించుకో, మా అభ్యంతరం ఉండదు, దానికి 'అమ్మ' అధికారంమాత్రం కట్టబెట్టవద్దు అని అర్థమా? రెండోదే రచయిత ఉద్దేశమైతే అది పరిష్కారం ఎలా అవుతుంది? ఇటువంటి పరిష్కారాలని సూచించే రచయిత సంస్కారం ఏపాటిదో ఊహించుకోవాల్సిందే! సంస్కారం, గట్టివివేచనా, రచనకు ముఖ్యం. అవి లోపించటం మూలంగానే అర్థం పర్థం లేకుండా తయారైన కథలు: రంగు బొమ్మలు, భంగపాటు, స్వామివారి ఉత్సవం. నైతిక దృక్పథమే అక్కరలేదు, కరుణ, ఔదార్యము, సౌందర్యానురక్తి మానవతాదృష్టివంటి ఏదో ఒక చిత్త సంస్కారము స్పృశించని 'వాస్తవికత' రచనలో రాణించదు! ఈ పుస్తకానికి, 156 పుటలకు, నాలుగు రూపాయలా?

—ఆర్. ఎస్.

### అంతరాణి

కావ్యం: రచయిత: శ్రీ స్ఫూర్తిశ్రీ. పుటలు: 60. వెల: రూపాయిన్నర. ప్రాప్తిస్థానం: విపంచికా ప్రచురణలు; రామారావుపేట; కాకినాడ.

### చిట్టి శతకము

పిల్లల నీతిశతకం: రచయిత: శ్రీ వల్లభనేని కాశీ విశ్వనాథం. పుటలు: 22. ప్రాప్తిస్థానం: ప్రజా ప్రచురణలు, పవరుపేట, ఏలూరు.

### మధుర వేదన

కావ్యం. రచయిత: శ్రీ చిలకమఱ్ఱి రామానుజాచార్యులు. పుటలు: 60. వెల: రూపాయిన్నర. ప్రాప్తిస్థానం: సాహితీబంధు బృందం, వరంగల్లు.

### శాంభవీ శతకము

శక్తివైభవం తెలిపే ప్రౌఢ శతకం. రచయిత: శ్రీ ముదిగొండ శంకరశాస్త్రి. పుటలు: 24. వెల: 0—75. ప్రాప్తిస్థానం: శ్రీ ముదిగొండ శంకరశాస్త్రి, 8/1807, జయప్రకాశ్‌నారాయణ్ రోడ్డు, వరంగల్.

### శివ కిరణములు

కావ్యం. ప్రథమభాగం. రచయిత: శ్రీ ముదిగొండ శంకరశాస్త్రి. పుటలు: 58. వెల: రు. 1-50. ప్రాప్తిస్థానం: శ్రీ ముదిగొండ శంకరశాస్త్రి, 8/1007, జయప్రకాశ్‌నారాయణ్ రోడ్, వరంగల్.

### వీర పూజ

కడప మండలంలో వీరమరణం చెందిన 'అమ్ముల వీరన', అతని పత్ని చరిత్ర ఇతివృత్తం గాగల కావ్యం. రచయిత: శ్రీ నారునాగనార్య. పుటలు: 108. వెల: రు. 2—00. ప్రాప్తిస్థానం: శ్రీ నాగునార్య, కోడూరు, కడపజిల్లా,

### నీలాటి రేవు

గేయసంపుటి రచయిత: శ్రీ తుంగమర్తి విశ్వనాథశాస్త్రి. పుటలు: 58. వెల: 1—00. ప్రాప్తిస్థానం: పోతుకూచి ఏజన్సీస్, 208. మ్యాబోయిగూడ, సికిందరాబాద్.

### శ్రీనివాస కల్యాణం

కావ్యం. రచయిత: శ్రీ కృత్తివెంటి వేంకటేశ్వరరావు. పుటలు: 120. వెల: 2—00. ప్రాప్తి

స్థానం: వేంకటేశ్వర గ్రంథమాల, కొత్తపేట, గుడివాడ.

అల్లూరి సీతారామరాజు

నాటకం— రచయిత: మధురశ్రీ. పుటలు: 152. వెల: 3-00. ప్రాప్తిస్థానం: ప్రజా ప్రచురణలు, ఏలూరు.

తృష్ణావర్తము

కావ్యం. రచయిత: శ్రీ బోడేపూడి వేంకటరావు. పుటలు: 50. వెల: 1-50. ప్రాప్తిస్థానం— త్రివేణి పబ్లిషర్స్, మచిలీపట్టణం, మదరాసు.

జానకీపతి శతకం

రచయిత: శ్రీ కంచర్ల పాండురంగశర్మ. పుటలు: 35. వెల: 0-50. ప్రాప్తిస్థానం : మధురభారతీ గ్రంథమాల, వినుకొండ.

అమ్మా, అమ్మ వాక్యాలూ

మాతృశ్రీ జిల్లెళ్ళ అమ్మగారి వాక్యాల సంకలనం. సంకలన కర్త— డాక్టర్ శ్రీపాద గోపాల కృష్ణమూర్తి. పుటలు - 208. వెల- లైబ్రరీ ఎడిషన్: రూ. 5-00. పాపులర్ ఎడిషన్: రూ. 4-00. ప్రాప్తిస్థానం—మాతృశ్రీ పబ్లికేషన్స్, స్టేషన్‌రోడ్డు, బాపట్ల.

నీతి మాలిక

65 నీతిపద్యాల గుచ్ఛం.రచయిత: శ్రీముడుంబి వేంకటరమణాచార్య పుటలు— 18. వెల: 0-25. ప్రాప్తిస్థానం: ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ, మద్రాసు, తెనాలి, హైద్రాబాద్, గుంటూరు, రాజమండ్రి.

రఘునాధ శతకము

రచయిత: శ్రీ రెండుచింతల లక్ష్మీనరసింహ శాస్త్రి. పుటలు: 74 వెల 1-50. ప్రాప్తిస్థానం- రాజ్యలక్ష్మి పబ్లిషర్స్, తెల్రపోలు, కృష్ణా జిల్లా.

విశ్వపురుషుడు రమణుడు

రచయిత: శ్రీ ఎం. ఆర్. నాగేశ్వరరావు. పుటలు: పాకెట్ సైజు 34. వెల—0-50 ప్రాప్తిస్థానం - రమణవాణీ ప్రచురణలు, గుడివాడ.

సౌందరనంద నాటకము

సుందరీనందుల ఇతివృత్తం ఆధారంగా రచించిన నాటకం. రచయిత: శ్రీ రూపనగుడి నారాయణ రావు: పుటలు: 104. వెల: 2-00. ప్రాప్తిస్థానం : మహానంది పబ్లికేషన్స్, 4/659, శాంతి నగర్, గుంతకల్లు.

ఉన్మత్త రాఘవము

సంస్కృత ప్రేక్షణికమునకు తెలుగు. తెలుగుసేత. శ్రీ రూపనగుడి నారాయణరావు. పుటలు 28. వెల: 0-50. ప్రాప్తిస్థానం - మహానంది పబ్లికేషన్స్, 4/659, శాంతినగర్, గుంతకల్లు.

ఖండకావ్య చతుష్టయము,
పంపాపురీ శతకము

రచయిత: శ్రీ రూపనగుడి నారాయణరావు. దీనిలో రాణివాసము, విజయనగర పతనము, తళ్ళికోట యుద్ధము, విజయనగర విధ్వంసనము అనే నాలుగు ఖండ కావ్యాలు, శిథిల విజయనగర పర్యటనం వర్ణించే పంపాపురీ శతకము అనేవి ఉన్నాయి. ఈ రచనలకు పీఠికా ప్రాయంగా శ్రీ సీరిపి ఆంజనేయులు రచించిన శ్రీ రూపనగుడి నారాయణరావుగారి జీవిత చరిత్ర (42 పుటలు) వుంది. మొత్తం పుటలు—100. వెల - తెలియదు. ప్రాప్తిస్థానం—విజ్ఞానవల్లి గ్రంథ మాల, అనంతపురం.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna
The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1.
Editor: S. Sambhu Prasad